# ఆంధ్రసచిత్రవారపత్రిక

సినిమా శీర్షికలో: స్వరలహరి



25 న.పై
5-8-59

ANDHRA PATRIKA
ILLUSTRATED WEE



"కార్మిక విజయం" [మద్రాసు బీచ్‌లో ప్రతిష్ఠించిన శిల్పం]

శిల్పి: దేవీప్రసాద్ రాయ్‌చౌధురి—ఫొటో: సోమయాజులు




బసంత్ పిక్చర్సు వారి

# వీర ఘటోత్కచ

## వత్సలా కళ్యాణం

తెలుగు

మాటలు, పాటలు • దర్శకత్వం • సంగీతం

శ్రీ శ్రీ • బాబూభాయిమిస్త్రీ • చిత్రగుప్త




FLOODLIGHT

వాడియా బ్రదర్సు ప్రొడక్షన్ • తెలుగులో నిర్మాణం: ఫిలింసెంటర్ మద్రాసు

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

Founder
K. Nageswara Rao

స్థాపితము
1908

★

సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

★

సంపుటము 53
సంచిక 44

5-8-59

శ్రావణ శుద్ధ ప్రథమ

★

విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0

★

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, వంబుచెట్టివీథి
మదరాసు-1.


# విషయానుక్రమణిక



# ఉత్తరాలు

## "యక్షప్రశ్నలు"

ఆర్యా,

ఇటీవల ముగిసిన "యక్షప్రశ్నలు" హాస్యరచన చదువుటకు చాలా బాగుంది. హాస్యపు మాటలను వేయుటలో "సుకుమార్" గారి కలం బాగా పని చేసింది. ఒక చిత్రం తీయుటలో కలిగే కష్టనష్టాలు, చిత్రపరిశ్రమలోని లోటుపాట్లు చక్కగా వివరించి వ్రాశారు. ఈ యక్షప్రశ్నలను ఇంకా సీరియల్ గా, ఇంకా చిత్రపరిశ్రమలోని లోటుపాటును వివరిస్తూ వ్రాస్తే బాగుంటేది. "సుకుమార్" గార్కి నా ధన్యవాదాలు.

కొమ్మూరి చలపతిరావు
కాకినాడ]

ప్రచురింపబడేవిషయాలు, విజ్ఞానం, వినోదం ఇవ్వాలి. కానీ "యక్షప్రశ్నల" వలే విసుగెత్తించేవిగా యుండకూడదని నా సలహా.

పి. మధుసూదనరావు
మహబూబాబాద్.]

## నెమళ్ళరాజ్యం

జి. భానుమతీదేవి గారు వ్రాసిన "నెమళ్ళరాజు" కథ చాలబాగుందండి. నిజంగా నెమళ్ళరాజ్యం అని, కోతుల రాజ్యం అని వున్నాయా అండి. నిజంగా వున్నాయని మా చెల్లెలుకూడా 'నెమళ్ళ రాజునే పెళ్ళాడాను' అంటోంది ఈకథ చదివినప్పటి నుండి. కనుక వాస్తవం తెలియపరచమనండి.

టి. రాజేంద్ర, బెంగుళూరు.]

## ప్రశ్నావళి

8-7-59 తేదీని ఆంధ్ర వారపత్రికలో మీరు ప్రచురించిన అభిప్రాయ సేకరణ ప్రశ్నావళి యత్యంత యుపయుక్తమును, అత్యంత యువసరమును, విజ్ఞానదాయకమును ప్రబోధాత్మకమునైయున్నది కాన మీరు దయతో మాసమున కొక్కమారైనను నిట్టి ప్రశ్నలను సాంఘిక, ఆర్థిక, నైతిక, విద్యావేత్తలనుండి సంగ్రహించి ప్రకటించవ గోరుచున్నాడను.

జీ. జే. శామ్యుయెల్
కాకినాడ.]

## సలహా

కథలూ, సీరియల్ ప్రకంటె కూడ, కబుర్లు, వ్యాసాలూ ఆఖరికి వార్తలుకూడ ఎన్నో రెట్లురుచికరంగా ఉండొచ్చునని మీ వారపత్రిక తిరుగులేకుండా రుజువు చేసింది. ఆ చదివించే శక్తిని అలానే పోషిస్తూ, మీరు కొంతవరకు ఉపయోగకరమైన ('నీతిదాయకమైన' అనడంలేదు) విషయాల్ని కూడ మీ అసంఖ్యాక పాఠకులకి అందజేస్తారని ఆశిస్తున్నాను.

చ. ధర్మారావు
హైదరాబాదు.]

## సార్థకత

"దొంగలు" వ్యాసం ద్వారా దొంగతనం చేత కాని వారికి, దానియందు అభిలాష కలవారికి దొంగల గతచరిత్ర (53-వ పేజీ చూడండి)



# రాజధాని కబుర్లు

ప్రవీణ్

## వర్షాలు, ఉపన్యాసాలు

“కుంభ—” అనగానే ‘—కర్ణుడు’ గుర్తొస్తాడు రాజధాని పౌరులకి సాధారణంగా! కాని ఈ వారం వరుణదేవుడి దయవల్ల, ‘కుంభ-’ అనగానే ‘—వృష్టి’ జ్ఞాపకొస్తోంది. ఎన్ని సాగరాల ఆనీళ్లను మోసుకు వచ్చాయో తెలియదు మేఘాలు — కుండలకొద్దీ నీళ్ళను గుమ్మరించి పోయాయి రాజధాని వాసులపై.

మూడురోజులు తెరిపిలేకుండా కురిశాయి వానలు. ఈ వానలకి రెండు ఇళ్ళు కూలి పోయాయని తెలుస్తూంది. రెండు కంటె ఎక్కువ కూలిపోకపోవడం ఆశ్చర్యం. సుల్తాన్ బజార్ రోడ్డుకి అటూ ఇటూ ఉన్న ‘స్కై స్క్రేపర్లు’ ఇంకా ఇలాగే నిలబడి ఉన్నాయి. రాజధాని పౌరులు కొందరి ప్రాణాలు పోకుండా నిలిచాయి.

వానలకు రెండు ఇళ్ళు కూలిపోయాయని ప్రకటించిన స్థానిక దినపత్రికలు అదే వార్తలో నగరపాలక సంఘోద్యోగులు, రకరకాల శాఖోద్యోగులు అవాంతరాలను ఎదుర్కోవడానికి సిద్ధంగా ఉన్నారని ప్రకటించాయి. కాని వారు ఏవిధంగా సిద్ధంగా ఉన్నారో తెలియదు. ఆ వార్త మనకు తెలుపలేదు. దెబ్బలు తగిలినవారిని ఆసుపత్రులకు కొనిపోవడానికా? కూలిపోయిన ఇళ్ళ వాళ్ళకి వేరే ఇళ్ళు చూపించడానికా? ఎందుకు? ఏవిధంగా? ఏంచేయడానికి?

భూమ్యంతర్భాగంలో మురుగునీటి పారుదల సౌకర్యాలు ఉన్న ప్రతీ నగరంలో రోడ్డుప్రక్కన ‘మేన్‌హోల్స్’ అనబడే రంధ్రాలుంటాయి. రోడ్డు నున్నగా ఉంటే, నీరు ఈ మేన్‌హోల్స్ గుండా లోనికి పోవడం ఆచారం. రాజధానిలో నగరపాలక సంఘోద్యోగుల వ్యాపార నిర్వహణానురక్తి వల్ల ఈ రంధ్రాలకు మూతలు కొరవడాయి. గత అక్టోబరు నెలలో ఒక కుర్రవాడు ఇటువంటి రంధ్రంలో పడి, ప్రాణాలు విడిచాడని ఉద్యోగులకు తెలియని విషయం కాదు. పాప పరిహారార్థం నగరపాలక సంఘం మూడువేల రూపాయలను చనిపోయిన కుర్రవాడి తల్లి తండ్రులకి సమర్పించుకొంది. ఇంకా ఎన్ని ప్రాణాలు, మూడువేలూ పోవాలో తెలియదు. నగరంలో ఈ రంధ్రాలింకా చాల చోట్ల నోళ్ళు తెరచుకొని చూస్తూనే ఉన్నాయి.

ఈ వానలవల్ల ఒక్క లాభం మాత్రం స్పష్టంగా కనపడింది. రోడ్లు బాగుచేయడం అంటే నగరపాలక సంఘంవారికి కొద్దిగా మొహమాటం! వానవచ్చి, రోడ్లపై ఉన్న చెత్తా చెదారాన్ని పక్కకి త్రోసేసింది. రోడ్లు నీటుగా కనపడ్డం ప్రారంభించాయి. సందులు, గొందులు సంగతి కాదు; శ్రీ మహావిష్ణువు మూడో అవతారం వంశీయుల సైర్గవిహారానికి మరింత సౌకర్యంగా ఉన్నాయి అవి.

### ఉపన్యాస వర్షాలు

ఎండలు విపరీతంగా కాసి, బీటలు వారిన నేలపైన వర్షపు చినుకుపడితే ప్రాణం లేచివస్తుంది. వర్షాలు ముమ్మరంగా పడితే- వరుణదేవుడికి వ్యతిరేకంగా రిట్ దరఖాస్తు చేయాలన్నంత కోపంవస్తుంది. వర్షం కావాలన్నప్పుడు పడదు; మానేయాలన్నప్పుడు మానేయదు. పడిన వర్షం తీరుగా పడచ్చా? అడ్డదిడ్డంగా పడి మనల్ని పీడిస్తుంది.

ఒకవిధంగా ఆలోచిస్తే - వర్షాలు, ఉపన్యాసాలు కవలపిల్లలు. ఒక్కసారి నిలబడి ఆలోచించండి, పైన వర్షం విషయంలో చెప్పిన లక్షణాలన్నీ ఉపన్యాసాలలో కనుపిస్తాయి. ఉపన్యాసాలు ఏవీ లేకన్న బాధ కంటె, ఉపన్యాసాలు కుంభవృష్టిగా కురుస్తున్నాయన్న బాధకంటె, సంగతీ సందర్భం లేకుండా ఉపన్యాసాలు సాగుతూంటే పడే బాధ ఎక్కువ.

మైకు చేతికవస్తే మైకం కమ్ముతుంది. ఉపన్యాసం ప్రారంభించడం ఎంతకష్టమో, ఆపేయడం అంతకష్టం. ‘ఇంకొక నిముషం మాట్లాడి కూచుంటా; ఇంకొక నిముషం!’ అనుకుంటూ, చేతిలో ఉన్న మైకును నిమురుతూ, ఇష్టంవచ్చినట్లు మాటాడతారు. పండిట్ నెహ్రూనుంచి, బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసర్ వరకు అందరూ ఇలాంటివారే. మనం వాళ్ళని విమర్శించకూడదు; సానుభూతి చూపించాలి. కాని వాళ్ళుకూడా మన పట్ల సానుభూతి చూపించాలికదా?

అన్నిటికంటె బాధను కలిగించే విషయం మరొకటి ఉంది. అది ఇష్టంవచ్చినట్లు చాలా సేపు మాటాడి కూచున్న ఉపన్యాసకుడు, మరో ఉపన్యాసకుడు చాలాసేపు ఇష్టం వచ్చినట్లు మాటాడుతూంటే, వింటూ బాధ పడుతూ కూచోడం. ఈ కూచున్న ఉపన్యాసకుడ్ని చూస్తే, హృదయం ద్రవించి పోతుంది.

* * *

ఈ మధ్య రాజధానినగరంలో ఎక్కడ చూసినా చర్చలు, సభలు, ఉపన్యాసాలు. వాటిని ‘ఉప’న్యాసాలు అని ఎందుకంటారో. అధికన్యాసాలు అనో అతిన్యాసాలు అనో ఎందుకనకూడదో తెలియదు. క్రిందటి వారం ఎగ్జిబిషన్ క్లబ్ ఆవరణలో సర్వోదయ మండల్ వారి ఆధ్వర్యాన ఆర్థిక విషయాలపై చర్చలు జరిగాయికదా? తరువాత ప్రణాళికా ప్రచారవారం ప్రారంభమైంది. వనమహోత్సవ కార్యక్రమాలిస్తున్న సత్ఫలితాలే ఈ ప్రణాళికా ప్రచారవారం ఇస్తుం

# ★ రాజధాని కబుర్లు ★

భవనంలో సందేహంలేదు. పబ్లిక్ గార్డెన్సులో చిన్నతరహా పరిశ్రమలపైన చర్చలు జరిగాయి. ఎటసెటరా.

ప్రణాళికా వార సందర్భంలో నగర పాలక సంఘ భవనంలో ఒక సభ జరిగింది. స్థానిక స్వపరిపాలన శాఖామంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య ఆ సభలో ప్రసంగించారు. పండిట్‌జీలా శ్రీ సంజీవయ్య తమ ప్రసంగంలో ఎన్నో విషయాలు ప్రస్తావించారు. నగరపాలక సంఘానికి ప్రజలు పంపుకున్న అర్జీలలో ఎన్నిటిపై, ఎంత కాలంలో చర్య గైకొనబడుతుందో ప్రచార శాఖ ప్రచురించాలని ఒక సూచన చేశారు. ఈ సూచన మంత్రిగారి వద్దనుంచి వచ్చింది కనక బల్లక్రింది బుట్టలోకి చేరదనే ఆశిద్దాం. నగరాన్ని సుందరతరం చేయడం, ఇతర రాష్ట్రాల పారిశ్రామికులను మన నగరానికి ఆహ్వానించిన బాగుంటుంది అన్నారు. ఈ సూచన నగరపాలకుల హృదయాలకు [?] దగ్గరగా ఉంటుందనడంలో సందేహంలేదు. సమాచారశాఖను గురించి, నగరపాలక సంఘ ఉన్నతోద్యోగి ఒకరు ధరించిన దుస్తులను గురించి, శ్రీ సంజీవయ్య చేసిన ప్రస్తావనకు ఏవిధంగా వాఖ్యానించాలో అర్థం కావడంలేదు.

ఆంధ్రప్రదేశ్ మంత్రిగా ప్రమాణ స్వీకారం చేసినకొత్తలో శ్రీ సంజీవయ్య నగరంలోని మురికిపేటలను పర్యటించి చూశారని వినికిడి. ఇప్పుడు నగరంలో మురికిపేటలంటూ వేరేలేవు. ఆయన అప్పుడు తీసుకున్న శ్రద్ధ స్థానిక స్వపరిపాలనా మంత్రిగా ఇప్పుడు తీసుకుంటే బాగుంటుంది.

ప్రణాళికా విజయాన్ని గురించిన పోటీలలో కృతార్థులైన శ్రీ ఎ. శ్రీనివాసరావు (తెలుగు), శ్రీ సయ్యద్ జియాఉద్దీన్ ముబారక్ (హిందూస్థానీ), కుమారి పి. అన్నపూర్ణ (ఇంగ్లీషు)లకు శ్రీ సంజీవయ్య బహుమతి ప్రదానం చేశారు. తరువాత ప్రేక్షకులకు ప్రణాళికలను గూర్చిన చలన చిత్రాలు ప్రదర్శించబడ్డాయి. ఈ చిత్రాలకు ముందు, నగరపాలకసంఘం హోలీ పండుగ సందర్భంలో శాసనసభ్యులపై, మంత్రులపై, గవర్నర్ కుటుంబ సభ్యులపై రంగులుచల్లిన దృశ్యాలు మూకీచిత్రంగా చూపించారు. రంగులుగల్లి డబ్బు వెచ్చించిన సందర్భం ఇదివరలోనే పల్లడి చేసుకున్నాను. అది మూకీచిత్రంగా తీయడానికి కూడా డబ్బు వెచ్చించారని విని ఆనందించండి.

భారతీయ రచయితల సమితి—భాగ్యనగర్ శాఖ ఆధ్వర్యాన 'మహర్షి వ్యాస జయంతి' 20 వ తేదీ సాయంత్రం సికిందరాబాదు బూరుగు మహదేవ్ హాల్ లో జరిగింది. సభకు దేవాదాయ శాఖామాత్యులు శ్రీ అనగాని భగవంతరావు అధ్యక్షత వహించారు. దాదాపు మూడుగంటలకాలం జరిగిన ఈ సభలో శ్రీయుతులు సంతానం గోపాలాచార్యులు, కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, భండారు సదాశివరావు, డాక్టర్ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు పాల్గొన్నారు. సహాయ కార్యదర్శి శ్రీ చంద్రమౌళి వెంకటకృష్ణ సమితిలక్ష్యాలను వివరించి వందనసమర్పణ చేశారు.

మహర్షి వ్యాస జయంత్యుత్సవాలు ఏర్పాటు చేయడంలో, భారతీయ రచయితల సమితి హర్షింపతగ్గది. కాని ఆనాటి వక్తల ఉపన్యాసాలుఅసంతృప్తికరంగాఉన్నాయి. వ్యాసునిగురించి తెలుసుకోవచ్చిన ప్రేక్షకులు వక్తల పాండిత్యానికి, ప్రతిభకి, విజ్ఞానానికి అబ్బురపడి ఇళ్ళకు వెళ్ళిపోయారు. వ్యాసుని గురించి తెలుసుకున్నది తక్కువ. సాహితీ సభల్లో వక్తలు వ్యాసాలు వ్రాసుకొని వచ్చి చదవాలని నిర్వాహకులు పట్టుబడితేగాని ప్రయోజనంలేదు.

## వారకాంతల విషయం

ఆంధ్రప్రదేశ్ కంతటికీ ఉన్నత న్యాయస్థానం మూసీనది ఒడ్డున ఉంది. రాజ్యాంగాన్ని, కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు చేసిన చట్టలనే అనుసరించితీర్పులు ఇస్తుంటారు న్యాయమూర్తులు ఇక్కడ. ఈ న్యాయమూర్తుల ముందు ఆరువందల మంది న్యాయవాదులు న్యాయాన్వేషణ చేస్తుంటారు.

న్యాయస్థానానికి అటుదిక్కు వందగజాల దూరంలో 'మెహబూబ్-కీ-మెహిందీ' ఉంది. అక్కడ సమాజంలో స్థానంలేక, సమాజం నుండి బహిష్కరింపబడి, శీలాన్ని అమ్ముకుని జీవించే వారవనితల ఆగారాలున్నాయి. సమాజంలో తిరిగే పురుషులు చీకటిమాటున సమాజపు పరిహాగుల వెలుపలికి వెళ్ళి తిరిగి రావడానికి అవకాశాలు కల్పించే ఆగారాలు.

న్యాయస్థానాలకు చెవులుంటాయి కాని కళ్ళుండవట. ఉన్నత న్యాయస్థానానికి పొరుగునే ఉన్న ఈ 'మెహిందీ' పైవాక్యంలోని సత్యానికి తార్కాణం.

వ్యభిచార నిర్మూలనకు నగర రక్షకభట శాఖ చర్యలు తీసుకొంటూన్నదన్న వార్త రాజధాని పౌరులందరికీ సంతోషం కల్పిస్తుంది. వ్యభిచార చట్టంక్రింద ఈ నాగం చార్మినార్ అసిస్టెంట్ కమీషనర్ శ్రీ కృష్ణకుమార్ ఈ మెహిందీ ప్రాంతంలో దాడి జరిపి ఇరవైమంది స్త్రీలను అరెస్టు చేశారు. ఇంతకు ముందు ఆరుగురు వారవనితలకు నచ్చచెప్పి 'సంరక్షణ గృహాల'లో రక్షకభటోద్యోగులు చేర్పించారన్నది పాఠకులకు తెలిసినదే.

ఈ సందర్భంలో జూలై 24 వ తేదీ ఆంధ్ర దినపత్రిక ప్రకటించిన వార్త గమనార్హం. ఈ సంవత్సరం ప్రథమార్థంలో ఈ చట్టంక్రింద ఆ ప్రాంతంలో 220 మంది స్త్రీలకు శిక్షలు పడ్డాయి. మెహిందీకి షికారుకి వచ్చే పద్నాలుగురు పురుషులు కూడా కటకటాల వెనుక చేరుకున్నారు. ఈ ప్రాంతంలో ఎనిమిది ఇళ్ళల్లో ఉన్న 'జనానా' జనంపై కేసులు నడుస్తున్నాయట. మరో ఎనిమిది ఇళ్ళు ఖాళీచేయించడానికి అనుమతి నీయవలసిందని నగరపోలీసులు మేజస్ట్రేటును అభ్యర్థించారు.

యూరప్ యాత్రానుభవాలు :

# ఇటలీలో భూసంస్కరణల పురోగతి

[గత వారం తరువాయి]

“శ్రీ కృష్ణ”

దామాషామీద కుటుంబానికి 5. 5. హెక్టేర్ల వైశాల్యం గల భూవసతి ఇటలీలో ప్రభుత్వం ఏర్పాటుచేసింది. సార్డీనియా ప్రాంతంలో అత్యధిక భూవసతి ప్రమాణం 14 హెక్టేర్లు, ఫ్యూసినో ప్రాంతంలో కనిష్ఠ భూవసతి 1.5 హెక్టేర్లు; ఇలా కేటాయింపులలో తేడాలు కూడా ఉన్నాయి.

భూవసతి కేటాయింపుకూడా కొన్ని మూలసూత్రాలపై ఆధారపడి ఉంటుంది. ఆయా ప్రాంతాలలోని పరిస్థితుల ప్రాబల్యంపై నిర్దిష్టంగా ప్రభుత్వం విధానాలు మార్పు చేసుకుంటుంది. మాట వరసకు చెప్పాలంటే చాలా ప్రాంతాలలో కుటుంబం స్వయం పోషకంగా ఉండ గలిగేటంత భూవసతికూడా కేటాయించారు!

భూమి బాగా సారవంతంగా ఉండే పో డెల్టాలో వ్యవసాయకూలీలకు, పేద రైతులకు సాగుబడికిచ్చిన భూవసతి ప్రమాణం చాలా స్వల్పంగా ఉంది. ఒకే ఏజన్సీలో కొన్ని పెద్ద, కొన్ని చిన్న కేటాయింపులు జరిపింది ప్రభుత్వం. సూత్రప్రాయంగా ప్రభుత్వం కొన్ని పద్ధతులు నిర్దేశించుకున్న మాట వాస్తవం.

మళ్ళీ మారెమా ప్రాంతంలో చూస్తే, అన్నీ కొండలు, అనేక పీఠభూమిప్రాంతం. నీటివసరు సదుపాయాలు శూన్యం. అక్కడ కేటాయించిన భూవసతి ప్రమాణం చాలా ఎక్కువ. పెద్దకుటుంబాలకు అవి కేటాయించారు. సహజంగానే అవి స్వయంపోషకం కావడానికి పెద్ద భూఖండాలు కేటాయించక తప్పదు. కలుగనున్న నీటిపారుదల వసతులదృష్ట్యా అపూలియా, లూకానియా ప్రాంతాలలో భూమి కేటాయింపులు జరిగాయి. ఇక్కడ వృత్తిసంపద పెంపుకు అవకాశం కలిగించబడింది. ఇక ఫ్లూమెనీడోసా, కాలాబ్రియా కాంపేనియాల్లో నీటివసరు వసతుల విషయం అస్పష్టం-భూవసతి కేటాయింపులు అతికష్టం-అదీ పరిస్థితి.

ఉన్న భూవసతి కుటుంబకులకు చాలినంత పనికి అవకాశం, భోజనం కలిగించలేని సందర్భాలలో అదనంగా ప్రభుత్వం కొన్ని 'కోటా'లు కేటాయించింది. నేటి వరకు కోటాల కేటాయింపుక్రింద 98,000 హెక్టేర్ల భూమి అదనంగా రైతులకు పంచబడింది. కాగా ఈ కోటాలలో కొన్ని రకాలున్నాయి.

(1) ఇదివరలో భూవసతి లేనివారికి పంచడం. కేవలం భూవసతి కలిగినందువల్ల ఈ తరగతి ప్రజల హోదాలో వెంటనే మార్పు రాదు. కలిగించిన భూవసతి కొంత కుటుంబ ఖర్చుకు అచ్చివచ్చినా వారు కూలీలుగానే ఉంటారు.

ఇలా కేటాయించేవి బంజరుభూములు, ఇవి తీసుకుని భూస్వామికి ప్రభుత్వం యిచ్చే ప్రతిఫలం కొద్ది. నాగకః జరిగే అమ్మకంలో కూలీలు స్వల్ప మొత్తాలు యిచ్చి కొనుక్కుంటారు. దీనివల్ల ఆర్థిక స్థిరత్వం కొంత ఆ కూలీలకు కలుగుతుంది. వారి జీవిక కొంత బాగుపడుతుంది. అయితే వారి జీవితాలతో పెనవేసుకున్న మూలసమస్యలు దీనితో తీరవు, తీరలేవుకూడా. అయితే కూలీనాలికి ఇదివరలో వారు పడిన యిబ్బందులు తరువాత లేకుండాపోయినవి. తేలికగా స్వయంకృషి చేసుకుంటూ పొట్టపోసుకోడం తేలికయింది. దీనితో కూలీల నిరుద్యోగసమస్య కొన్ని సంవత్సరాలదాకా తీరిపోయింది.

కాలాబ్రియా, సిసిలీ, లూకానియా, మారెమా, ఫ్యూసినో మొదలయిన జనసాంద్రతగల ప్రదేశాలలో ఈ కోటాలు చాలా ప్రయోజనకరం అయినవి.

(2) కాగా ఈ కోటాలలో రెండవరకం ఉన్నాయి. మొదటిరకం కోటాకు దీనికి కొంత సామ్యం ఉంది కూడా, అయితే కుటుంబాలకు ఆర్థిక స్వాతంత్ర్యం ఈ రెండోరకం కోటాలవల్ల సాధ్యం అవుతున్నది. సమర్థమైన సాగుబడి అవకాశాల ద్వారా పూర్తిగా కొన్ని సంవత్సరాలలో ఆర్థిక ప్రతిపత్తి సాధ్యం కావడానికి దోహదం చేయడం ముఖ్యంగా వీటి ఉద్దేశం. చిన్న పొలాలు కేటాయించి, బహుళ ప్రయోజనాల సాధనకు ప్రయత్నం జరుగుతున్నది. నారింజ, నిమ్మ, ఇక్షులతలు (వైన్ ప్లాంట్సు) మున్నగు చెట్ల పెంపకం, పశుపోషణ కూడా జరపడానికి ఈ కోటా భూవసతులు వినియోగిస్తున్నారు.

ఇటలీలో చాలాచోట్ల సారవంతమైన ప్రదేశాలలో రెండో రకం కోటాలతో ఈ బహుళార్థ సాధన జరుగుతోంది. మరి యీ చిన్న పొలాలు పెట్టుకున్న రైతు కూలీ కుటుంబాలు స్వయం పోషకం కావడం లేదనే గొడవ ఉండనే ఉంది. అది మొదటి ఒకటి రెండేళ్ళూ ఎలాగూ తప్పదు.

3 మూడో తరగతి కోటాలు కూడా ఉన్నాయి. భూసంస్కరణోద్యమంలో కేటాయించబడిన భూవసతికి ఇంకా అదనంగా కొంత కలపడం, రైతును స్వతంత్రుణ్ణిగా పూర్తిగా మార్చివేయడం వీటి లక్ష్యం. కోటాలలో చాలాభాగం దీనిక్రిందికే వస్తాయి. ఇదివరలో గ్రామంలోవుండి చిన్న భూవసతిని చూసుకుంటూ పిల్లాకోకను రెక్కలమీద బ్రతికించుకోలేని కూలీలకు అదనం భూవసతి కలిగించి స్వయం సమృద్ధత కలిగించడం కోటాల కేటాయింపులోని ఉద్దేశ్యమని చెప్పడం చర్విత చరణం. పశుపోషణ యాంత్రిక పరికరాలతోటి సాగుబడి దీని ఫలితాలు.

ముఖ్యంగా ఇటీవలి ఇటలీ చరిత్రలో ఈ కోటాలవల్ల వ్యవసాయం, ఇతమిత్థం అని చెప్పదగ్గ ప్రగతిని సాధించింది. నిర్దిష్టమైన అభివృద్ధిని యజమానులు సాధిస్తున్నారు. కోటాలవల్ల మరింత విశాలమైన భూవసతి కలిగి వ్యవసాయదారులు ఇళ్ళు కట్టుకుని ప్రత్యక్ష పర్యవేక్షణతో పరిశ్రమిస్తున్నారు.

ఫలసాయం సమృద్ధంగా అనుభవించడం తృణమో పణమో అదనంగా మిగిలితే అమ్ముకోవడం.

రైతుకు అధిక ప్రాముఖ్యత ఈ భూసంస్కరణలవల్ల కలిగింది.

**ఉదక 'మండలం'**

భక్తులతో ఒకస్వామి యిలా అన్నాడు!

'ఉదక మండలం చేరితేగాని నాకు శాంతిలేదు.' వెంటనే ఒక భక్తాగ్రగణ్యుడు లేచి లోపల్నించి నీళ్లతోసహా కమండలం తెచ్చి దగ్గర పెట్టి- 'ఇప్పుడు శాంతిగా ఉందా స్వామీ' అని ప్రశ్నించారు నమ్రతగా.

# అబలబలం

కె. పి. బాబు

పెద్ద బజారులో 'సరవయ్య & సన్స్' వారి యనుపసామాను లమ్మే షాపు ఎంత ప్రాచీనమైనదో అంత పేరుపొందినది. ఆ షాపు రోజూ ఉదయం ఎనిమిది - తొమ్మిది గంటల మధ్య తెరువబడేది; ఆదినం ఏడు గంటలకే తీయబడింది. సరవయ్యగారి పెద్దబ్బాయి సురవయ్య ఒక్కడే వచ్చి, కొట్టు తెరిచి గత రాత్రి మిగిల్చిపోయిన అర్జెంటు పనేదో వుంటే దాని విషయం తేల్చుకుంటూ కూర్చున్నాడు.

షాపు తెరిచిన అయిదు నిమిషాలకల్లా పోలమ్మ ప్రత్యక్షమైంది - నవ్వుకుంటూ. ఎప్పుడు కొట్టు తెరవనీ గాక, ఎక్కడుంటుందో ఏమిటో గాని - పది నిమిషాల్లోగా వచ్చిపడుతుంది రోజూ. ఆ రోజునమాత్రం సురవయ్యకి ఆశ్చర్యం కలిగింది.

"ఏమిటి పోలీ, అసలు నువ్వెప్పుడు మీ యింటి దగ్గర్నుంచి బయలుదేరుతావంట?'' అన్నాడు.

"ఏదో కూలీ నాలీ చేసుకు బతికే మావు మీలాగ జాము పొద్దెక్కాక లేసే జరుగుతుందంటండీ?" అంటూనే, చిరునవ్వులు చిందిస్తూనే, తన దినచర్య ప్రారంభించింది పోలమ్మ. గోడకున్న డెయిలీషీట్ కాలెండర్ లో ఒక కాగితం చింపి - నలిపి క్రింద పడేసింది. ఆ గోడనే వున్న స్టాండ్ మీది బిగ్ బెన్ అందుకుని 'కీ'యిచ్చి, సురవయ్యని టైమెంతయిందని అడిగింది. అతను తన రిస్ట్ వాచ్ చూచి-చెప్పగా, బిగ్ బెన్ టైం దిద్ది-భద్రంగా మళ్ళీ దాన్ని స్టాండుమీద పెట్టేసింది. తిరుగుతూన్న సీలింగ్ ఫాన్ని ఆపి, చీపురుకట్ట అందుకుని-"లేవండి కాస్త" అంది.

అంతసేపూ సురవయ్య, టేబిల్ మీద తెరిచి వున్న ఎకౌంటుపుస్తకం చూడ్డం మానేసి, ఆమెనే పరిశీలిస్తూ కూర్చుండిపోయాడు.

ఆ దినం పోలమ్మ తలంటుకున్నది. వేలుముడివేసి, సిగలో రెండాకులతో వున్న ఓ జంటమల్లెపువ్వును తురుముకున్నది. ఎర్ర వాయిల్ జాకెట్, తెల్ల నేతచీరధరించింది. ఎడమచేతికి అయిదారు ఎర్రగాజులూ, కుడిచేతికి నాలుగైదు నీలంగాజులూ వేసుకుంది. చెవులకి పచ్చల్లాంటి దుద్దులూ, ముక్కుకి నత్తు, ప్రోలు పెట్టుకుంది. మెడలో సన్నని లాకెట్ గొలుసు, ఆమె ప్రతి కదలికకూ తళుక్కు-తళుక్కుమంటోంది. అలాగే ఆమె కాళ్ళకున్న అందెల పటాలు చిన్నగా 'గలగల' లాడుతున్నాయి. పచ్చని

ఆమె నుదుటిమీద వున్న నయాపైసంత చిలాయిబొట్టు కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది ...పోలమ్మకి నిండా పదనిమిదేళ్లుండవు. పెళ్ళికాని పిల్ల. మంచి అంగసౌష్ఠవం గలది. పైన ఇన్ని అలంకారాలు — కావడంతో ఒక పట్టాన సురవయ్యదృష్టి ఆమెపైనుండి మరలలేదు. కొన్ని సంవత్సరాలుగా నిత్యమూ చూస్తున్న మనిషే అయినా, ఆ రోజు మరీ ఒంటరిగా కలవడం వల్లనో— మరింత ఆకర్షణీయంగా కనిపించినందు వల్లనో — మరెందువల్లనో గాని, అతను కొంచెం చలించాడు.

"ఏంటండీ, అట్టా చూస్తూ కూర్చున్నారూ — లెగమంటుంటే! ఏం, నా ముఖంలో ఏమన్నా తోలుబొమ్మలాట జరుగుతోందా ఏమిటి?" అంది పోలమ్మ, తనని తాను ఓసారి చూచుకుని నవ్వుతూ.

సురవయ్య తేరుకున్నాడు. "అహాఁ! అది కాదే, ఏమిటి విశేషం యివ్వాళ? తలంటావ్; ముస్తుగా ముస్తాబై మరీ బయల్దేరి వచ్చావ్!" అన్నాడు కుర్చీలోంచి లేస్తూ.

"అదేంటండీ, ఇవ్వాళ శుక్రారం కాదా?!" అన్నది పోలమ్మ.

ప్రతి శుక్రవారం ఆమె తలంటుకురావడం మామూలే అయినా ఆ రోజు ఆమె ఆకర్షణలోపడి సురవయ్య అన్నీ మర్చిపోయాడు. కాని, వెంటనే సర్దుకుని, "అవున్లేగాని, నేనొకటి అడుగుతా నిస్తావూ?" అన్నాడు మెల్లగా.

ఊడుస్తున్నది ఊడుస్తున్నట్టే వుండి, తలమాత్రం వెనక్కి తిప్పి, "ఏంటండీ—మీకిచ్చేది నా దగ్గరేముంటుందీ, అంతా వేళాకోళం కాకపోతే?" అన్నది చిరుకోపం నటిస్తూ.

ఆమె సిగలో నిటారుగా నిలచి, వయ్యారంగా వూగులాడుతున్న జంటమల్లెపూవు వంకే చూస్తూ, "అదిగాదు పోలీ, నాకా పువ్వు యివ్వవూ?" అన్నాడు సురవయ్య.

"ఏంటీ?" అంటూనే చేస్తున్న పనిమాపి చటుక్కున నిలబడింది పోలమ్మ. "ఏంటండోయ్, యివ్వాళంతా అదోకంగా వుందే మీ వాలకం?!" అన్నది బుంగమూతిపెటి.

"దేవుడి పఠానికి పెట్టానిద్దూ!" అని వణిగాడతను.

"అవ్వవ్వ! ఎక్కడన్నా, ఎవరన్నా తల్లోపూలు దేముడికి పెట్టారటండీ?" అన్నదామె, అమాయకంగా నోరు నొక్కుకుంటూ.

"పోనీ, నేనుంచుకుంటా నివ్వు!" అన్నాడు వెంటనే సురవయ్య.

పోలమ్మ కళ్ళు యింతింతయ్యాయి. "నిజంగా?" అన్నది మహాశ్చర్యం నటిస్తూ.

సురవయ్యకు కొంచెం ధైర్యం కలిగింది. "నిజంగానే పోలీ, నాకా పువ్వు యివ్వవూ?" అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

"ఇస్తే, ఏం చేస్తారు?" అని కొంటెగా అడిగింది పోలమ్మ.

"ఏం చేస్తానా?" అని బుర్ర గోక్కుంటూ, "భద్రంగా చేత్తో పట్టుకుని, కమ్మనివాసన చూస్తూ, హాయిగా షికార్లు చేస్తాను," అన్నాడు.

"ఎవరన్నా చూస్తే?"

"చూస్తే—ఏం?"

"'ఏమిటే వాలకం, ఎక్కడిదీ పువ్వు?' అని అడిగితే?"

"ఏం, భయమా నాకేమన్నా? 'మా పోలి పెట్టుకొచ్చింది, నే నడిగాను, యిచ్చింది' అనే చెప్తాను!" అన్నాడు సురవయ్య ధీమాగా.

"ఎన్ని గుండెలెన్ని గుండెలండీ మీకు!" అని ఫకాలున నవ్వేసింది పోలమ్మ సురవయ్య నిక మాట్లాడనివ్వకుండా, చీపురు పట్టుకుని గబగబా స్టోరు రూమ్లోకి వెళ్ళిపోయింది.

ఏదో అనాలని నోరుతెరిచి, అలాగే నిలబడిపోయాడు సురవయ్య. అలా చెప్పేందుకు గుండెలులేని మాట నిజమే—అయినా పోలమ్మ వెక్కిరింత అతనికి తల కొట్టేసినట్లయింది. ఆమె మాటలు—చేష్టలూ అతనిలో కోర్కెల్ని మరింత రెచ్చగొట్టాయి.

పోలమ్మ ఓ అప్పలమ్మకూతురు ఆ అప్పలమ్మ యీ షాపులో తన చిన్నతనంనుంచీ పనిచేస్తోంది. ఈ పోలిని తను చిన్నప్పట్నుంచీ ఎరుగును. రోజూ తల్లితో కలసి వచ్చి, ఆమెకి కాస్త సాయపడ్తూ వుండేది. పెద్దదయ్యాక కొన్నాళ్ళుమాత్రం పోలి బయట ఎక్కడకూ రాలేదు. తరువాత మళ్ళీ మామూలుగానే పనికి వచ్చివెళ్ళడం ప్రారంభించింది. తల్లి వయసుమళ్ళి, పని చేయలేనిదైపోవడం; తండ్రి కష్టపడి తెచ్చే కూలి డబ్బులు సంసారం గడవడానికి సరిపోకపోవడం; వారిలో ఆడా మగా—చిన్నా పెద్దా అంతా కష్టపడి జీవించడం మామూలు కావడంతో పోలే, క్రమేణా తల్లి పనిచేసే చోట్లన్నింటా పనిచేయసాగింది. ఆ బజారులో సగానికి సగం షాపుల్లో అప్పలమ్మే పనిచేసేది. పోలి పెద్దదై - పనిచేయడం ప్రారంభించాక, మూడొంతులకు పైగా

పాపులు దాని చేతులో కొచ్చేశాయి. అప్పలమ్మయితే వట్టి దాసీదానిలాగే వుండేది కాని, పోలిలో కలికానికైనా ఆ పోలికలు కనిపించవు అది పనిచేస్తున్నప్పుడు దాసీ అనుకోవాల్సిందే తప్ప - యితర వేళల్లో 'ఏ గొప్పింటి అమ్మాయో!' అనిపించేటంత ఆడంబరంగా వుంటుంది ఎప్పుడూ. అటువంటిది; పదిపాపుల్లో పనిచేస్తున్నది; మాంఛి వయస్సులో వున్నది- పెళ్ళి పెడాకులూ కానిది- ఎంత నీతిమంతురాలై వుంటుందీ అన్నదే గురవయ్యకు పట్టుకున్న దుగ్ధ. పాపం- అది మంచిగా వుండాలనుకున్నా యీ రోజుల్లో, యిటువంటి పరిస్థితుల్లో ఎలా సాధ్యమౌతుంది? దీనికన్నా కొమ్ములు మెలిచినవాళ్ళే ఎంతమంది చెడిపలై తిరగడం చూడ్డంలేదు తనురోజూ. అందాకా ఎందుకూ- యీ పోలి గురించే 'యిదీ పట్టి మేడిపండే!' అని ఎందరు చెప్పుకోవడం వినడంలేదు? 'యిది మాత్రం అగ్గిలాంటి ఆడది' అనుకునేవాళ్ళూ లేకపోలేదు- తన తండ్రిలాంటి వారు. అయితే, వాళ్ళకేం తెలుసాయి- వయసువాళ్ళ చాకచక్యాలు? ...'ఏమైనా యీ పోలి సంగతేమిటో తేల్చుకోవలసిందే' అనుకున్నాడు గురవయ్య.

అడుగులో అడుగు వేసుకుంటూ స్టోరు రూమ్‌లోకి వెళ్ళాడు. పోలమ్మ ఏదో కూనిరాగం తీస్తూ, ఆగది శుభ్రం చేస్తోంది. ఆమె తలలోని ఆ జంట మల్లెపూవు కవ్వించి, వెక్కిరిస్తున్నట్లగుపించింది అతనికి. ఆ గది గుమ్మంలో నిలబడి, "పోలీ!" అన్నాడు మెల్లగా గురవయ్య.

ఉలిక్కిపడి చూచింది పోలమ్మ. అంతలోనే మందహాసంచేసి, "ఏంటండీ?" అన్నది.

"నేనొకటి అడుగుతాను-"

"నా తల్లో పువ్వేనా?" అని, అతణ్ణి మాట పూర్తిచేయనివ్వకుండానే నవ్వేసింది తమాషాగా.

"అదికాదే- నాకు తెలియక అడుగుతాను, ఇంతమందిదగ్గర పనిచేస్తున్నావు గదా - అందరూ మాలాంటి వాళ్ళే వుంటారటే?" అన్నాడు ఎంతో అమాయకునిలా.

అంటే-? మీరనేదేమిటో నాకర్థం కావటంలేదు."

"అదిగాదే- నువ్వా, ఆడదానివి; వయస్సులో వున్నదానివి; ఒంటరిగా పోయి పనిచేస్తుంటావు. ఎక్కడన్నా, ఎవరన్నా నిన్నేమన్నా చేస్తే"- అని, ఆమె ముఖకవళికలు చూచి ఆగిపోయాడు గురవయ్య.

"ఆడదాన్నయితే? ఒంటరిగా పనిచేస్తుంటే? ఏముండీ, ఎవరేంచేయగలరు, ఏమౌతుందంట? ఏమండోయ్- ఒకళ్ళకి డబ్బు బలంవుంటే, యింకోళ్ళకి మాటబలం వుంటుంది. ఒకళ్ళకి శక్తివుంటే, యింకోరికి యుక్తివుంటుంది. అలాగే- మీ మగాళ్ళకి కండబలం ఉంటే, మాకు యీ బలం వుంటుంది- తెలుసాండీ?" అని తన బుర్ర చూపింది.



"మీరనేదేమిటో నాకర్థం కావటంలేదు.

"అలాగా, నిన్నిప్పుడిక్కడ నేను కావలించుకుని-ముద్దెట్టుకుంటే ఏం చేయగలవే?" అన్నాడు గురవయ్య చిన్నదా నవ్వి.

"అలాగా, ఏదీ - చేసి చూడండి చూద్దాం!" అన్నది పోలమ్మకూడా నవ్వుతూ.

ఆమె నవ్వు - ఆ మాటలూ గురవయ్యలో ఉద్రేకాన్ని రెచ్చగొట్టాయి. ఆమె అలా అనగానే "చూడు" అంటూ అతను ఒక్క అంగలో ఆమెదగ్గరకు చేరి, కౌగలించుకోబోయాడు.



# అబలబలం



అలా జరుగుతుందని ముందే ఊహించిన దానిలా పోలమ్మ కదలక మెదలక నిబ్బరంగా అలానే నిలబడింది. కాని, పిడుగులా అతను తనమీద కొచ్చేసరికి, ఒక్కసారిగా— "అమ్మ నాయనో! అయ్య బాబో!!" అని రెండే రెండు గావు కేకలు పెట్టింది— ఆ అరుపులకు గురవయ్యా మత్తు కాస్తా విడిపోయింది. చట్టున ఆమె నల్లేవదిలి, ఒక్క డుగు వెనక్కి తగ్గాడు అప్రయత్నంగా.

అంతకుముందే కొట్టు తెరిచిన ఆ ప్రక్క షాపాయనా, అప్పుడే షాపు తెరుస్తున్న యీ ప్రక్క కొట్టాయనా, యింకొ ఒకరిద్దరూ, పోలమ్మ కేకలు విని — గురవయ్య గారి షాపులోకి పరుగెత్తుకొచ్చారు.

ఆ షాపు స్టోర్ రూమ్‌లో ఎలెక్ట్రిక్ లైటు వెలుగులో భయంభయంగా చూస్తున్న పోలమ్మ, నిలువునా వణికిపోతున్న గురవయ్యా వాళ్ళకి కనిపించారు. "ఏమిటేమి" టని అందరూ ఆత్రంగా అడిగారు.

గురవయ్యా మరింత కంగారుతో పోలమ్మ వంక చూస్తూ, నీళ్ళు నమిలాడు. పోలమతే అతన్ని ఒకక్షణం అట్టే చూచింది. మరుక్షణాన్నే వచ్చినవారివైపు చూచి, "ఏం లేదండీ, రోజూలాగే యివ్వాళ కూడా యీ గదిలోకి వచ్చి తుడుస్తున్నాను. ఆ మూల కెళ్లి చీపురుతో యిలా అన్నానో లేదో, ఏదో చర్రున యిలా మీదిమీది కొచ్చేసింది. అంతే—నాకింక ఒళ్లు తెలీలేదంటే నమ్మండి. ఆపైన నే నేం చేశానో, ఏమయ్యానో నాకే తెలీదు గాని, ఆ హాల్లో కూర్చున్న ఈ అయ్యగారు గభాలున ఇక్కడికి పరుగెత్తుకొచ్చి,— 'ఏం పోలీ, ఏమైంది? ఏమిటి?' అన్నాక స్పృహొచ్చింది. చూస్తే, ఆ మూలగా గబగబా పారిపోతూ కనిపించింది. ఈయనకీ, దాన్ని చూపించాను. మరి, అది జెర్రో— పామో సరిగ్గా తెలియలేదు గాని!" అని చెప్పింది గుక్క తిప్పుకోకుండా.

ఆ మాటలు వింటూనే వచ్చినవారందరూ ఆ 'జెర్రో—పామో' ఎక్కడ తమ కాళ్ళ క్రింద కొచ్చిందో నని తొక్కిసలాడారు కొన్ని క్షణాలసేపు. తరువాత, ఒకరు 'అది పామే అయివుండా'లని అన్నారు. 'ఏం? జెర్రి కాకూడదా?' అన్నా రింకొకరు. 'ఏదైతే నేంగాక, అదేదో మా కొట్లోకి దూరలేదు గదా!' అంటూ ఆ ప్రక్క షాపాయన కంగారుపడుతూ వెళ్ళిపోయాడు. 'ఏమో, అటే వెళ్లిం ఏ నే నేమిటి? యిలా మా షాపులోనికి పోయుండకూడదా?' అంటూ యీ ప్రక్క కొట్టాయన, వూడిపోతున్న పంచె సరిచేసుకుంటూ వెళ్లాడు. కొన్ని నిమిషాల్లో గురవయ్యగారి షాపు నిశ్శబ్దమైంది. గురవయ్య, పోలమ్మలు తప్పితే నిర్జనమూ అయిపోయింది. కొంతసేపు వాళ్లిద్దరిలో కూడా ఎవరూ నోరు మెదపలేదు. తరువాత పోలమ్మే తలవంచుకు నిలబడిన గురవయ్యని తీక్షణంగా చూస్తూ, "చూచారా, ఒంటరి ఆడదాని బలం? నేను తల్చుకుంటే మిమ్మల్నిందాక ఎంతైనా చేయించి వుండేదాన్ని. కాని, మీ నాన్నగారి ముఖం చూచి వూరుకున్నాను. మీ ఇళ్ళముందు పుట్టి, మీ చేతులలో పెరిగినదాన్ని గదా అని చనువుగా మసులుతూవచ్చాను తప్ప—దానికిగాను మీరిలా చేస్తారని కలలోకూడా తలవలేదు. ఇంకిక్కడ పనిచేయడానికి నామనసు విరిగిపోయింది. కాని, ఇప్పుడరాత్తుగా మీదగ్గర పని మానేసినా, ఎందుకు మానేశాను— ఏమిటి సంగతి అని అంతా ఆరా వస్తుంది. అది మీకు ఏమన్నా కష్టం కలిగిస్తుందేమో! అయిందేదో అయిపోయింది గానీ—ముందయినా మర్యాదగా మసులుకోండి. మళ్ళీ ఎప్పుడన్నా ఇలాగాని చేశారా—తప్పకుండా తగిన ప్రాయశ్చిత్తం చేసి మరీ మానేస్తాను. గుర్తుంచుకోండి" అని గబగబా బయటకు వెళ్ళిపోయింది.

గురవయ్య అప్పటికీ నోరు విప్పలేదు; తల కూడా ఎత్తలేకపోయాడు.



# మీరెవరో మీకు తెలుసా?

## ప్రశ్నావళి ఫలితాలు

దేశంలోని రాజకీయపక్షాల దృక్పథ తారతమ్యాలను అంచనా వేయటానికి మేము 8-7-59 సంచికలో ప్రకటించిన ప్రశ్నావళి ఫలితాలు ఈ వారం ప్రకటిస్తున్నాము. కూపన్‌లు పూర్తిచేసిపంపినవారిలో ఎక్కువమంది ఏ పార్టీ లేనివారే కావటం గమనార్హం. వీరు నూటికి 47.72 మంది. కాంగ్రెసు అభిమానులు నూటికి 30.68, కమ్యూనిస్టుపార్టీ అభిమానులు 6.25, స్వతంత్రపార్టీ 5.67, సోషలిస్టుపార్టీ 3.12, ప్రజాసోషలిస్టు పార్టీ 2.56, జనసంఘం 1.99, ప్రజాపార్టీ 1.28, సోషలిస్టు డెమొక్రాటిక్ పార్టీ 0.99 ఉన్నారు.

ప్రశ్నలపై ఆయా పార్టీల అభిమానులు పంపిన అభిప్రాయాలన్నిటినీ తీసుకుని ఆయా పార్టీల రాజకీయ (అతివాదం, మితవాదం) సాంఘిక (కోమల కఠినస్వభావాలు) దృక్పథాల సగటును ఈ క్రింది గ్రాఫ్‌లో సూచించాము. ఈ గ్రాఫ్‌నుబట్టి ప్రతివారూ తాము తమ అభిమానపాత్రమైన పార్టీ సగటునకు, (లేక మరే పార్టీ సగటునకు) ఎంత దూరంగా (లేక ఎంత దగ్గరగా) ఉన్నారో తెలుసుకోవచ్చు.

ప్రొఫెసర్ ఐసెంక్ పుస్తకంలోని గ్రాఫ్ ఆధారంగా బ్రిటన్‌లోని వివిధ రాజకీయ పక్షాల సగటు దృక్పథాల స్థానాలను కూడా ఈ గ్రాఫ్‌లో సూచిస్తున్నాము. వాటికి భారతీయ పార్టీలకు గల తారతమ్యాలను తెలుసుకోవటానికి ఈ గ్రాఫ్ తోడ్పడుతుంది. భారతీయ పార్టీలను ⊙ గుర్తుతోను, బ్రిటిష్ పార్టీలను ▣ గుర్తుతోను సూచిస్తున్నాము.

### రూ. 75 బహుమతి

'మీరెవరో మీకు తెలుసా?' ప్రశ్నావళితోపాటు ప్రకటించిన పోటీలో శ్రీ వై. రామనాథం (వెల్లటూరు, గుంటూరుజిల్లా) సరియైన సమాధానం— "అ" మార్కులు 8, "కో" మార్కులు 11—పంపి, రూ. 75/- బహుమతి గెలుచుకున్నారు. వీరికి మా అభినందనలు.

గ్రాఫ్‌లో అడ్డగీత అతివాదం, మితవాదం స్కేలును, నిలువుగీత కఠిన, కోమల స్వభావాల స్కేలును సూచిస్తాయి. ఈ స్కేలులో వివిధ పక్షాల స్థానాలిలా ఉన్నాయి.

| | | అ | కో |
|---|---|---|---|
| ఏ పార్టీ లేనివారు | | 6.9 | 15.2 |
| కాంగ్రెస్ | పార్టీ | 7 2 | 14.7 |
| కమ్యూనిస్టు | ,, | 5.6 | 13.5 |
| స్వతంత్ర | ,, | 5.4 | 12.9 |
| సోషలిస్టు | ,, | 6.3 | 12.8 |
| ప్రజాసోషలిస్టు | ,, | 8.0 | 16.5 |
| జనసంఘ | ,, | 4.8 | 17.0 |



అంతర్జాతీయ పద్ధతిలో ఎనిమిదో ఇంటికి చేరుకున్న ఏ బంటైనా కావాలనుకుంటే మంత్రి అవుతుంది. మంత్రి బ్రతికుండగా కూడా ఇంకో మంత్రిని పెట్టుకోవచ్చు. అంటే సిద్ధాంతరీత్యా తొమ్మిదిమంత్రులను పొందడానికి అవకాశాలున్నాయి. గాని అలా జరగడం అరుదు. డాక్టరు అలెఖైను ఒకసారి అయిదు మంత్రులను చేశాడు.

మంత్రులను చేసినంత మాత్రాన లాభం లేదు. ఒకొక్క సమయంలో ఎన్ని మంత్రులున్నా ఆట గెలవటం కష్టం. ఎనిమిది బంట్లూ బతికుండి అందులో మూడు గడి తేరిన బంట్లు (పాస్‌డు పాన్స్) అయినా ఈ క్రింది ఆట సమానం అయింది. దానిని సమస్యల రచయిత వ్లాడిమర్ అలెగ్జాండ్రోవిచ్ కొరోల్‌కోవ్ సరదాగా రచించారు.

ఈ ఉదాహరణ పరిస్థితి ఇది :

తెమ 7/1 తెబనబనబ 3 తెబ/తెబ 4 నబ శ/1 తెబ తెబ తెబ 2 నగు 1/3 నగు 2 తెబ నరా/7 న బ/1 తెబ 5 తెరా/8.

ఆట ఈ స్థితిలో ఉంది. నలుపు ఎత్తు వేయాలి. ఆట ఈ విధంగా సాగిందనుకోండి.

1......,గు (5)—శ 6 పా.
2. రా ఏ 1, గు—రా 5
3 ఏ బ—మ పా, రా—గు 6.
4. మ × ఏ బ పా.

వెంటనే తెలుపు పా చెప్పకపోతే నలుపు గు—శ 7 లో వేసి రాజు చెప్తే తెలుపు ఆట కట్టిపోతుంది.

4.........రా × మ.
5. మ—ఏ 3 పా, రా—గు 6.
6. మ—ఏ 2 పా, గు × మ.
7. బ—మ, గు—రా శ 6.
8 మ × బ పా, రా—ఏ 6.
9 మ—ఏ 2 పా, గు × మ.
10. రా—గు 1............

ఇప్పుడు తెలుపు బంటుని తోయకూడదు.

# చదరంగం

నిర్వహణ : 'క్రీడి'

తోసి మంత్రిని చేసేలోగా ఆటకట్టిపోతుంది. అందుచేత రాజుని ఒక గడి తప్పాలి.

10.........,రా—గు 6.

ఈ ఎత్తు తరవాత నలుపు గు—మ 7 లో వేసి మూడో ఎత్తులో గు (ఏ 7)—శ 6 లో వేసి రాజు చెప్పి గు (మ 7)—రా 5 వేసి మరొక ఎత్తులో ఆటకట్టే ప్రమాదముంది. అందుచేత తెలుపు జాగ్రత్తగా గుబ ఆడాలి.

11. బ—గు 6, గు—మ 7.
12. బ—గు 7, గు (ఏ 7)—శ 6 పా.
13. రా—ఏ 1, గు—రా 5.
14 బ—మ పా, బ—మ 3.
15. మ × బ పా.

పొరపాటున 15 బ × బ అయితే వెంటనే వేసి రాజు ఆటకట్టు. కనుకే ఈ ఎత్తు.

15.........,రా—ఏ 6.

మంత్రి వస్తుంది కదా అని గుర్రంతో కొట్టేస్తే ప్రమాదం. రాజునే తప్పి తెలుపు ఆటకట్టబోతూందని బెదిరించాలి.

16. మ—ఏ 2 పా, గు × మ.
17 రా—గు 1, రా—గు 6.

తెల్ల రాజుని బయటకు పోనివ్వకూడదు. అందుకే పైన చెప్పిన ఎత్తు.

18. బ—ఏ 7, గు—మ 7.
19. బ—మ, గు (ఏ 7)—శ 6 పా.
20. రా—ఏ 1, గు—రా 5.

యథాప్రకారం మళ్ళా కట్టెత్తు బెదిరింపుకి తీసుకొచ్చాడు.

21. మ—మ గు 3 పా, రా—ఏ 6.
22. మ—ఏ గ పా, రా—గు 6.
23. మ—గు 3 పా,.........

ఇలాగ సమరాజులు చెప్పుకోవలసినదే గాని ఇప్పుడు మూడు గడి తేరిన బంట్లూ, మంత్రీ ఉన్నా తెలుపు గెలవలేదు. ఈసారి తెల్లమంత్రిని పూర్వంలాగ బలిచేయడానికి వీల్లేదు. 5వ వరసలోని తెల్లబంట్లలో ఏ ఒక్కటైనా మంత్రయ్యేలోపున నలుపు ఆట కట్టేస్తుంది. ఈ ఉదాహరణలో ఈ సమానం పరిస్థితి ఏర్పడడానికి రెండు తెల్లబంట్లు, ఒక నల్లబంటు కీలకస్థానాలలో ఉండడమే కారణం. మగు 2 లో ఉన్న తెల్లబంటు ముఖ్యకారణం. ఆగడి ఖాళీగా ఉండి తెల్ల మంత్రి దాన్ని ఆక్రమించుకొంటే ఆటకట్టు బెదిరింపు ఉండదు రాగు 4 లో ఉన్న తెల్లబంటు నల్లరాజుని పరోక్షంగా రక్షిస్తోంది!

శ 3 లో ఉన్న నల్లబంటు ఆటలో ఏ కీలకస్థానం ఆక్రమించుకొందో పాఠకులు ఊహించేఉంటారు. మొత్తంమీద రెండు గుర్రాలు ఇంత మంత్రినీ బెదిరించాయి.

ఇక ఈవారం సమస్యకూడా రెండు గుర్రాలున్నదే ఇస్తాను. పరిస్థితి ఇది.

2 తెశ 5/1గు/4 తెగు3/7 నబ/2 తెగు నబ 4/3 తెబ 2 నర తెబ/తెఏ 3 తెరా 2 తెఏ/[రెండెత్తులు] రచన : ఒ. ఏ. డబ్ల్యూ. డిల్కే.

నలుపు (3)



తెలుపు (8)

(తెలుపుఆడి రెండెత్తుల్లో ఆటకట్టాలి)

# ఏ పార్టీ వారో మీకు తెలుసా

| | | | |
|---|---|---|---|
| ప్రజా | ,, | 3.0 | 19.4 |
| సోషలిస్టు డెమొక్రాటిక్ | ,, | 13.4 | 23 3 |

అన్ని పార్టీల "అ" మార్కులను తీసుకుని సగటు తీయగా వచ్చిన 7, "కొ" మార్కులను తీసుకుని సగటు తీయగా వచ్చిన 16 "అ, కొ" స్కేళ్ళ కేంద్రాన్ని నిర్ణయిస్తున్నాయి.

"అ" స్కేలులో సున్నా నుంచి 15వరకూ, "కొ" స్కేలులో సున్నా నుంచి 25 వరకూ సూచించవచ్చు "అ" స్కేలులో ఎంత ఎక్కువ సగా ఉంటే అంత తీవ్రవాదం, లేక అతివాదానికి సూచన ఎంత కుడి వైపున ఉంటే అంత మితవాదానికి సూచన. అలాగే "కొ" స్కేలులో ఎంత పైన ఉంటే అంత కఠిన స్వభావమనీ. ఎంత దిగువన ఉంటే అంత కోమల స్వభావమనీ సూచన.

ప్రొఫెసర్ ఐసెంక్ నిర్ణయించిన బ్రిటిష్ పార్టీల స్థానాలు కూడా ఊహాయింపువే అయినా, అవి చాలవరకు ఆయా పార్టీలు వెలిబుచ్చే ఆశయాలకు దగ్గరగానే ఉన్నాయి. కాని మన దేశపు పార్టీలు ప్రకటించే ఆశయాలకు, వాటికి ఈ గ్రాఫ్‌లో వచ్చిన స్థానాలకు అంత పొందిక కుదిరే విధంగా ప్రశ్నావళి ఫలితాలు లేవనే అనుమానం కలుగుతున్నది. ఏ పార్టీకి చెందనివారు, కాంగ్రెసు అభిమానులు ఇంచుమించు "అ, కొ" స్కేళ్ళ మధ్య భాగంలో ఉండటంలో అంత ఆశ్చర్యం లేదు.

కాని కమ్యూనిస్టు, సోషలిస్టుపార్టీల అభిమానులనుకునే వారి అభిప్రాయాల మార్కులను బట్టి ఆ పార్టీలు "అ" స్కేలు కుడివైపున డెమొక్రాటిక్ పార్టీ అన్నిటి కంటె అతి రావటం చూస్తే, ఆ పార్టీల అభిమానులనుకునేవారికి ఆ పార్టీల సిద్ధాంతాలపై నమ్మకం లేదనైనా అనుకోవాలి, లేక ఆ సిద్ధాంతాలు అర్థం కాకపోయైనా ఉండాలి అనిపిస్తుంది. వీరివల్ల విప్లవం రాదు! జన సంఘ, స్వతంత్ర పార్టీల స్థానాలు వాటి సిద్ధాంతలకు దాదాపు అనుగుణంగానే ఉన్నాయి. (స్వతంత్రపార్టీ అంటే పాఠకులు చాలమంది ఎన్నికలలో స్వతంత్రులుగా నిలబడేవారని అనుకున్నట్లు అనుమానం.) సోషలిస్టువాద పక్షం కావటం ఆశ్చర్యం. ఈ పార్టీ అభిమానులు కూడా తమ మార్కులు సరిగా ఇవ్వలేక పోయినట్లు అనుమానం.

మొత్తానికి పార్టీల పేర్లపైన తప్ప, సిద్ధాంతాలపైన అంత నమ్మకం ఉన్నట్లు కనిపించదు. బ్రిటిష్ లిబరల్ పార్టీకి మన వాగ్దాం దరూ ఇంచుమించు దగ్గరగా ఉన్నారేమో!



# ఋణానందలహరి

(గత వారం తరవాయి)

సుబ్బన్న కథను కొనసాగించాడు.

మర్నాడు సంజెవేళ మునసబుగారి వంశోద్ధారకుడు గుర్నాథం మళ్ళా తండ్రిదగ్గరకు వెళ్ళి నాన్నా ఇచ్చేద్దామే డబ్బూ అన్నాడు. మునసబుగారు ఆ మసక చీకట్లోనే స్పష్టమైనంత తెల్లబోయి, ఆ వైనం కొడుకు పసిగట్టి ఉండడని అనుమానించి, వాడిల్లు బంగారంగానూ-అవసరం తీరకా అప్పుదొరకా వాడింకా అప్పు కావాలంటున్నాడురా నీ జతగాడూ అని ప్రకాశంగా ఆశ్చర్యపడ్డాడు.

మర్నిన్నివ్వలేదు గదే అన్నాడు అబ్బాయి.

నిన్ననిస్తే ఇవాళే మళ్ళీ సర్దేస్తానన్నాడనవుట్రా. ఆ ముక్కే రైటైతే ఇవాళ ఇంకా నిన్న ఇవ్వాల్సిన పనేమిటీ అన్నాడు మునసబుగారు. పిల్లడు నివ్వెరబోయాడు. తనయుడి కుశాగ్రబుద్ధికి ముసలాయనకు నవ్వు పెల్లుబికి రాబోయి దిగ్గున తగ్గుమా అయిపోయింది.

ఔనే నాన్నా. నిజమే మరి. అతను ఇవాళే ఇస్తానన్నాడుగదా నిన్నడిగినపుడూ. గమ్మత్తుగానే ఉందే అని తికమక పడ్డాడు గుర్నాథం.

వెర్రినాగన్నా, ఈ తరం సజ్జు ఉట్టి వెర్రి నాగమ్మలు. అప్పు అడగడం కూడా చేతగాదు. ఎందుకు పనికొస్తారంట. మా కాలంలో ఇలాగేనా మరి. మన తాతబ్బాయి ఉన్నాడంటే ఎంత గట్టివాడూ...వాడు అప్పులిస్తే ఇలాగే చేశాడా. ఇంత అవకతవకగానే అడిగాడా మరి. నీకు చెల్తా వాడిపెళ్ళి సంగతీ. (తెలీదన్న భావానికి అభినయంగా అరుగుమీద కూలబడి స్తంభానికి జేరబడ్డాడు గుర్నాథం) నాన్నమ్మ కూతురుగా వరాలమ్మకి మనువెలా అయిందనీ. అదంతా ఓ కథగాదూ మరి. తాతబ్బాయీ, రామకిష్టుడూ ఇద్దరూ తోడబుట్టిన వాళ్ళేనాయె. ఏణ్ణర్థ అటూయిటూ గాళ్ళేనాయె పిల్లదాన్ని ఎవడికిచ్చి ఎవడిక్కాదనేట్టుటా. ఓనాడు మధ్యాన్నవేళ కుర్రగాళ్ళిద్దరూ జెమాజెట్టీల్లా, రామలక్ష్మణుల్లా పోటాన పోటీలు పడుతూ వాకిట్లో చెవపంది రేస్తూ ఉండగా నాన్నమ్మ కేవ్వూహాబోయిందో మరి — ఒరే తాతిగా ఒరే రామకిష్టుడూ అదలా ఒగేసి మీరిలా రండ్రా అంది. అప్పగారంటే ఇద్దరికీ హడలే. పనిఉన్న పళంగా వదిలేసి చేతులు గట్టుకు నిలబడ్డారు. ఆ గుమ్మపక్కన నాన్నమ్మ, పిల్లదానికి మొగల్లజేస్తోంది. ఏవిరా రామకిష్టుడూ వరాల్నిచ్చి పెళ్ళి జేస్తాగాని కూడెట్ట గలవట్రా అంది. రామకిష్టుడు గర్వంగా చిన్నాడికేసి చూసి, వరాల్ని ఓరకంట చూసి చేస్ పిల్లానిక్కూడెట్టలేని వాడుంటాడేవ్. అంతగా యేంలేకపోతే అడుక్కు తెచ్చన్నా పెట్టనా అన్నాడు.

ఒరే నీయింటకోడిగాల్లా. ఏంకూతకూశావురా. కొంపకీ కులానికీ కూడా అప్రదిష్ట మాటంటివిగదరా. మాలక్ష్మినిచ్చి మనువుజేస్తే అడుక్కు తెచ్చి అన్నం పెడతానంటావుట్రా అంది నానమ్మ నవ్వి.

మరి తాతబ్బాయీ నీమాటేటిరా. నువ్వు పట్నంలో అడుక్కుదెస్తానంటావా అంది ఇంకో క్షణం ఆగి.

చెచేస్. అడుక్కోడవేంగతి అప్పా. సంపాయిస్తా. అందాకా అవసరమైతే ఎవడి తలో తాకట్టేసి అప్పుదెచ్చి బువ్వపెడతా. ఆపాటి మొగాణ్ణికానా. ఎవడూ యివ్వకపోతే నువ్వే ఇస్తావు అప్పు అన్నాడు తాతబ్బాయి ముసిముసినవ్వులు నవ్వుతూ.

నీకడుపు చల్లగుండ. ఎంతమాటన్నావురా కడుపులో ఎంతోటి ఊహాలున్నాయి. అని ముక్కున వేలేసుకుని అలాగే విస్తుబోయింది నానమ్మ

ముళ్ళపూడి వెంకటరమణ

అమ్మో జెడెయ్యవేవ్. మెడ నెప్పెసి తాది అని మాలక్ష్మి వరాలు గావు కేకేసి వరకూ తల్లి తేరుకోనేలే.

సరే ఇద్దరిలోనూ తాతబ్బాయి ఇంత ప్రవేజకుడు గదా అని, ఇంటిల్లిపాది పెద్దవాడు రామకిష్టుడు వేపే మొగ్గినా, నానమ్మ పట్టుబట్టి పిల్లని వీడికే కట్టబెట్టింది. మరి తరవాత వాడెంత ప్రవేజకుడైనాడనీ, అప్పులెయ్యడం కూడా ఏమంత గొప్పపనిగాదనుకో, అయితేనేం అందులో తలకాయలు మార్చెలిద్దే. మాటసుళువూ మనిషి సుళువు తెలీడం ఉన్నాయి. తాతబ్బాయి ఇల్లు గట్టాడు. కుర్రబ్బండి కొన్నాడు. పెదనాయుడనిపించుకున్నాడు. వాడు అప్పుచేశాడంటే చేసినట్టే ఉండేదికాదు. ఇచ్చినాడికూడా తెలిసేది గాదనమాట. ఒక్కనాకొడె వాడిఆట సాగి రాలేదు. నేనీవిషయంలో కాలాంతకుణ్ణిలే...ఎవరది ఆ వచ్చేదీ! నాన్నా చీకటడింది. కోడలు పిల్లని దీపందెచ్చి పెట్టమనూ వాకిట్లో. ఎవరది నర్సయ్యా! రారా రావయ్యా అలాకూర్చో. అన్నాడు మునసబుగారు కథ ఆపి.

గుర్నాథం లోపలికెళ్ళి దీపం వెలిగించి తెచ్చేవరకూ మాటలు వినిపిస్తున్నాయి సావిట్లోకి. నరసయ్య మహా ఉత్సాహంగా, హడావుడిగా మాట్లాడుతున్నాడు.

నాయుడుగారూ మీదాకా వచ్చింది. ఘంటకితం కరణంగారింట దస్తుదస్తంతా క్రిష్ణార్పణం అయిపో(ను)... ఎవడో నల్లటాడు. కోరమీసాలూ జలపాలూ వాడూ జీబూతంలా ఉన్నాడు...... కాకపోయినా అంత యిదైతే ఎలాగండీ. ఎంత కరణమైనా ఇంట్లో అలా వేలకి వేలు దస్తు అట్టే పెట్టుకుంటే ఎలా? ఎప్పటిదప్పుడు పైకి పంపి చెయ్యాలి గాని (ఎంతిగ్యాక పోయిందీ అంటున్నారు మునసబుదారు) ఆ యిదంతా పరపతికోసంలే. పదిపరకా సర్ది మునసబంత వాననిపించుకోవాలని తాపత్రయం...అది సరే గాని మాటవరసకడుగుతా. మీరూ ఇన్నాళ్ళు మునసబుగిరీ చేశారు మంచాయె చెడాయె. రొఖం అలా ఇంట్లో ఎక్కడ పెడితే అక్కడ పడేశారండీ... అహా తెలీకడుగుతున్నా...ఎంతన్నారూ... రెండొందలా...చూశారా మరి. ఆపాటి మగసరిలేకనే మీరు అంతకొద్ది రొఖ్ఖం అట్టే పెట్టుకోడం? ఆపాటి పెగ్గ మీకు లేకపోయిందా అంట. ఏవిటో ఎవడిమటుకు వాడు ప్రవేజకుణ్ణనుకుంటాడు వాడితోటే ఆవిద్య పుట్టిందని.. .. ఇదిగో మావధవా ఉన్నాడు ప్రవేజకత్వానికి, తెల్లారి మెయిలు బండికి చెన్నపట్నం వెళ్ళి తీరాలిచచ్చి తీరాలి అని పట్టుబట్టి కూర్చున్నాడు పన్నావాయ నాకేమో రేపు పున్నమెళ్ళిన తదియనాటిగ్గాని ఆ కోపరటివు వాళ్ళులోను తగలెయ్యనంటున్నారు...అవందా మీరిటు సర్దితే అది రాగానే పిరాయించేదాం. ఏకొ ఆపాటి పదిరూపాయలు చేతబట్టుకూ చోగల మొగాళ్ళేడీవుళ్ళో. ఎవడిమటుకు వాడికి భయమేనాయె. ఏ నర్సయ్యవచ్చి అప్పు దెమ్మంటాడో...ఏ నర్సయ్యొచ్చి కన్నం వేస్తాడోనని...జవాబు చెప్పే సత్తాలేక నేగదా పెతివాడూ రొఖ్ఖం దగ్గర పెట్టుకోంది. మన కాలం ఇలాటి జజ్జుతనం ఉండేదండీ... వందచాలు. పున్నమెళ్ళిన తదియనాడు చంద్రోదయం వేళకల్లా మళ్ళా సర్దెయ్యనూ... పెద్దమనిషిలో మాటామరోటా... అబ్బాయీ ఏవిటి...

అబ్బాయి గుర్నాథం దీపం పట్టుకు వచ్చాడు.

మునసబుగారు మీసాలను లాలించి, గుర్నాథం, ఆ సందుగపెట్లో ఓ వంద తెచ్చి నర్సయ్యకివ్వూ. పద్దుపుస్తకం కూడా పట్రా అన్నారు గంభీరంగా.

* * *

నర్సయ్యగాలిగుమారం వచ్చి వెళిపోయాడు.

ఆ. ఇందాక చెబుతున్న దేవిట్రా... అన్నారు మునసబుగారు.

అప్పులడిగేవాళ్ళదగ్గర నువ్వెంత గట్టివాడవో చెబుతున్నావు అన్నాడు జగ గుర్నాథం సావిడివంక చూసి నవ్వుతూ. అట్నుంచి కూడా సన్నటి నవ్వు వినబడింది.

ప్రత్యేక త్రిగుణాచర్యతో

గూడియున్న మెక్లీన్స్

పెరాక్సయిడ్ టూత్ పేస్టు



1

బాలా బాగుగా

* శుభ్రపరచును!

ప్రత్యేకంగా మెక్లీన్స్‌లోనున్న 'రైసాయిడ్' సాల్వెంట్ మీ పళ్ల మీద యేర్పడు చుండే–మురికిని క్రిములను గలిగియుండే పాచి పొరను నిర్మూలించును. ఈ పొరను కరిగించుటవల్ల మెక్లీన్స్ మీపళ్లను బాగుగా శుభ్రపరచును.



2

బాలా బాగుగా

* తెలుపుజేయును!

మెక్లీన్స్‌లోనున్న ప్రసిద్ధమైన "పెరాక్సయిడ్" మీ పళ్లకు గల వికృతమైన డాగులను, గారపట్టిన రంగును తొలగించును–అందువల్ల వాటిని మెరిసేటట్లు తెల్లగా జేయును.




3

*

బాగుగా కాపాడును!

మీరు మెక్లీన్స్‌ను స్వయముగా వాడి దానియొక్క సుప్రసిద్ధమైన రుచిని తాజాదనమును కనుగొనండి. ఇది పనుచిగుళ్లను ఉత్తేజ పరచి, దంతక్షయమును కలిగించే క్రిములను నిర్మూలించును.



బాగుగా పరిశుభ్రపరచును + బాగుగా తెలుపుజేయును + బాగుగా కాపాడును

ఈ మూడు గుణముల సుప్రసిద్ధమైన. కూడిక మీకు త్రిగుణ చర్యను గలిగించును, ఇది మెక్లీన్స్‌లోమాత్రమే ఉన్నది.

**అతి శుభ్రమైన, అతి తెల్లని, అత్యారోగ్యవంత మైన పళ్లకోసం.. నేడే మెక్లీన్స్ కొనండి!**

MTY-46

క్రీడారంగం;

# వింబుల్డన్ సమీక్ష

ఈ మధ్య జరిగిన వింబుల్డన్ పోటీలలో చెప్పుకోతగ్గ ఆటగాళ్ళు ఎవరూ పాల్గొనకపోయినా, మనదేశంలో అందరూ ఈ పోటీని ఆసక్తితో, ఉత్సాహంతో, మగనించారు దీనికి కారణం మనదేశ ప్రతినిధి రామనాథన్ కృష్ణన్ అంతకుముందు జరిగిన క్వీన్సుక్లబ్ పోటీలలో సింగిల్సు గెలవటమే క్వీన్సుక్లబ్ పోటీలలో కృష్ణన్, విశేషమైన నైపుణ్యం చూపించి వింబుల్డన్లో గెలుపొందే ఆటగాడుగా పరిగణింపబడిన అలెక్సు ఆల్మెడోను సునాయాసంగా 8-6, 6-1 స్కోరుతో సెమీ ఫైనల్సులో ఓడించారు. ఫైనల్సులో వింబుల్డన్ పోటీలలో రెండవఆటగాడుగా పరిగణింపబడిన ఆస్ట్రేలియా ప్రతినిధి ఫ్రేజర్ను అవలీలగా 6-3, 6-0 స్కోరుతో ఓడించారు.


ఎలెక్స్ ఆల్మెడో


ఆర్. కృష్ణన్

కాని వింబుల్డన్ పోటీలలో దురదృష్ట వశాత్తు కృష్ణన్ అలెక్స్ ఆల్మెడో తో మూడవరౌండులో ఓడిపోయారు స్కోరు 6-4, 3 6, 6-4, 7-5 ఈ చాంపియన్షిప్ అంతటికి ఇదే చాలాబాగున్న మాచ్ వీరిద్దరి ఆట చాలా ఉన్నతమైనస్థాయిలో సాగినది

భారతదేశపు రెండవ ప్రతినిధి ప్రేమ జిత్ లాల్, జూనియర్ శేఖర్ ముఖర్జీ మొదటి రౌండుల్లోనే ఓడిపోయారు

వింబుల్డన్ చాంపియన్షిప్ సింగిల్సు పోటీలో వాలీయింగులోను, సర్వీసులోను ఇతోధికమైన సామర్థ్యమును చూపించి ఆల్మెడో 19 ఏళ్ళ యువకుడు ఆస్ట్రేలియా ఆటగాడైన రాడ్ లేవర్ను అవలీలగా 6-4, 6-3, 6-4 స్కోరుతో ఓడించారు. రాడ్ లేవర్ అయిదవ ఆటగాడుగా పరిగణింపబడిన బారి మెక్కేని సెమీ ఫైనల్సులో అయిదు సెట్లాడి గెలిచారు. స్కోరు 11-13, 11-9, 10-8, 7-9, 6-3. రెండవ ఆటగాడుగా పరిగణింపబడిన ఫ్రేజర్ను బారిమెక్కే క్వార్టరు ఫైనల్సులో ఓడించారు కీవర్ సింగిల్సు, డబుల్సు, మిక్సెడ్ డబుల్సు మూడింటిలోను ఫైనల్సుకు వచ్చారు కాని వీరు మిక్సెడ్ డబుల్సును మాత్రమే కుమారి డి. ఆర్. హార్ట్తో ఆడి గెలిచారు.

స్త్రీల సింగిల్సు పోటీలలో బ్రెజిల్ దేశస్థురాలైన కుమారి మరియాయస్తర్ బ్యూనో అమెరికా ప్రతినిధియైన కుమారి డార్లిన్ హార్డ్ను 6-4, 6 3 స్కోరుతో ఓడించారు.

జూనియర్ బాలుర సింగిల్సులో సోవియట్ ప్రతినిధి డి. లెజస్ 6-2, 6-4 స్కోరుతో ఆర్. డబ్ల్యు బార్న్సును, జూనియర్ బాలికల ఫైనల్సులో కుమారి జోన్ క్రాస్ 6-1 6-1 స్కోరుతో కుమారి డి. స్కూసర్ను ఓడించారు

ఈ పోటీల ఫలితాలు చూస్తే ఇండియా ఆటగాడైన కృష్ణన్ రాబోయే ఏడాది జరిగే వింబుల్డన్ పోటీలలో సింగిల్సు నెగ్గగలడనే సూచనలు కనపడుతున్నాయి ★


మిరియా బ్యూనో

---

## బుజ్జానందం హరి

ఎవరక్కడా — మా సరిమ్మా నీవక్కడా నవ్వొచ్చేసే తల్లీ చూడాంగా రేపొద్దున్న నీ మొగుడెంత పెవేజకత్వం చూపిస్తాడో

నాదేముంది అంతా అయిపోయె మాకూ మాకూ మొహమాటాలుంటాయి అదీకాక ఈ నర్సయ్యగాడు మహాటక్కరిలే వస్తు నే ముంగు నా దగ్గిర చేకాపుకి రొక్కం రెండొందలుంటుందని చెప్పించుకున్నాడాయె. ఆనక మళ్ళీ కాదనకుండా. పతవా మగోటా నువ్వే చెప్పు తల్లీ అన్నాడు. మునసబుగారు అంటెను మునుపే పారిపో కోడలు నిల్చున్న చోటు వేపు చూస్తూ.

గుర్నాధం సిగ్గుపడ్డాడు నవ్వనంగుకు.

ఎలాగైనా నర్సయ్య మంచిముండా వాడు. మర్యాదస్తుడు అన్నాడు మునసబుగారు ఓ నిముషం నిశ్శబ్దంమీద బింకంగా. -

అవున్నాన్నా ఊళ్ళో ఆయనకి పేధిపేధినా అప్పులే మర్యాదస్తుడు కాబట్టే అందరప్పు లిచ్చుంటారు. మనకే అరుబస్తాల గింజ, దీంతో కలిపి నాలుగొందలు రొఖ్ఖం ఇవ్వాల పద్దుబుక్కులో చూశాను.

పోనేమా. అసలు వాడి మాటతీరుకి, ఆ ఒదుపుకి ఊరికే ఇవ్వచ్చు అందాను. దీన్ని జూసైనా ఓ పాఠం నేర్చుకో. వందతో తెమిలిన అప్పు కాస్తా, వెయ్యిదాకా వెళ్ళలేదని సంతోషపడి దేవుడికో దణ్ణం పెట్టుకో

అన్నట్టూ దేవుడంటే గుర్తొచ్చే. శివాలయం కాడ మా స్నేహితుడు పాపం కూర్చుంటాడు నా కోసం. ఏం చెప్పనూ? అన్నాడు గుర్నాధం లేచి నిలబడి

మునసబుగారు ఓ నిముషం ఆలోచించి, పోనీ పైకం పట్టెగెళ్ళావా. నీ అంతవాడిని నువ్వౌనా! అన్నారు కాదులే నాన్నా, శేపటికి వాయిదావేదాం అన్నాడు గుర్నాధం.

(పై వారం డా॥ అప్పారావు కథ.)

## 19-8-59 సంచిక నుంచీ మరో కొత్త ఆకర్షణ

# చిత్రలేఖనంలో ఆసక్తిగలవారికి మహదవకాశం

వ్యంగ్య చిత్రలేఖనాన్ని ప్రోత్సహించాలనే సంకల్పంతో ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఆగస్టు 19వ తేదీ సంచికనుంచీ "కార్టూన్ పోటీ" శీర్షిక ఏర్పాటు చేస్తున్నాము. చిత్రకారుల ఉత్సాహాన్నిబట్టి, వచ్చిన చిత్రాల స్థాయినిబట్టి ఈ శీర్షికను వారం వారం గాని, రెండువారాల కొకసారిగాని ప్రచురిస్తాము. ఈ శీర్షికను జయప్రదంగా నిర్వహించటంలో ఆంధ్ర చిత్రకారులంతా సహకరిస్తారని ఆశిస్తున్నాము.

**ఉత్తమ చిత్రానికి**

**రూ. 12 బహుమతి**

బహుమతి పొందని చిత్రాలలో ప్రచురణార్హమైనవాటిని మామూలు పారితోషికంతో ప్రచురిస్తూ ఉంటాము.



"ఇవీ నా సిద్ధాంతాలు. మీ కిష్టం లేకపోతే చెప్పండి. మార్చేసుకుంటాను."

## కార్టూన్ పోటీ నిబంధనలు

1. కార్టూన్‌లను ఇండియన్ ఇంక్‌తో మాత్రమే డ్రాయింగ్ పేపరుమీదనే వేసి పంపాలి.
2. చిత్రం 10"×8" సైజుకి మించకూడదు.
3. ప్రతి చిత్రానికి వెనుక భాగాన "కార్టూన్ పోటీ శీర్షికకు" అని వ్రాసి, చిత్రకారుని పూర్తి చిరునామా వ్రాయాలి.
4. కార్టూన్‌లోని విషయము, లేఖనము స్వతంత్రమైనవై ఉండాలి.
5. సాధారణంగా తెలుగు జీవితానికి, వాతావరణానికి సంబంధించిన విషయమే తీసుకుని వ్యంగ్య చిత్రం వేయాలి.
6. వ్యాఖ్యానం(కాప్షన్) లేని చిత్రాలయితే మంచిది. వ్యాఖ్యానం అవసరమైతే ఒకటి, రెండు పంక్తులకుమించకూడదు.
7. ఈ శీర్షికపై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు. నిరాకరించిన వాటిని తిప్పిపంపగోరేవారుతగిన స్టాంపులు పంపాలి.
8. ఒక్కొక్క చిత్రకారుడు ఎన్ని చిత్రాలయినా పంపవచ్చు. ప్రవేశరుసుము లేదు. బహుమతుల నిర్ణయంలో సంపాదకునిదే తుదినిర్ణయం.



# తీరని కోర్కెలు

తెల్లవారుఝామున కోడికూతవిని, సింహాద్రి ఉలిక్కిపడి నిద్రలేచాడు. అంతవరకూ మధుర స్వప్నాలలో ఈ లోకాన్నే మరచిపోయి హాయిగా విహరించిన అతనికి, మళ్ళీ రోజూ కనపడే మనుషులూ, పరిసరాలూ కనిపించేసరికి, వో విధమైన విరక్తి కలిగింది. తాను వూహించుకున్న లోకానికీ, ఈ ప్రపంచానికీ యెంతటి వైరుధ్యం!

కలలు యెంత మధురంగా వుంటాయి! కాసేపయినా మానవుడు తన కష్టాలు విస్మరించేటట్లు చేస్తాయి.

సింహాద్రికి కలలో కనకం కనిపించింది. అతనిని గిలిగింతలు పెట్టింది. ఇద్దరు విలువైన దుస్తులతో యేదో మహానగరంలో హాయిగా విహరించారు.

ఆమె ఎంత అందంగా వుంది!

భూలోకంలో వున్న తన ప్రియునికై, అందంగా అలంకరించుకునివచ్చిన ఊర్వశిలాగుంది.

ఊర్వశి! కనకం యెంతమంది రసికులకు ప్రేయసో! ఏమయితే, తనకెందుకు!...

తనకు కలలో పైగా సాక్షాత్కరించింది. అంతే చాలు!

కనకం మనస్సు చంచలమైనదని తనకు తెలుసు! అయినా, ఆమెను విడిచిపెట్టి వుండలేడు.

కలలో కనకం యెంత బాగుంది! తీగసంపెంగలా విలాసంగా, నాజూగ్గావుంది. చవుకబారు సబ్బు సువాసనలతో, పౌడరు పూసుకుని అందంగా కనిపించింది.

ఒకసారి తన గుడ్డలకేసి చూసుకున్నాడు. అబ్బ! ఎంత అసహ్యంగావున్నాయి. మంచి ఖరీదయిన బట్టలు కొనుక్కోవాలని యెన్నాళ్ళనుంచో అనుకుంటున్నాడు. కాని చేతిలో డబ్బు కనిపించటంలేదు. అయినా, తను వూరుకోకుండా, సాధ్యమైనంతవరకూ, ఖర్చులు తగ్గించుకుని, పొదుపుగా ఖర్చు పెడుతూ, కొంత డబ్బు సమకూర్చుకున్నాడు.

తెల్లవారింది. కానీ యింకా సూర్యోదయం కాలేదు. సింహాద్రి సరాసరి పొయ్యి దగ్గరకు వెళ్ళాడు. జేబులో వున్న సంచి బయటకితీసి, అందులో వున్న డబ్బు లెక్కపెట్టాడు. "ఇంకొక్క రూపాయి" అంటూ తనలో గొణుక్కున్నాడు. ఇంకా, వొక్క రూపాయివుంటే కాని, మంచి దుస్తులు లభించవు. అది సంపాదించటం యెలా? ఈ చిరిగిన గుడ్డలలో, తను యెన్నాళ్ళు కాలక్షేపం చేస్తాడు?

"మంచిబట్టలు కొనుక్కోవాలి" అంటూ మనస్సులో అనుకున్నాడు.

సింహాద్రి ముందుకు నడిచాడు. సరాసరి వొక ఇంటిముందు ఆగాడు. రోడ్డుమీదకు వ్యాపించివున్న కొమ్మనుండి పూలు కొన్ని రాలిపడివున్నాయి. వాటిని ఏరుకుందామనుకున్నాడు సింహాద్రి. ఈ పూలన్నీ తీసుకువెళ్ళితే కనకం సంతోషిస్తుంది. కాదు! అదంతా వట్టి భ్రమ! ఆమె ఈ పువ్వులకోసం తపించిపోవటంలేదు. "... కం విలువైన బహుమతులు బహూకరించగల ప్రియులున్నారు. కనుక ఈ పూలు తీసుకు వెళ్ళటం అనవసరం.

గబగబా అంతవరకూ ఏరిన పూలను మళ్ళీ అవతల పారబోశాడు. ఇంతలోనే ఆ వీధి గుమ్మం తలుపులు తెరచుకున్నాయి.

"ఎవర్రా! దొంగవెధవా! ఇక్కడ తిరుగుతున్నావు" అంటున్నాడు తలుపు తెరచిన ఆసామి.

సింహాద్రి అక్కడ వొక్కక్షణం వుండలేదు. గబగబా అడుగులు వేసుకుంటూ నడిచాడు. కొంతదూరం అలానడిచి వెనక్కి తిరిగిచూచాడు. ఇందాక తలుపు తెరచిన వ్యక్తి తనను వెంబడించడం లేదు. ఇక భయంలేదు.

మెల్లిగా, యెవరూ చూడకుండా పూలతోటలోకి వెళ్లాడు. తనకు కావలసిన పూలు కోసుకుని గబగబా గుడిదగ్గరకు వచ్చేశాడు. అక్కడ పూలుఅమ్మేదుకాణాలు వున్నాయి. వాళ్లకు సింహాద్రి పూలు ఇచ్చి, ...

బి. విద్యాసాగర్

# తీరని కోర్కెలు

ఇచ్చిన డబ్బులు తీసుకున్నాడు.

"ఇంకొక అణాయివ్వండి బాబూ! పూలు యెక్కడా దొరకడంలేదు" అన్నాడు.

'అవునవును! నువ్వు నీ స్వంత తోటలో నుంచి కోసుకొస్తున్నావు కదూ? చాలుచాల్లే'

సింహాద్రి ఇంకేమీ మాట్లాడలేక పోయాడు. పావలా పంచిలో పడేసుకుని నడక సాగించాడు. ఇంకా ముప్పావలా కావాలి. అదికూడా ఈరోజులో సంపాదించాలి.

'ఆగుడ్డల షాపు తెరిచారేమో!' అనుకుంటూ చురుగ్గా నడిచాడు. అయినా డబ్బులుచాలనిది అక్కడికి వెళ్ళి మాత్రం లాభమేమిటి?...ఏమో! ధరలు తగ్గకూడదూ?

దుకాణాలు ఇంకా తెరువలేదు ఒకపాత గుడ్డలషాపుమాత్రం తెరచివుంది. అక్కడ మంచిబట్టలు దొరకవు. అందుకని ముందుకు నడిచాడు.

ఎవరో ముసలమ్మ, నెత్తిమీద వొకమూట చంకలో పిల్లవాడు, చేతిలో వొక బరువైన సంచీ పుచ్చుకుని భారంగా అడుగులువేస్తూ నడుస్తున్నది. ఆమెను చూస్తే సింహాద్రికి జాలివేసింది. పైనున్న మూట ఏక్షణానయినా క్రిందపడేటట్లుంది. చేతిలోవున్న సంచి జారిపోయేటట్లుంది.

"అవ్వా! నేను తీసుకొచ్చి పెడతాను" అంటూ సింహాద్రి అడుగు ముందుకు వేశాడు.

"అక్కరలేదు" అంటూ ముసలమ్మ ముందుకు సాగింది. సింహాద్రి ఆమెను వెంబడించాడు.

"నువ్వు మొయ్యలేవమ్మా! నేను తీసుకువచ్చి పెడతానుగా!"

"ఏమి యివ్వమంటావు?"

"మీకెంతతోస్తే అంత!"

సింహాద్రి మూట, సంచీ ఆమెవద్దనుండి తీసుకున్నాడు "ఎక్కడకు పోవాలమ్మా?" అని అడిగాడు.

"బస్సు స్టాండుకు"

"అలాగే!" అంటూ ఆమెతోపాటు నడిచాడు. బస్సులో ఆమెను కూర్చోపెట్టి, ఆమె యిచ్చిన పావలా తీసుకున్నాడు.

మళ్ళీ దుకాణాల వైపుకు నడిచాడు. వంతెన దాటి అవతలకు చేరుకునే టప్పటికి, తన దగ్గర పూలు తీసుకున్న మనిషి కనిపించాడు. ఎందుకో అతన్ని చూస్తే సింహాద్రికి వళ్ళుమండింది.

గుడ్డల దుకాణం యింకా తెరవలేదు. సింహాద్రి సరాసరి పెద్దవీధిలోకి వెళ్ళాడు. అక్కడ తను రోజూ పండుకునే అరుగు మీద ఎవరో విశ్రమించటం చూచి

"లేవరా వెధవా!" అంటూ భుజం తట్టి లేపాడు. అతను ఉలిక్కిపడిలేచి సింహాద్రిని చూసి భయంతో పారిపోయాడు. సింహాద్రి విజయగర్వంతో వికటంగా నవ్వాడు.

రోడ్డుకు వొకపక్కగా పడివున్న సిగరెట్ ముక్కలను ఏరి జేబులో పడేసుకున్నాడు. అక్కడనుంచి కాలువ వైపుకు వెళ్ళాడు. ఇంకా పడవలు తిరగటంలేదు. నీళ్ళు నిశ్చలంగా ప్రవహిస్తున్నాయి. కాలువకు వొక పక్కగా పడవలను వొడ్డున వున్న గుంజలకు కట్టివేశారు సింహాద్రికి దూరాన వున్న కొండలు, అక్కడక్కడ యింక మినుకు మినుకు మంటున్న విద్యుద్దీపాలు కనిపించాయి. 'ప్రకృతి ఎంత రమణీయంగా వుంది' అనుకుంటూ నడక సాగించాడు.

సూర్యోదయమయింది. పడవ వాళ్ళు తమపనిలో నిమగ్నులయినారు. కూలీ వాళ్ళు ఫ్యాక్టరీ కూత విని హడావుడిగా పోతున్నారు.

బాగా తెల్లవారింది పొగమంచుపోయి, భవనాలపై సూర్యకిరణాలు పడుతున్నాయి. "గుడ్డలషాపు ఈపాటికి తెరచివుంటారు," అనుకుంటూ సింహాద్రి మళ్ళీ నడక సాగించాడు.

షాపు తెరచివుంది. అద్దాలలోపల మంచి గుడ్డలు వేళ్ళాడుతున్నాయి. సింహాద్రి లోపలకువెళ్ళి అడిగాడు.

"మొన్న చూసివెళ్ళాను. ఆ గుడ్డలఖరీదు యేమయినా తగ్గిందా!" అంటూ ఆదుర్దాగా అన్నాడు.

సింహాద్రిని చూడగానే, ఆ షాపు యజమాని గుర్తుబట్టాడు. అందుకని

"తగ్గలేదబ్బాయి!" అన్నాడు.

సింహాద్రి నిరాశచెందుకుని, మళ్ళీ బయిటికి వచ్చేశాడు. మిగతా డబ్బులుకూడా సంపాదిస్తేతప్ప, తనకు ఆ మంచిగుడ్డలు లభించవు.

సింహాద్రి మార్కెటువైపుకు నడిచాడు. కూరగాయలలారీ యింకారాలేదు. దానికోసం యెదురుచూస్తూ నుంచున్నాడు. అది వస్తే, కూరగాయలు దించినందుకు, తనకు కూలిడబ్బులు దొరుకుతాయి ... ఇంతలోనే లారీవచ్చి మార్కెటుదగ్గర ఆగింది.

గబగబా కూరగాయలుదించి, వంకాయలు బీరకాయలు, కేబేజి, పొటికవి ఏరి కుప్పగాపోశాడు. వాటినన్నింటినీ వేరువేరు తట్టలలోకి నింపాడు. సింహాద్రిచేతిలో అర్ధరూపాయిపడేశారు. ఆ డబ్బులు తీసుకుని వెళ్తూ, ఎవరూ చూడకుండా వొక నారింజపండు సింహాద్రి లాగుజేబులో వేసుకున్నాడు.

అప్పటికి మధ్యాహ్నం పన్నెండుగంటలు కావస్తున్నది. ఇప్పుడు గబగబా హోటలుకు వెళ్తే, కంచాలు, ప్లేట్లు అవీ కడగవచ్చును. అవి కడిగితే, హోటలువాళ్ళు కొద్దిగా అన్నంపెడతారు. ఇలా అనుకుంటూ సింహాద్రి వేగంగా నడిచాడు.

హోటలుకువెళ్ళాడు. ఎవరో భోజనం చేస్తున్నారు. వారిబల్లమీద పెరుగు కప్పులలో పెట్టివుంది. పెరుగుచూసే సింహాద్రికి నోరువూరింది. ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నాడు - ఒక్కసారయినా ఈహోటలులో పెరుగు వేసుకుని దిట్టంగా భోజనం చేయాలని కానీ వీలుకావటంలేదు. చివరికి తన బతుక్కి ఎంగిలి మెతుకులే ఆధారమయినాయి.

హోటలు వెనుకభాగంలోకి వెళ్ళాడు. ఎంగిలిప్లేట్లు, గ్లాసులు, కంచాలు అవీ పడేసివున్నాయి. వాటినన్నిటినీ సింహాద్రి శుభ్రంగా కడిగాడు. హోటలువాళ్ళు పెట్టిన అన్నంతో కడుపునింపుకున్నాడు.

ఆకలిబాధ తీరగానే, సింహాద్రి పార్కుకు వెళ్ళి ఒక చెట్టునీడన కూర్చున్నాడు. మొల్లోవున్న మూటతీసి డబ్బులు లెక్కపెట్టుకున్నాడు. సరిగ్గా పదిరూపాయిలు వున్నాయి. ఇప్పుడు గుడ్డలు తీసుకోవడానికి డబ్బు సరిపోతుంది. కానీ ఈ వేళప్పుడు కొట్టు తెరిచివుంటుందా! ఏమో! నమ్మకంలేదు. ఆ పాత గుడ్డలషాపు తప్పితే, మిగతా దుకాణాలన్నీ మిట్టమధ్యాహ్నం అప్పుడు మూసివుంటాయి.

కాసేపు చెట్టుకింద విశ్రమించి, సింహాద్రి లేచాడు. పార్కులో ఎవరో పిల్లలు గోలీలు ఆడుకుంటున్నారు. అదికూడా వూరికే కాదు! డబ్బులు పందెంవేసుకుని ఆడుకుంటున్నారు సింహాద్రి కాసేపు వింత చూద్దామని అక్కడకు వెళ్ళి నుంచున్నాడు. ఒక కుర్రవాడు అప్పుడే పావలా గెల్చుకున్నాడు. గమ్మత్తుగానే వుంది! తను కూడా కాసేపు గోలీలు ఆడుదామా అనుకున్నాడు సింహాద్రి. ఇంతలోనే వొక పిల్లవాడు "ఆడుతావా" అంటూ పిలిచాడు. సింహాద్రి తటపటాయించాడు.

"ఫరవాలేదు! ఒక్కకాని పందెంపెట్టి ఆడు." అన్నాడు వొక కుర్రవాడు. సింహాద్రి చలించాడు. గోలీలు ఆడి డబ్బు సంపాదించవచ్చునని అనుకున్నాడు.

గబగబా అణా సంపాదించాడు. సింహాద్రికి వుత్సాహం వచ్చింది ఇంకా కాసేపు ఆడాడు...అణా కాస్త బేడ అయింది. మిగతాపిల్లలు పందెం పెంచుదామన్నారు. సింహాద్రి సరేనన్నాడు. అమితోత్సాహంతో యింకా ఆడాడు. కానీ, ఈ సారి సింహాద్రి వోడిపోయాడు. ఒక పావలా పోగొట్టుకున్నాడు. ఆ పావలాకోసం యింకా ఆడాడు. ఇంకా కొంతడబ్బు పోగొట్టుకున్నాడు. మొత్తం రూపాయి పోయేదాకా, సింహాద్రికి వొళ్ళు తెలియలేదు

"అబ్బా రూపాయి పోయిందే! ఎంత

# ★ తీరని కోర్కెలు ★

శ్రమపడి ఈ డబ్బు సంపాదించానో!" అనుకున్నాడు సింహాద్రి విచారంగా. ఒక్క రూపాయి! సరిగ్గా మళ్ళీ ఒక్క రూపాయి తక్కువయింది!—అరగంట క్రితం తృప్తిగా తనలో నవ్వుకున్నాడు. కాని యిప్పుడు రూపాయి పోయిందని విచారంలో మునిగి తేలుతున్నాడు. ఆర్థికంగా బాగున్న వారికి రూపాయి విలువ తెలియదు. అది వారి దృష్టిలో, అరగంటసేపు వినోదం సమకూర్చుకోనేందుకు వినియోగపడే ఆటవస్తువు వంటిది. కాని, చెమటోడ్చి, రోజల్లా పనిచేసి సంపాదించుకున్న రూపాయి పోతే సింహాద్రిలాంటి వానికి విచారం కాక మరేమి కలుగుతుంది?

అదే విచారంతో మనస్సు వ్యాకులపడ్తూ ఉంటెగా, సింహాద్రి అక్కడనుంచి నడచి వెళ్ళిపోయాడు. ఒక ఇరుకయిన సందులో నుంచి పోతూవుంటెగా, ఎక్కడినుంచో ఆర్తనాదం వినిపించి ఉలిక్కిపడ్డాడు. దూరంగా వొక ఇంటి అరుగుమీద కూర్చొని ఒక చిన్నపిల్ల ఏడుస్తున్నది. గబగబా సింహాద్రి అక్కడకు చేరుకున్నాడు. మామూలుగా అలాంటి దృశ్యం చూస్తే చలించేవాడు కాదు. కాని యిటీవల తను పడుతున్న బాధలు గుర్తుకు తెచ్చుకున్నప్పుడు ఎదుటివారి కష్టం చూస్తే జాలికలుగుతోంది.

"ఎందుకమ్మా! ఏడుస్తున్నావు" బుజ్జగింపుగా అడిగాడు సింహాద్రి. ఆ పిల్ల ఏడుపు మాని "ఆకలేస్తున్నది" అంది. సింహాద్రికి నవ్వు వచ్చింది

"ఆకలేస్తే మీ అమ్మను అన్నం పెట్టమని అడుగు"

"నాకు అమ్మా నాన్న ఎవరూ లేరు"

"పోనీ, అత్తగానీ మామగానీ వున్నారా—?"

"ఎవ్వరూ లేరు" అంటూ ఏడ్చింది. సింహాద్రి గుండె కరిగిపోయింది. అతనికి ఆకలిబాధ అంటేయేమిటో బాగా తెలుసును. ఇటీవల ఉపవాసాలు చేయడం వలన అది బాగా తెలిసి వచ్చింది.

జేబులో వున్న నారింజపండు సంగతి జ్ఞాపకం వచ్చింది. చప్పున దానిని బయిటితీసి సింహాద్రి, ఆ పిల్ల కిచ్చాడు. గబగబా వలుచుకుని ఆ పిల్ల తినేసింది. ఆ పిల్ల స్థితి చూస్తే సింహాద్రికి అతని చిన్నతనం రోజులు జ్ఞాపకం వస్తున్నాయి. తల్లిదండ్రులు లేని అతన్ని యెవరో పుణ్యాత్ములు దగ్గరకుతీసి కొన్నాళ్ళు పెంచారు. అప్పటినుంచి బికారిలాగా దేశాటన చేస్తున్నాడు. ఇప్పుడవన్నీ తలుచుకుంటే గుండె చెరువవుతుంది.

"టీ త్రాగుతావా, అమ్మా!" అన్నాడు సింహాద్రి.

త్రాగుతానన్నట్లు ఆపిల్ల తల వూపింది. ఇద్దరూ హోటలుకు వెళ్లారు. హోటల్లో, సింహాద్రి అడిగాడు "నీ పేరేమిటమ్మా" అని.

"సుబ్బి" అని చెప్పింది ఆపిల్ల. టీ త్రాగాక ఇద్దరూ మళ్ళీ బయటకురాగానే సింహాద్రి నవ్వుతూ,

"నువ్వు వూరికే తిరిగితే లాభం లేదు. ఏదైనా పనిచేయాలి" అన్నాడు. సుబ్బికి అతని భావ అర్థంకాలేదు. ఏమిటో పెద్ద మాటలు ప్రయోగిస్తున్నాడు?

"పనిచెయకపోతే నేం," అంది అమాయకంగా.

"పని చేయకపోతే, అన్నంఎక్కడనుంచి వస్తుందే, పిచ్చి పిల్లా!" అన్నాడు సింహాద్రి.

సుబ్బికి యిప్పుడు కొద్దిగా అర్థమైంది. "అయితే నన్ను ఏమి చేయమంటావు" అంది.

సింహాద్రి మాట్లాడలేదు. ఆపిల్లను ఏపని చేయమనడానికీ తోచలేదు. అంత చిన్న పిల్ల ఏమి చేస్తుంది? మొగ పిల్లవాడయితే ఫరవాలేదు. ఇలా ఆలోచిస్తూ వుండగానే, సుబ్బి గొంతెత్తి పాడటం మొదలుపెట్టింది. ఆమె కంఠం శ్రావ్యంగా వుంది. జనం మూగారు. నాదస్వరం వూదుతుంటే, పాములు తలలాడించినట్లు వాళ్లు మంత్రముగ్ధులుగా అచేతనంగా వుండిపోయారు

సుబ్బియింకా పాడుతూ నేవుంది. కొందరు ఆమెచేతిలో డబ్బులు వడేస్తున్నారు. సింహాద్రి ఆశ్చర్యపోయాడు. ఈ పిల్లకు డబ్బు సంపాదించటానికి ఎక్కువ తర్ఫీదు యివ్వనక్కరలేదు.

సాయంత్రానికల్లా సుబ్బి రెండురూపాయిలు సంపాదించింది. అయితే ఆపిల్లకు ఎంతడబ్బు వచ్చిందో సరిగా తెలియదు. వచ్చినదంతా సింహాద్రి కిచ్చేసింది నిజానికి, అతనికంటే ఆపరిస్థితులలో ఆప్తులు ఎవరూ లేరు. సింహాద్రికూడా సంతోషించాడు.

సంజ చీకటిలో కొన్ని తన వొడిలోకి యిముడ్చుకుంది. కాసేపటిలో బాగా చీకటిపడింది. వీధులలో విద్యుద్దీపాలు వెలుగుతున్నాయి. ఆ దీపాల కాంతిలో సింహాద్రి, సుబ్బి గుడ్డలవంక చూశాడు. అవి బాగా చిరిగిపోయి వున్నాయి.

చలిగాలి వీచింది. సుబ్బి వణికిపోతూ, సింహాద్రిని కౌగలించుకుంది. ఆపిల్ల దీనస్థితి చూస్తే, సింహాద్రిగుండె తరుక్కుపోతున్నది

దీపాల కాంతిలో సింహాద్రి డబ్బు మళ్ళీ లెఖ్ఖపెట్టుకున్నాడు. గుడ్డలు కొనుక్కోవడానికి పుష్కలంగా సరిపోతుంది. పోగొట్టుకున్న రూపాయికి బదులు రెండు

# ★ తీరని కోర్కెలు ★

రూపాయలు సమకూర్చుకున్నాడు. కనుక ఆపిల్లకు ఏదైనా కొనిపెట్టకపోతే బాగుండదు!...ఇలా ఆలోచిస్తే తనకోరిక నెరవేరదు. కనుక సుబ్బిసంగతి మరిచిపోవాలి. కాని ఆమెనుఎలా విస్మరించడం!

వంతెన మీదుగా యిద్దరూ నడిచి పోతున్నారు. చలిగాలి రివ్వున వీయడంతో, సుబ్బి మరింత వణికిపోయింది.

బట్టల దుకాణందగ్గరకు యిద్దరూ వచ్చేరు. సింహాద్రి ఆలాగూ, చొక్కా వున్నాయో, లేవోనని ఆదుర్దాగా చూశాడు. ఇంకా అవి అలాగే వున్నాయి. అతని గుండె కుదటపడింది. సుబ్బి డబ్బుతో అవి యిప్పుడు తీసుకుందా మనుకున్నాడు. కాని అతని అంతరాత్మ వద్దని వారించింది.

"ఆ పిల్ల ఈ రాత్రికి చలిలో వణికిపోతుంది. కనుక, ముందు దానికి గౌను వొకటి కొనిపెట్టు" అని సలహా యిచ్చింది మనస్సు.

"నేను ఆమె డబ్బు కాజేయటంలేదు కదా! రేపు నేను సంపాదించి సుబ్బి డబ్బు తిరిగి యిచ్చేస్తాను," అనుకున్నాడు సింహాద్రి. కానీ యెందుకో అతనికి వుత్సాహం కలగటంలేదు. తను మళ్ళీ ఆమె డబ్బు తిరిగి యివ్వగలడని నమ్మకమేమిటి? తనకు దుర్బుద్ధి పుట్టకూడదూ?

"ఆమె డబ్బును నా కోసం వినియోగించుకోవడం చాలా తప్పు" అని అంతరాత్మ ఘోషించింది.

షాపులోకి వెళ్తున్నవాడు కొస్తా ఆగిపోయాడు. సుబ్బి చెయ్యిపుచ్చుకుని, ఆ షాపుకు దూరంగా వెళ్ళిపోయాడు. మనసులో తుపానులు చెలరేగుతున్నాయి. నిముషనిముషానికీ వింత వింత ఆలోచనలు వస్తున్నాయి. తను ఆలస్యం చేస్తే ఆ బట్టలు యెవరయినా కొనుక్కుపోతారు. మళ్ళీ అంత మంచి బట్టలు దొరకవేమో!...కానీ, యెలా వాటిని తీసుకోవడం? ఈ రాత్రికి తను నిర్లక్ష్యం చేస్తే, ఈ సుబ్బి చలిలో చస్తుందేమో! ముందు ఆ పిల్లకు వొక గౌను, చలి బనియను కొనిపెడితే తప్ప, ఆ పిల్ల చలికి ఆగలేదు. తను యెలాగయినా గడుపుకోగలడు. కాని చూస్తూ, చూస్తూ, యింత డబ్బు వొక్క సుబ్బికోసం వినియోగించడమా! ఆమెకూ, తనకూ, యేమిటి బంధుత్వం! ఆపిల్లెవరో! తనెవరో! నిన్నటిరోజు ఆ పిల్ల ముఖం యెరుగడు కానీ, ఈ రోజు ఆమె తనకు యెంతో ఆత్మీయురాలయి పోయింది. ఏమిటో! తనకు చిన్నపిల్లలంటే వొకవిధమైన ప్రేమ, జాలివున్నాయి. అందులో, సుబ్బిలాంటి అనాధబాలికలను చూస్తే తనగుండె తరుక్కుపోతుంది. తనూ, చిన్నప్పుడు అలాంటి వాడేకదా! ఎవరో పుణ్యాత్ములు తనను దగ్గరకు తీసి పెంచి పెద్దచేశారు. తను కొస్త పెద్దవాడు కాగానే తనపొట్ట యెలా పోషించుకోవాలో నేర్చుకున్నాడు. తానీ రోజున హాయిగా తిరుగ కలుగుతున్నాడంటే ఆరోజున ఆ పుణ్యాత్ములు దయతలచి, తనకు సహాయంచేయడంవల్లనేకదా! అటువంటప్పుడు తను కూడా వొక అనాధ బాలికను పోషించడం తన కర్తవ్యం ఈ లోకంలో వొకరికొకరు సహాయం చేసుకుంటేతప్ప, క్షణం గడవడం కష్టం. కనుక సుబ్బిని తను పెంచి పెద్దచేస్తే, తనకర్తవ్యం సవ్యంగా నిర్వర్తించిన వాడవుతాడు

సింహాద్రి కళ్ళు ఆనందంతో చెమ్మగిల్లాయ్! సుబ్బివంక వొకసారి పరిశీలనగా చూశాడు. ముఖంలో యెంత అమాయికత్వం! చూడటానికి చాలా ముద్దువస్తున్నది.

"నాకు చలివేస్తున్నది అన్నాయ్!" అంది ముద్దుగా. సింహాద్రి గుండె చెరువయింది. పాపం! చలిలో యెంతబాధపడుతున్నదో!......'అన్నాయ్' అని యెంత తీయగాపిలిచిం . ఆ కంఠంలో యెంత మాధుర్యంవుంది.

సింహాద్రిలో వుత్సాహం కలిగింది. సుబ్బిని తీసుకువెళ్ళి బట్టలకొటులో గౌను, చలి బనియన్, వొకపరికిణీ తీసుకున్నారు. పది రూపాయిలయింది. సుబ్బికి అప్పుడే తొడిగించి బయిటికి తీసుకువచ్చాడు.

"నీకేమీ తీసుకోలేదేమి?" అంది సుబ్బి జాలిగా, ఆ మాటలకు సింహాద్రికళ్ళు మళ్ళీ చెమ్మగిల్లాయ్. "నాకేమి వద్దమ్మా!" అన్నాడు ముఖం మరొకపక్కకు త్రిప్పి.



# కొద్ది సన్‌లైట్
## చాలా బట్టలను ఉతికింది
-అట్లు చేసినట్టిది దాని అధిక నురగ

కళ్లారా చూస్తే నమ్మకం: శంకరం పేక ఉతికిన మెరిసే తెల్ల షర్టును చూచి చాలా సంతోషించినట్లున్నాడు. తెల్లగాను, కాంతిగాను, ఉతుకబడిన ఈ బట్టల దొంతర, దుప్పట్లు, తువ్వాళ్లు, చూడండి—ఇవన్నీ అంత కొద్ది సన్‌లైట్‌తో ఉతుకబడినవి !

సన్‌లైట్ యొక్క గుణవంతమగు సమృద్ధమైన నురగ బట్టలను చాలా శుభ్రముగా ఉతుకును మరియు బాదక్కరేకుండానే బట్టలోగల ప్రతి మురికి అణువునూ తొలగించి వేయును! దీనిని మీరే స్వయంగా ఋజువు చూసుకోండి!




'సన్‌లైట్' సబ్బు బట్టలను తెల్లగాను కాంతిగాను ఉతుకును

S.267-X52 TL

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి ఉత్పత్తి



# పెళ్ళి ప్రయాణం

"ప్రియ మిత్రుడు శేఖరానికి—

దాసుడు సూర్యం చేయు విన్నపములు ఏమనగా, మా నాన్న, అమ్మ, బంధువులు, స్నేహితులు అంతా ముకుమ్మడిగా కలిసి యీనెల 14వ తారీఖు శుక్రవారం నా పెళ్లి చేయ నిశ్చయించుకున్నారు. మన మిత్రబృందం చేసిన చట్టంలో నాల్గవ క్లాజు ప్రకారం నేను అందరికీ (అంటే రాజీగాడు, చంద్రిగాడు వగైరా) పది రోజులు ముందుగానే తెలియజేరుస్తూ, నీకు కూడా యీ వుత్తరం వ్రాస్తున్నాను. కావున తాము సకుటుంబ బంధుమిత్ర పరివారంగా వివాహమునకు విచ్చేయ ప్రార్థన.

ఆఫీసరు సెలవు యివ్వలేదని యేడుపు మొహం పెట్టక తప్పకుండా రా! లేకపోతే నా పక్కన సమాధానం చెప్పేవాళ్లుండరు. ఒంటరివాడి నయిపోతాను. పెళ్లి కూతురికి పాతికమంది పైగా ప్రాణస్నేహితులున్నారని, వారి ప్రభావం చాలచాల వుంటుందని పారాహుషా రంటూ వార్తలు వచ్చాయి. అన్నట్లు ప్రసాదరావు నీకు తెలుసుగా. బాగా పరిచయం లేకపోయినా కొంచెంగానైనా గుర్తుండి వుంటాడు. వాడి పినతండ్రి కూతురే! మరి యెప్పుడొస్తావో! నీ మీద ప్రాణాలు నిలుపుకుని వున్నాను.

ఇట్లు,

కొద్దిరోజుల్లో పరాయివాడు
కాబోతున్న నీవాడు—
సూర్యం."

ప్రాణమిత్రుడు పరిణయం ఆడబోతున్నాడంటే శేఖరానికి సంతోషంతోపాటు విచారంకూడా ముంచుకొచ్చింది. సరిగ్గా యిన్స్పెక్షన్ రోజులు! ఒకరోజా! రెండు రోజులా? పదిరోజులు! ప్రాణం పోతోందన్నా సెలవియ్యరు. సెలవు అంటూ వస్తే వింటూనే మండి పడతాడు ఆయన! అసలు పేరే హనుమంతరావు. యేం చెయ్యటం. సరిగ్గా వీడి పెళ్లికూడ యిప్పుడే రావాలి? పోనీ యే ప్రాణంపోయే జబ్బు వచ్చిందని వంక పెడ్తే! అబ్బే! డాక్టర్ని తీసుకుని యింటికి రాడూ? దొరకక దొరకక దొరికిన వుద్యోగం! అనుకోకుండా వచ్చింది. అందరూ అదృష్టవంతుడివి అంటూ యెట్లా పొగిడారు! అయినా తను పాతవాడుకూడ గాదయ్యె, చేరి ఆరునెలలు నిండాయి. అంతేగా! మరేం చెయ్యటం! రెండు చేతులు జేబులోకి పోనిచ్చుకుని ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు శేఖరం. రాజు యెవరో చెప్పా పెట్టాకుండా వాళ్ల నాన్న కిష్టంలేక అమ్మాయిని రహస్యంగా రిజిష్టర్ మ్యారేజ్ చేసుకున్నాడు. చంద్రం పెళ్లి పొట్లాటల్లో కొట్లాటల్లో అసలు అవూరునుంచి బయటబడ్తేచాలురా భగవంతుడా అన్నట్లు అంతంత మాత్రంగా అయింది. ప్రభాకరం పెళ్లి వాళ్లమ్మ చచ్చిపోతోంది. అంటే ఆదరా బాదరా అయింది. ఇక యెటొచ్చీ సూర్యం పెళ్ళేగా కొస్త నిదానంగా అవుతోంది! సూర్యం పెళ్లికూడ అయితే యిహ తను మిగులాడు. అయినా తన పెళ్లికి తనకేం సరదా వుంటుంది? ఉన్నా ఆసరదా వేరు. ప్రతిసారి అంతా కలిసి, యెంతో సరదాగా పెళ్లికొడుకు స్నేహితులం అంటూ యెంతో హడావుడి చేయాలని, తను చిలిపి చేష్టలతో ఆడపెళ్లి వారిని అట్టుడికించినట్లు వుడికించాలని యెన్నో ప్లానులు వేసుకోవటం, అవి మొదట్లోనే బెడిసికొట్టటం జరిగిపోతోంది. ఈసారి అలాగయ్యే సూచనలు కన్పించటం లేదని సంతోషిస్తుంటే, మధ్య తనకీ బెడద యేమిటి? ప్రభాకరం లెక్చరర్. కావాలసినన్ని సెలవులు! చంద్రం ఆఫీసరు యెంతో మంచివాడు. ఇహ రాజుసంగతి చెప్పనే అక్కర్లేదు. ఆ కంపెనీకి వాడే మేనేజరు. అందరికీ బాగానే వుంది. అంతా ముందొస్తారు. ఈ తిప్పలన్నీ తనకే! యేమయినాసరే, అడగాలి. నా వుద్యోగం పోతేపోతుంది. ఇలాంటివి సవాలక్ష! కాని సూర్యం పెళ్ళి జీవితంలో ఒక్కసారేగా వచ్చేది. దృఢ నిశ్చయం చేసుకున్నాడు శేఖరం

మర్నాడు ఆఫీసులో ఆరుగంటలు దాటినా, అంతా వెళ్ళిపోయినా, యేవో కాగితాలు చూస్తున్న నెపంతో వుండిపోయాడు శేఖరం అంతా పూరిగా వెళ్లిపోయారని తెలుసుకున్న తర్వాత కాగితాలు డ్రాయరు సొరుగులోకి తోసివేసి లేచినిల్చున్నాడు. కాలర్ సవరించుకుని ఆయనముందు యెలా నిలబడాలో, యేవినయంగా తను వచ్చినపని చెప్పాలో, యిన్స్పెక్షన్ రోజుల్లో సెలవేమిటయ్యా అని తిట్టంటే సహించి, మొహం యెంత ప్రశాంతంగా పెట్టాలో, అన్నీ మళ్ళీ ఒకసారి సీరియల్ వారీగా రిహార్సల్ చేసుకుని నెమ్మదిగా ఆఫీసరుగారి గదితలుపుతోశాడు. శివశివా! ఈ మంజలతా దవికూడ యిక్కడేవుండాలి! అడుగులో నే కంపపాదా. అయినా అడుగుముందుకువేసిం



## యద్దనపూడి సులోచనారాణి

తర్వాత వెనక్కి తీసుకుంటే అనబోతే ధీగాలుకు తగదు. తిన్నగా నే లోపలకు నడిచాడు శేఖరం. సాయంత్రం పూట అప్పుడప్పుడు అటు వైపుగా షికారుకు వస్తూ, వచ్చినప్పుడు కాసేపు తండ్రి దగ్గర కూర్చుని పోవటం మంజులకి అలవాటు. ఆవిడ ఇక్కడనుంచి వెళ్ళిపోకూడదూ అనుకున్నాడు శేఖరం. ఆవిడ వుండగా చెప్పటానికి యేంభయం లేదు గాని, తను చెప్పిందివిని ఆయన మండిపడి మొహం వాచేట్లు తిట్టుంటే, ఆవిడ పక్కకు తిరిగి ముసిముసి నవ్వులు నవ్వుకుంటుందేమో! పోనీ వుండటమే మంచిదేమో! ఎంతయినా ఆడపిల్ల ముందు ఆయన తిట్టడా! కానీ చూద్దాం. చెప్పటానికి ఉపక్రమిస్తున్నట్లుగా శేఖరం గొంతు సవరించుకున్నాడు. ముఖ్యమైన కాగితాల్లో మునిగి తేలుతున్న హనుమంతరావుగారు కళ్ళు సగంమటుకే యెత్తి గుర్తు పట్టానన్నట్లు తలాడించి మళ్ళా తలవంచేసుకున్నారు. వచ్చినవాడు మెదలకుండా వూరుకోవటం చూచి,

"యేమిటోయ్!" అన్నారు.

ఉలిక్కిపడ్డ శేఖరం మరోసారి గట్టిగా గొంతు సవరించుకున్నాడు. వథవది! సమయానికే పచ్చివెలక్కాయ అన్నట్లు జీర పోవాలా గొంతుక!

"నిన్నే! "త్వరగా చెప్పు నాకు చాలా పనుంది అన్నట్లుంది ఆయన స్వరం.

"మరండీ! యేం లేదు. అహ—ఓ పది రోజులూ, సెలవు. పెళ్ళండీ! లేకపోతే అసలు అడగక పోదును—" ఎంతయినా అలా కన్నార్పకుండా చూసే అమ్మాయిల ముందు అందులో హనుమంతరావు గారి లాంటి వారితో మాట్లాడటం, చాలా కష్టం, అనుకున్నాడు శేఖర్.

'పెళ్ళా! యెప్పుడోయ్! మాటమాత్రం చెప్పలేదేం? యెప్పుడు?"

చూస్తున్న కాగితాలు వదిలేసి ఆశ్చర్యంగా తలెత్తారు హనుమంతరావు గారు. శేఖరానికి యేం జవాబు చెప్పాలో తోచలేదు.

"మరి శుభలేఖ లేవీ?" మళ్ళా పనిలోకి చూస్తూ అన్నారాయన.

'ఇదేమిటి, సెలవు పేరు వినగానే తిట్టిపోస్తారు అనుకుంటే, శుభలేఖలు అంటాడేంటి? అయినా తన స్నేహితులకే కళ్ళికి వీళ్ళకి శుభలేఖ లేమిటి మన్య!' అయోమయంగా చూస్తున్నాడు.

"ఊఁ! అయితే గుట్టుచప్పుడు కాకుండా చేసుకు వూరుకుందామనా? బలేవాడివి. ఇంతకీ పెళ్ళెప్పుడో చెప్పనేలేదు."

నీలుగుడ్లేసుకుని చూస్తున్న శేఖరం కొంచంగా తెప్పరిల్లి "పెళ్ళంటే. 14 వ తారీఖు" అన్నాడు.

"అయితే పది రోజులు సెలవు కావాలంటావు ఇన్స్పెక్షన్ రోజులు గదా! ఇప్పుడేం పెళ్ళోయ్! సెలవు యివ్వనంటాననుకో అప్పుడు నన్నందరూ ఎంత తిట్టారు? 'మాడు కర్కోటకుడు! పెళ్ళి చేసుకుంటున్నాను అంటే సెలవు యివ్వలేదు' అంటారు. అయినా యెంతని పెళ్ళి అయితే మాత్రం పదిరోజులెందుకూ"

"అదేమిటి సార్! పెళ్ళి..." నాది కాదని చెప్పబోతున్నాడు శేఖరం.

"అదేనయ్యా! పెళ్ళి నీదే! నాది కాదులే! కాని పదిరోజులెందుకూ అంటాను. ఆ వేళకు వెళ్తే సరిపోదూ! పెళ్ళికొడుక్కి యేమంత పనుంది! ఆ మూడుముళ్ళు వేయటమే గా! యేమంటావు. ఆఁ మర్చిపోయాను. ఇంతకీ కట్నం యెంత—గుంజా! ఆ రోజుల్లో కాసిని మంచినీళ్ళు యిలా అందుకోమ్మా!" ఆయన తీరే అంత! కాగితాలు చూస్తూనే మాట్లాడేస్తారు. గంటలు తరబడి మాట్లాడుతూనే లెఖ్ఖలు చెయ్యటం ఆయనకు అభ్యాసం.

"నిన్నే మాట్లాడవేం? యెన్ని వేలు?" త్రాగేసిన మంచినీళ్ళ గ్లాసు టేబిల్ మీద పెట్టూ అడిగారు.

"కట్నం యేం లేదండీ!" బుఱ్ఱగోక్కుంటూ జవాబుయిచ్చాడు శేఖరం.

"అదేం. లేకపోవటం యేమిటి? ఇంత చదువుకున్న వాడివి. ఇంతమంచి వుద్యోగం చేసుకుంటూ అన్నింటికీ మించి ఆడవాళ్ళు అలా నిలబడిపోయి చూసే అందంగలవాడివి."

అంతవరకూ రెప్పవేయకుండా శేఖరం మొహంలో చూస్తున్న మంజుల గబుక్కున చూపు మరల్చుకుని కిటికీవైపు తిరిగింది.

యేం లేదండీ! నాకయితే తీసుకోవాలనే వుంది కాని..."

"కాని..."

ఈమధ్య ఆబిల్ పాసయింది కదండీ!" సిగ్గుపడుతున్నట్లు చెప్పాడు శేఖరం. బిగ్గరగా నవ్వేశారు హనుమంతరావు గారు. వచ్చే నవ్వు పైటకొంగులో దాచేసుకుంది మంజులత.

"మరి ఆఫీసులో యింతవరకు యెవరికీ చెప్పలేదన్నమాట. చెప్పకపోతే యెలాగూ! నువ్వు పదిరోజులు సెలవు కావాలంటున్నావు మరి ఆపనంతా వాళ్ళందరికీ పంచి చేయించాలి. నామాటవిని శుభలేఖలు యివ్వక










# పెళ్లి ప్రయాణం

పోతే పోనిగాని వాళ్లింపరి మొహాన కాసిని కాఫీనీళ్లు పోయించి మరీ పెళ్లు. యేం, విని పిస్తోందా. దానికి లోభిస్తే నువ్వసలు పెళ్లి ప్రయాణమే మానుకోవాల్సి వస్తుంది.

శేఖరం హృదయం యెగిరి గంతేసింది. అనూంతం ఒక్కసారి హనుమంతరావుగారిని గట్టిగా కౌగలించేసుకుందామన్నంత ఆనందం కల్గింది. మర్నాడు సాయంత్రం తోటి వారంతా శేఖరం చుట్టూ యీగల్లా ముసిరారు.

"అదేమిటోయ్! మాట మాత్రం చెప్పలేగు." ఒకరు.

"పిలిస్తే పరుగెత్తుకొస్తామని భయపడ్డావేమో!" మరొకరు.

"యెంత పెట్టిగాడివి. నువ్వుపిలుస్తే మటుకు రమ్మనమని మాయెత్తుగనం పోస్తేమటుకు- మాకు సెలవు దొరుకుతుందా, మేంవస్తాంగా! ఈ ఆఫీసులో యీరోజుల్లో యిద్దరికే సెలవలు దొరికేది. ఒకటి పెళ్లిచేసుకోబోతున్న నీలాటివాడికి, రెండు పరమేశంలాగ యీ లోకంమీద విసిగి వైకుంఠయాత్ర కట్టిన వాళ్ళకి."

"అయినా-దాచుకుంటే యిదేమయినా దాగేది కనుకనా! రేపు భార్యను తెచ్చుకుంటే యిల్లుకోసం అయినా చెప్పవూ? పల్లలుపుడ్తే చెప్పవూ?"

అయితే మనగురవయ్య హోటల్ కి ఒక ఖాతా తగ్గిపోతోందన్న మాట."

"ఇంతకీ పెళ్లానెప్పుడు తెచ్చుకుంటావు బాబూ!"

ఇలాటి ప్రశ్నలతో వుక్కిరిబిక్కిరి అయిన శేఖరానికి సమాధానాలు చెప్పలేక నానాఅవస్థా అయింది.

ఎంతలేదన్నా టపారీ పేకమీద పాలికకి పెచిలుకే వదిలాయి శేఖరానికి. ఏం చెస్తాడు. ఆపదసమయంలో ఆపద్బాంధవుడిలా దొరికినమార్గం! కాంటే అసలు ప్రయాణమే మానుకోవాల్సి వస్తుంది. పోతే పోయింది వెధవడబ్బు. అవసరానికి కావాలని తీసుకుని యెంతమంది యెగ్గొట్టలేదు. అందులో యిదొకటి. ముగ్గురు నలుగురుమాత్రం పూర్తికేవస్తే బాగుండదని యేవో తోచిన బహుమానాలు పట్టుకొచ్చారు.

"అచ్చే! యిప్పుడెందుకూ అవన్నీ! యీరోజుల్లో పీటలమీద పెళ్ళిళ్ళు యెన్నో తప్పిపోతున్నాయి. మూడు ముళ్ళలో రెండుముళ్లుపడినా నమ్మకంలేదు. అతను భార్యాసమేతంగా వచ్చి గృహప్రవేశం అవుతాడుగా! అప్పుడుగాని" అన్నాడో మాటకారి, వుహ్మాచాలాబాగుంది అని మరోసారి పెట్టించుకుంటూ.

"పీటలమీద పెళ్ళిళ్ళు జరిగేదాకా నమ్మకంలేదన్న మహానుభావుడివి మరి పార్టీకి

రావటం మానెయ్యకపోయావ్! అప్పుడే పుచ్చుకున్నవాడివి గా! పైగా బాగుందంటూ అడిగి మరీ తింటున్నావే!" అన్నాడు ఎప్పుడూ మాటకొరి మాటల్ని ఖండించే అలవాటుగల వ్యతిరేక వాది.

"అయినా అతను శుభమా అని పెళ్ళి కెడ్తూ మనకు ఫలహారాలు పెడుతుంటే యేమిటా మాటలు!" ఎవరో కోపంగా అన్నారు

"ఫర్వాలేదండీ!" ఎలాగూ తన పెళ్ళి కాదు కాబట్టి సర్దేస్తున్నట్లు అన్నాడు శేఖరం.

ఒకటి రెండు రోజులు సెలవు దొరకటం బ్రహ్మాండం అనుకున్న శేఖరానికి అనుకోకుండా హనుమంతరావుగారి ధర్మమా అని పదిరోజులు దొరికింది నడుస్తుంటే కాళ్ళు సంతోషంతో తేలిపోతున్నాయి సూర్యం వుత్తరం అందినరాత్రే జవాబు వ్రాశాడు. అందులో, తనకి యిన్‌స్పెక్షన్ రోజులని, రెండు రోజులు ముందు వచ్చినా చెప్పుకోవాల్సిన సంగతేనని వ్రాశాడు. పాపం, సూర్యం తను వస్తున్నానని అనుకోడు. అనుకోకుండా తను ఎదుటపడేసరికి వాడెంత సంతోషిస్తాడో.

ఆ రాత్రికే బయలుదేరుతున్న శేఖరం వుల్లాసంగా యీలపాట పాడుకుంటూ బెడ్డింగ్ సర్దుకుంటున్నాడు. పిచ్చి ఖర్మ! నిజంగా తన పెళ్ళికే నమ్మేస్తున్నారు. అమాయకులు కాకపోతే నిజంగా తన పెళ్ళే అయితే తను శుభలేఖ లివ్వడూ! ఏమిట్లో అనుకున్నాడు గాని ఈ హనుమంతరావుగారు కూడా అమాయకుల్లాగానే వున్నారు. ఇంకొంత పిచ్చివాళ్ళు తన పెళ్ళికి బహుమానాలుగూడా తెచ్చారు. పోనీ అదీ ఒకందుకు మంచిదే! సూర్యానికి ప్రత్యేకం తను బహుమతులు కొనక్కర్లేదు. ఇవి చదివించేస్తే సరిపోతుంది. అందులో ఆ అగరొత్తులు గుచ్చుకునే వెండిపూలగుత్తి యెంతముద్దుగా వుంది. అది చూసి సూర్యంభార్య తప్పకుండా ముచ్చట పడుతుంది. సూర్యంకూడా సంతోషిస్తాడు. ఇంతకీ తిరిగివచ్చిన తర్వాత వీళ్ళందరికీ యేమని జవాబు చెప్పడం? ఆ! సింగినాదం! వాడెవడో ముందుగానే మార్గం చూపించాడు. పెళ్ళి తప్పిపోయిందని చెప్తే సరి! పాపం. ఆపేరికి వూరికే వచ్చిన వాళ్ళకి ఫర్వాలేదు గాని, బహుమానాలు తెచ్చినవాళ్లు మటుకు యేడుపు మొహాలు పెడ్తారేమో! ఏదయినా గాని మొత్తానికి యీ పెళ్ళి ప్రయాణం చాలా వింతగా, హుషారుగా వుంది. ఈసారి నిజంగా పెళ్ళయి సెలవకెళితే! అంతగా అయితే అప్పుడు అసలు సంగతి చెప్పెయ్యొచ్చు అయినా యిప్పుడు మనకోసం కాచుకూర్చున్న వధూమణి యెక్కడుంది గనుక! నవ్వుకుంటున్న శేఖరం రాజయ్య కంఠం విన్పించటంతో వులిక్కిపడి యీ లోకంలోకి వచ్చాడు.

"బాబూ! అయ్యగారు తమర్ని అర్జంటుగా ఒక్కసారి వచ్చి వెళ్లమంటున్నారు. మీరు గనక ఆలస్యంచేస్తే ఆరేవస్తారంట!" చెప్తూనే రాజయ్య వెళ్ళిపోయాడు. అయింది! అంతా అయిపోయింది! హనుమంతరావుగారు అసలు సంగతి తెలుసుకున్నారులా వుంది. ఇప్పుడేం చెయ్యటం. చల్లబడ్డ కాళ్ళతో శేఖరం బెడ్డింగ్ మీద చతికిలపడ్డాడు. తనకసలు బుద్ధిలేదు పొద్దున బండీ కెందుకుపోలేదు. వెధవబటలు... ఆ వూళ్ళో కొనకూడదూ! లేకపోతే వుత్త డబ్బు చదివిస్తేపోదు! యిప్పుడు మొదటికే మోసం వచ్చింది. ఆయనెంత మండిపడుతున్నాడో! మండిపడ్తే పడ్డాడు. తనసలు తిట్లు తినటానికి యెప్పట్నుంచో సిద్ధంగా వున్నాడుగా! ఇప్పుడు ఆ సెలవు కాస్త రద్దుచేస్తే! పొద్దున వెళ్ళిపోనందుకు తనని తను తిట్టుకుంటూ. బట్టలు వేసుకుని, తప్పనిసరిగా హనుమంతరావుగారి యింటికి బయలుదేరాడు. ఎన్ని చిందులు తొక్కుతున్నాడో! చేతిరుమాలతో చెమట తుడుచుకుంటూ హాల్లో అడుగుపెట్టాడు. హనుమంతరావుగారు సింహంలా గర్జిస్తూ, హాల్లో అటుయిటూ పచార్లు చేయటంలేదు, సరిగదా, మెత్తటి సోఫాలో కూర్చుని శేఖరాన్ని చూడగానే చూస్తున్న పేపరు పక్కన పెట్టి సాదరంగా చిరునవ్వుతో 'రావోయ్! రా! నువ్వీరాత్రి బండీకి వెళ్తున్నావుగదూ!' అన్నారు. హమ్మయ్య! ఒక్కసారి గుండెల నిండా గాలి పీల్చుకున్నాడు శేఖరం.

"ఇదుగో యెవరక్కడ? రాజయ్యా! శంభుని రెండు కప్పుల కాఫీ పంపించమని చెప్పు. ఆ! యేంలేదు నీ ప్రయాణం యీ రాత్రికేగదూ?" అడిగాడు.

"ఊఁ!" యేమిటి విశేషం అన్నట్లు చూశాడు శేఖరం.

"ఆ! యేంలేదు- అమ్మాయేమో బందరు వెళ్లాలని ప్రయాణం అవుతోంది. ఇవాళ బయలుదేరదామనుకుని సీట్లుగూడ రిజర్వు చేయించాను. నేను వెళ్లటానికి తీరుబడిలేదు. నువ్వు చూస్తూనే వున్నావుగా. కాగితాలు యింటికూడా తెచ్చి రాత్రి పన్నెండు దాకా కూర్చుని చూసినా అవటంలేదు. అమ్మాయేమో తప్పనిసరిగా వెళ్లాలని పట్టుపడ్తోంది."

కళ్ళజోడుతీసి పైవుత్తరీయంతో తుడుస్తు అన్నారాయన. అసలు సంగతేమిటో త్వరగా తేలితే బాగుండు ననుకుంటున్నాడు శేఖరం.

"ఇక్కడనుంచి త్రూగా ఒకే ట్రెయిన్ అయితే బాధ లేదు మధ్య బెజవాడలో మారాలి. మంజుకి ఆ లైన్ అసలు తెలియనే తెలియదు. మా వాళ్లంతా సాధారణంగా పెద్దవాడిని కాబట్టి నాదగ్గరకే వస్తుంటారు. నేనువెళ్లటం తక్కువ. అయినా మంజూ మాట అటుంచి, ముందు ఆ బెజవాడ ప్లాట్‌ఫారాలు చూస్తే నాకే భయం. ఏ దెక్కడో, ఏ లైనుమీదకి యే బండీ వస్తుందో, యేది యెటుపోతుందో అయోమయం. ఎవర్నయినా అడిగితే చెప్తారనుకో: అయినా ఆ మహాసముద్రంలో యెవరికియెవరు? అందులో రాత్రిపూట-ఇంతకీ చెప్పొచ్చేదేమంటే, అసలు అమ్మాయితోబాటు- రాజయ్యని గూడ పంపిద్దామని రెండుసీట్లు రిజర్వు చేశాను. రాజయ్య కూతురికేమో జ్వరంగా వుందట. ఏం బాగాలేదని తీరా బయలుదేర బోతుంటే యివాళ చెప్పాడు. అమ్మాయి ఫర్వాలేదు ఒక్కదాన్నీ వెళ్తానంటోంది. ఎంతయినా రాత్రిపూట ఆడపిల్ల ఒక్కదాన్ని, అందులో మొదటితరగతిలో నాకిష్టంలేదు...."

వింటున్న శేఖరం జేబురుమాలతో విసురుకుంటూ హాల్లోవున్న ఫొటోలవంక చూస్తున్నాడు. ఆడవాళ్లతో ప్రయాణం అతనికి అంతగా అలవాటు లేదు. రెండుసార్లు గాబోలు పెత్తండ్రి తన పెద్దకోడల్ని తీసుకు రమ్మంటే కాదనలేక వెళ్లాడు. అబ్బ! అప్పుడుపడ్డ అవస్థ అంతా యింతా గాదు- అవి- తెచ్చిన సామానులు సరిగావున్నాయో లేదో రైలుఆగిన ప్రతిచోటా లెక్క చూడ

## జాతకాలక్షేపం

రాముూ, సోమూ ఒక జోస్యుడి దగ్గర కెళ్ళారు. వాళ్లు కడుబీదలు. నిరుద్యోగంతో బాధ పడుతున్నారు. ఇద్దరి జాతకాలూ చూసి జోస్యుడిలా అన్నాడు.

"మీ యిద్దరిలో ఒకరికి వాహనయోగం, మరొకరికి మహారాజులనైనా నిలువమని చెప్పే మహాయోగం ఉంది. మీరు నిరుపేదలైకూడా ఈ మహాయోగాలు అనుభవిస్తారు.

అందుకు అనుగుణంగా కొద్ది కాలంలో రాముూకు కారుడ్రైవరు ఉద్యోగం, సోమూకు ట్రాఫిక్ పోలీసు ఉద్యోగం దొరికినయ్.

# ★ పెళ్లిప్రయాణం ★

ము నేది. అదేమయినా కాస్తా కూస్తా! ఇద్దరు కూలివాళ్ళు మోయగా, తను ఆ చేత్తో యీ చేత్తో మోయగలిగినవన్నీ, పట్టినవన్నీ పుచ్చుకోగా యింకా మిగిలేవి. పైగా మూడు రైళ్లు మారటం, బోలెడంత రద్దీ, మూడో తరగతి. వద్దురా బాబూ, భగవంతుడా! ఆ అవస్థ పగవాళ్ళకికూడా వద్దు. ప్రతి స్టేషన్లో సామాన్లు లెక్క పెట్టవలసిందే! అవును మరి దిగుతూ యెక్కుతూ యెవడన్నా ఒకటి చంకన పెట్టుకుపోయినా కనుక్కోలేం. ప్రతిసారి తను సామాన్లు లెక్క పెట్టుకోటంచూచి ఆ పెట్టెలో వాళ్లు ఒకటే నవ్వు. అయినా మంజు చదువుకున్న పిల్ల! రైళ్లలో యెలా కష్టంగా ప్రయాణం చేయాలో నేర్చుకోకుండా వుంటుందా!

యేమిటీ? అట్లా ఆలోచిస్తున్నావు. పైగా మరొకటి—నువ్వు వేరే టికెట్ కొనక్కర్లేదు. నీకు ఒక ఖర్చు కలిసివచ్చినట్లు అవుతుంది."

"అబ్బే! లేదండీ! నేను కొనుక్కుంటాను." ఇలాటి మొహమాటాలకి చాలా దూరంలో వుండాలని శేఖరం అనుభవంతో నేర్చుకున్నాడు.

"అబ్బ! నువ్వు కొనుక్కోలేవని గాదోయ్. ఎంత పెళ్ళికొడుకువైతే మాత్రం—ఖర్చుండదూ! మరొకటీ! నువ్వు అమ్మాయిని బందరు ట్రెయిన్ యెక్కిస్తే చాలు—అక్కడ స్టేషన్‌కి మావాళ్ళు వస్తారు. అదుగో! కాఫీ తెచ్చాడు తీసుకో!"

ఇష్టం లేకపోయినా మంజులతో తప్పనిసరిగా ప్రయాణం చేయవలసి వచ్చినందుకు విసుక్కుంటూ, ఉదయం వెళ్లిపోనందుకు తిన్ని తను తిట్టుకుంటూ శేఖరం కాఫీ కప్పు చేతిలోకి తీసుకున్నాడు.

*　　*　　*

"మెనీ థ్యాంక్స్!" అంది మంజు కృతజ్ఞతాపూర్వకంగా శేఖర్ కళ్లలోకి చూస్తూ. బెజవాడలో యిద్దరూ దిగారు. మంజులతని బందరు పోయే బండీ ఎక్కించాడు శేఖరం. ఎంతో విసుగ్గా, చిరాకుగా వుంటుందనుకున్న ప్రయాణం ఆనందంగా, మధురంగా యిట్టే గడిచిపోయిందనిపించింది.

"ఈ జనం, యీ గోల చూస్తుంటే నిజంగానే భయంవేస్తోంది" అంది మంజు స్టేషన్‌లో సందడి గమనిస్తూ.

పెద్ద పెద్ద కళ్లతో ప్రతివాళ్లవైపు నిస్సంకోచంగా చూసే మంజులత దూరం నుంచి చూస్తే అమాయకురాలిగా, ముద్దరాలిగా కన్పిస్తుంది, కాని యింత మాటకారి అనిపించదు అనుకున్నాడు శేఖరం.

"చక్కటివాడే గాదు, మంచివాడు గూడాను. ఎవరో ఆ కాబోయే అదృష్టవంతురాలు," అనుకుంది మంజు కిటికీలో నుంచి పరధ్యాసగా బైటకు చూస్తున్న శేఖరాన్ని గమనిస్తూ. తెల్లటిబట్టల్తో, మెడచుట్టూ నల్లటిమఫ్లర్‌తో చెదిరిపజుట్టుతో ప్రయాణపు బడలికవలన అలసినకళ్లతో వున్న శేఖరాన్ని రెప్పవేయకుండా చూడాలనిపిస్తోంది.

రైలు కదలటానికి సూచనగా గంట విన్పించింది. ఉలిక్కిపడ్డ శేఖరం కంపార్ట్‌మెంట్‌లోనుంచి గబగబా దిగబోతున్నాడు. ఇంతలో మంజు గబగబా పెట్టె తెరిచి పైనున్న ఒక వెండిపోష్ బాక్స్ తీసియిస్తూ "ఇదుగో, యిదితీసుకోండి. మీకిచ్చేందుకు నాదగ్గర యేంలేదు. ఇది మీ శ్రీమతికి. తప్పనిసరిగా యిటువెళ్లాల్సి వచ్చింది కాని, లేకపోతే పిలవకపోయినా వద్దున్నా. మీ పెళ్ళికి వచ్చేదాన్ని." తెల్లబోయి చూస్తున్న శేఖరం చేతిలో పోష్ బాక్స్ పెట్టేస్తూ "రైలు కదలబోతోం దల్లేవుంది. ఇక మీరు దిగండి," అంది. 'నా పెళ్లంటూ జరిగితే పిలవటంగాదు, బలవంతంగా వెంట పెట్టుకుని లాక్కుపోతాను' నాలిక చివరదాకా వచ్చినమాటని బలవంతాన మింగి కదులుతున్న రైల్లోనుంచి చేతిలో పోష్ బాక్సుతో దిగేశాడు.

"జీవితంలో జరిగే సంఘటనల్లో అతి జాగ్రత్తగా జ్ఞాపకం పెట్టుకోవలసిన వాటిలో యీ ప్రయాణం ఒకటి—" అనుకుంది మంజు దూరమైపోతున్న శేఖరాన్ని చూస్తూ.

ఇదేమిటి! హఠాత్తుగా అనుకోకుండా యిలాచేసిందే, మంజులత! ఎంతచక్కటి పేరు! ప్రతిరోజూ ఉదయం లేవగానే అంతచక్కటికళ్లు చూసుకునే అదృష్టం యెవరికో!"

వెళ్లిపోతున్న రైలులో దూరంగా అస్పష్టమైపోతున్న మంజునిచూసి నిట్టూర్పు విడిచాడు శేఖరం.

శేఖరం రావటానికి వీలవుతుందో కాదో, అసలు పెళ్ళినాటికైనా వస్తాడో రాడో అని దిగులుపడుతున్న మిత్రబృందం హఠాత్తుగా శేఖరం వచ్చేసరికి అమితానందం పొంది సంభ్రమాశ్చర్యాలతో చుట్టూ మూగారు.

"యేరా! వుత్తరంలో అట్లా అఘోరించావేం? అయితే అంతా నటనన్నమాట" యెముకలు విరిగేలా శేఖరాన్ని కౌగిలించుకున్నాడు సూర్యం.

"అందరూ వచ్చారు. నువ్వొక్కడివే లేవని దిగులెట్టుకుని మేం మూడురోజుల్నించి కాఫీఫలహారాలు మానేశామంటే నమ్ము." వేకముక్కలు కలుపుకుంటున్న చంద్రం లేచివస్తూ అన్నాడు.

"నిజంగానే నాకు యిన్‌స్పెక్షన్ రోజులు - మా ఆఫీసులో యెవరికీ చచ్చే తీరుబడిగూడా లేదంటే నమ్మండి. కాని నేనో ప్లాన్ వేసి, మోసంచేసి పారిపోయి వచ్చాను." ఠీవిగా అన్నాడు శేఖరం.

"యేమిటేమిటి?" అంతా చుట్టూ మూగారు. శేఖరం జరిగిందంతా చెప్పి 'కావాలంటే చూడండి' అంటూ పెట్లోంచి బహుమానాలు తీసిచూపాడు.

"యెలాగయినా మెరికలాంటివాడివి సుమా!" అన్నాడు భాస్కరం.

"రేపునిజంగా పెళ్లి అవాలి. అబ్బాయిగారి రోగం కుదురుతుంది." నవ్వుతూ అన్నాడు సూర్యం.

శేఖరం కథ విన్న బామ్మగారిబోటివాళ్లు ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు.

"సూర్యం పెళ్ళికొడుకోయ్, శేఖరం పెళ్ళి-" స్నేహితులు వేళాకోళం పట్టించారు

"జోరా! పిదపకాలం, పిదప బుద్ధులూనూ!" కొంతమంది ముక్కు మీద వేళ్ళుంచుకున్నారు.

"ప్చ్! కాలం బాగాలేదు. పిల్లలు మరీ

(44-పేజీ చూడండి)

## నిఘంటువు

ఒక పండితుణ్ణి ఒక సామాన్యుడు 'ఇంత మహత్తరమైన నిఘంటువును ఎలా కూర్చగలిగా"రని అడిగాడు.

"పెళ్లాం సాధింపులు తినే ప్రతివాడు, నిఘంటువు ఘంటాపథంగా వ్రాయగలడు. అందులో రానిమాటలేదు," అని ఆ పండితుడు చెప్పాడు.

*　　*　　*

ప్రయాణీకుడు గార్డుతో, "ఏమండీ ఈ రైలు టైం తప్ప నడుస్తోందా?"

గార్డు: "ముందనలు పట్టాలు తప్పి నడవకుండా వుంటే..."

తరువాయి)

గోతులు పడిన మట్టిఅరుగుమీదినుంచి ఎత్తుపల్లాల ఎగుడుదిగుడుల మెట్ల మీద కంగారుగా దాటుతున్న కమల జారి అరుగు తగిలబడి గభేలున క్రిందకిదొర్లిపోయింది. వీధి తలుపులు వేసుకుంటున్న ముసలిస్త్రీ యీ సంఘటన చూసి వీధిలోకి వచ్చింది. అరుగు నిమ్నోన్నతాంతో కొనలు తేలినరాళ్లు కమల ముఖాన్ని ఒంటినిరాసుకుని గాయాలు కలిగించాయి. కాలువేణికి నడ్డిమీద గట్టిదెబ్బ తగిలి మెట్లక్రింద చతికిలబడిపోయింది. గంపదొర్లి దూరంగాపడిపోయింది. వీధిలో నడిచే జనం ఆమెవైపు విడ్డూరంగా చూశారు. ముసలిస్త్రీ ఆనికరంతో మెట్లుదిగి కమలను లేవనెత్తింది. మెల్లిగా చెయిపట్టుకుని మెట్లుఎక్కించి గదిలోకి తీసుకు వెళ్ళింది. శరీరంమీది గాయాలు రక్తం స్రవిస్తున్నాయి కమలకు కళ్ళుతిరిగాయి. పగలంతా సరిగా భోజనంలేక నీరసిల్లి మళ్ళీ నేలమీద వాలిపోయింది. ముసలిస్త్రీ నీళ్ళు తెచ్చి గాయాలుకడిగి నూనెరాసి ఒకమంచం మీద కమలను పరుండబెట్టింది. కమల బాగా నీరసంగా మూల్గి నిద్రలో మునిగిపోయింది.

రాత్రి పదిగంటలకు ఒకసారి మెలకువ వచ్చింది కమలకు. ముసలి స్త్రీ మరొక యౌవన స్త్రీ ఎదురుగా కుర్చీల్లో కూర్చుని ఏవో మాట్లాడుకుంటున్నారు.

"ఎలావుంది అమ్మాయి!...కొంచెం లేచి కొంచెం భోంచేస్తావా?" ముసలి స్త్రీ కమల దగ్గరకు వచ్చి బుజంమీద నిమిరింది.

నులకమంచంమీద పరుపు నల్లగా మాసిపోయి వున్నా, దానిమీది తెల్ల గుప్పటి ఆ పరుపు పాతదనాన్ని కప్పిపుచ్చుతోంది. ఎదురుగా చిన్న గుండ్రని టేబిలుమీద ఏసుక్రీస్తు బొమ్మ, చిన్న బైబిలు పుస్తకము, టేబిలుమీద పూలు అల్లిన నల్లని సిల్కుగుడ్డ పెన్ను రెండు కాగితాలు కనిపించాయి. బహుశ అది క్రైస్తవకుటుంబ మనుకుంది కమల లోలోపల.

కమల లేచికూర్చుని నీరసంగా నవ్వింది.

యౌవనస్త్రీ కమల దగ్గరగావచ్చి జాలిగా చూస్తోంది.

'నీ పేరు' ముసలిది ప్రశ్నించింది యధాలాపంగా.

కమల ఒక్కసారి ఆలోచించింది ఏం చెప్పాలా అని మరుక్షణంలో వాళ్ళకి అనుమానం తగలకుండా చెప్పేసింది.

"మరియమ్మ?"

"క్రైస్తవులన్న మాట."

"ఊఁ" ముభావంగా ఆ స్త్రీలవైపు చూసింది. వారి ముఖభంగిమలు పరిశీలిస్తూ.

ముసలి స్త్రీ ఒకక్షణం ఆలోచించి ఏదో తెలుసు కొరవనట్లు నవ్వింది.




"ఏ వూరు యౌవనస్త్రీ అడిగింది.

'అదంతా ఒక కథ!' నిట్టూర్చింది కమల.

"ముందు భోంచేయి!" ముసలిస్త్రీ బలవంతంగా లేవదీసి క్రిందకు దింపింది కమలను.

మొదట మొహమాటపడినా, చివరకు ఒప్పుకుంది, కమల భోంచెయ్యడానికి. ఆమె చరిత్ర ఏమిటని ముసలి స్త్రీ పరిశోధన చేసింది. నిజం కప్పి సగం కల్పనచేసి, మదరాసులో పెత్తల్లి పెట్టే బాధలు భరించలేక స్వతంత్రజీవనం గడుపుకుందుకు యీ నగరం వచ్చేశానని నమ్మకం కలిగించేలా దీనంగా చెప్పింది కమల.

ముసలిస్త్రీ జాలి ప్రకటించింది.

'అమ్మా!...మరియమ్మను కూడా మన యింట్లోనే వుండనీయ్! ఏదో ఉద్యోగం చూసుకుని మనతోటే బ్రతుకుతుంది!" యౌవనస్త్రీ ముసలిస్త్రీవైపు తిరిగి కమల వైపు నవ్వుతూ చూసింది.

కమల కృతజ్ఞతాభావంతో తలదించుకుంది.

"మరియమ్మా!...నీ కిష్టమైతే నాకు అభ్యంతరం లేదు!" ముసలిస్త్రీ నవ్వింది.

రక్షణలేని యీ మహానగరంలో ఏదో గృహంలో కొంత ఆదరణ లభిస్తే భావి గురించి క్రమంగా ఆలోచించుకోవచ్చని తాత్కాలికంగా సంతోషించింది కమల.

"నా పేరు విజయ.. మా అమ్మపేరూ నీ పేరు ఒకటే!" యౌవనస్త్రీ సరదాగా నవ్వింది.

"మీ మేలు మరిచిపోలేను!" కమల నమ్రతగా చేతులు జోడించి వారిద్దరికి నమస్కారం చేసింది.

ఆ యింట్లో ఆ యిద్దరు స్త్రీలుతప్ప మరెవ్వరూ కనిపించలేదు. బహుశా ఆ కుటుంబంలో తాను కలిసిపోవడం కొంత లాభం కలిగించవచ్చు అని ఆశించింది కమల.

మరొక పట్టెమంచం వాల్చుకుని, తల్లీ కూతుళ్ళు యిద్దరూ ఏవో గుసగుసలాడుకుంటూ రాత్రి నిద్రపోయారు.

తెల్లవారగనే కమలకు మరొక క్రొత్త జీవితం ప్రారంభమయినట్లు తోచింది.

"నాగంప ఏదీ?" కమల విజయనడిగింది.

"నీ గంపకూడా మా సంసారంలో కలిసిపోయింది అంగులో బొగ్గులు పోశాను. నవ్వింది విజయ.

కమలకు తన పెట్టె చూపించింది విజయ. అందులో ఒక అరడజను సిల్కుచీరలు, జాకిట్లుమాత్రం ఉన్నాయి.

"ఈ బట్టలన్నీ ఎవరివి?" ప్రశ్నించింది విజయ.

"నీవి?"

'కాదు...మనిద్దరివీ!...నీకు కావాలసి వచ్చినపుడు ఈ గుడ్డలు తీసి తొడుక్కోవాలి అంతే.'

పసుపుపచ్చని ఒక సిల్కుచీరతీసి కమలకు చుట్టబెట్టింది విజయ. ఆ సిల్కుచీరలో కమల అందం ఇనుమడించింది.

"ఇంత అందమైన మనిషివి...నీ కీ పేరు బాగులేదు...మార్చేసుకో!" విజయ సాలోచనగా తన సన్నటిశరీరం ఏటవాలుగా గడకర్రలా నిగిడ్చి చటుక్కున ఏదో ఊహతట్టి చప్పట్లుకొట్టింది.

తన పెట్టెలో మూలగా మడిచిన కవరుతీసి అంగులోంచి ఒక కాగితం తీసింది విజయ.

"రాణి... హెచ్ యల్. సి. సర్టిఫికేటు" కమల ఆసక్తితో చూసింది ఆ కాగితంవైపు.

విజయ కమలను ఒయ్యారంగా నడిపించి కుర్చీలో కూర్చోపెట్టింది.

"సింహాసనంలో కూర్చున్న రాణీలా ఉన్నావు. ఈవేళనుంచి నీ పేరు మార్చేసి పత్రం నీకందిస్తున్నా!" రాజులా ఠీవిగా కుర్చీదగ్గరకువచ్చి చేతిలో సర్టిఫికెటు పెట్టి కమల చుబుకం ఎత్తింది విజయ.

"నా రాణి!" విజయ ప్రేమగా చూసింది కమలవైపు.

ఆహాస్యరస సన్నివేశంలో యిద్దరూ పకపక నవ్వుకున్నారు.

"అమ్మా!...మనయింట్లో రెండవ మరియమ్మ రాణిగామారిపోయింది!" పెద్దకేక

# ★ అన్వేషణ ★

పెట్టింది విజయ.

మరియమ్మ నవ్వుతూ వంటయింట్లోంచి వచ్చి జాలిగా చూసి, కన్నీరు తుడుచుకుంది కొంగుతో. కమల కొంచెం ఆశ్చర్యపోయింది.

"నాకొక చెల్లెలు ఉండేది...దాని పేరు రాణి—ఇంటరు చదువుతూ హఠాత్తుగా చనిపోయింది ఒక ఏడాది క్రితం" విజయ బాధగా తలవంచుకుని కుర్చీలో కూర్చుంది. వారిద్దరినీ పరామర్శచేసి, ఉపశమన వాక్యాలు పలికే బాధ్యత తనమీద ఉందని కమల గ్రహించింది. కమల విజయ ప్రక్కకువెళ్ళి భుజం మీద ఆప్యాయంగా చేయి వేసి నిమిరింది.

"నువ్వు యింట్లో ముసులుతూంటే మా రాణి ఉన్నట్లేఉంది!" మరియమ్మ గద్గద స్వరం ప్రకంపించింది.

"నేను మీ రాణిలాగే వీలైనంతవరకు మీకు ఆనందం కలిగించటానికి ప్రయత్నిస్తాను!" రాణి నిశ్చలంగా దైవప్రార్థన చేస్తున్నట్లు పలికింది.

మరియమ్మ ముఖం చేటంతఅయి, సంతోషంతో వెల్లివిరిసింది.

విజయ హుషారుగా ఎగిరి గంతేసింది.

విజయతో రాణికిసాన్నిహిత్యం పెరిగింది. రెండురోజులు ఇద్దరూ విచ్చలవిడిగా హుషారుగా నగరంలో తిరిగారు. విజయ ప్రభుత్వ ఆసుపత్రిలో నర్సుగా పని చేస్తోంది. తన స్నేహితులందరినీ విజయ పరిచయం చేసింది రాణికి. తెల్లగౌను తెల్లసాక్సు తొడుక్కుని తెల్లని వల్లెవాటులో ఆస్పత్రి రోగాల మంచాలవద్ద పచార్లు చేస్తూ మంగులు అందిస్తున్నారు. వాళ్ళంతా రాణి తన దూరపు బంధువని, నగరానికి క్రొత్తగా వచ్చిందని, ఏదైనా ఉద్యోగం అంతా కలిసి యిప్పించే బాధ్యత మనది అంటూ విజయ స్నేహితులందరికి నచ్చచెప్పింది. రాణి సౌందర్యం చూచి తమకు మరొక మంచి స్నేహితురాలు దొరికిందని నర్సులంతా అనుకున్నారు.

వెంకటరావు, రెడ్డి, చౌదరి, మూర్తి, శర్మ వచ్చి కాస్సేపు విజయతో మాట్లాడి వెళ్ళిపోతున్నారు. విజయ మాటల సందర్భంలో రాణిని పరిచయం చేసోంది. ఉద్యోగము చేస్తున్న విజయకు వివిధరకాల స్నేహితులుండడం అసమంజసమనిపించలేదు రాణికి.

ఒకరోజు సాయంత్రం విజయ ఏదో ముఖ్యమైన పని ఉందని ఒంటరిగా వెళ్ళిపోయింది నగరంలోకి. రాణికి ఏమీ తోచలేదు. వీధి అరుగుమీద వచ్చే వెళ్ళే జనాన్ని పరికిస్తూ మరియమ్మతో కబుర్లు చెబుతూ కూర్చుంది. పరిసరాలలోని గృహాలు పాతబడి శిథిలావస్థలో ఉన్నాయి. పెంకులు ఎగిరిపోయిన కప్పులు, పెళ్లలు ఊడిపోయి వెల్ల లేక నల్లబడిపోయిన గోడలు, సన్నటి దారులు, చిన్న కోమటి గుకాణం, ముసలుతున్న బీదరికపు ప్రజలు, ఆ వాతావరణమంతా మధ్యతరగతి జీవితానికి ప్రాకులాడుతున్న మనుష్యుల పేటలా కనిపించింది.

మరియమ్మ క్రీస్తు గొప్పతనం, మళ్ళీ ఆయన జన్మించి పాపుల హృదయాలు ప్రక్షాళనచేసి పవిత్రులను చెయ్యగలడనే విశ్వాసం గురించి, గంభీరంగా నొక్కి వక్కాణిస్తోంది.

వీధిలో ఒక రిక్షా ఆగింది. నల్లటి పంట్లాంలోకి చారల చొక్కా బిగించి, చెదిరిపోయిన క్రాపుతో ముప్ఫయ్యేళ్ల మనిషి ఇంట్లోకి వచ్చాడు. చేత్తో లెదర్ బేగ్ పట్టుకుని.

"రండి!...ఇదేనా రావడం గుంటూరు నుంచి!" మరియమ్మ లేచి మర్యాదగా లోపలికి తీసుకువెళ్ళింది ఆ ఆగంతకుని. రాణి విచిత్రంగా చూస్తూ వీధిలోనే నిలబడిపోయింది.

మరియమ్మ పిలిచింది రాణిని.

రాణికూడా యింట్లోకి వెళ్ళింది.

"ఈ అమ్మాయిని చూశారా?" మరియమ్మ రాణిని దగ్గరకు పిలిచి కౌగిట హత్తుకుంది.

"ఎవరీ అమ్మాయి? కోపంగా చూశాడు ఆయన. "రాణి!" ముసిముసిగా నవ్వింది మరియమ్మ.

"ఈయన విజయభర్త నరసింగంగారు" రాణికి పరిచయం చేసింది ఆ క్రొత్తమనిషిని.

"ఈ అమ్మాయి సంగతికేం...విజయ ఏదీ?"

విసుగ్గా కుర్చీలో మేనువాల్చి లెదర్ బేగ్ క్రింద గిరవాటేశాడు నరసింగం.

"స్నేహితురాలితో బయటికి వెళ్ళింది. ఇప్పుడే వస్తుంది!...మీరు యింకా ఒక వారం దాకా రారేమో అనుకున్నాం!" మరియమ్మ సాగదీసుకుంది.

"నువ్వు నీ కూతురు వేసే వేషాలు ఎవరికి అర్థంకావు?" అరిచాడు నరసింగం బూట్లు విప్పుకుంటూ. కోటుతీసి మంచంమీదకు గిరవాటేశాడు.

రాణికి యీ దృశ్యం వింతగొలిపింది. ఇంతవరకు తనకొక భర్త ఉన్నాడని విజయ చెప్పనేలేదు. మరియమ్మ కూడా మౌనం వహించడంలో యీ కుటుంబంలో ఏదో రహస్యాలు ఉన్నాయని అనుమానపడింది రాణి.

వరండాగది తలుపు తెరుచుకుని, వెనకనే మెట్లు ఎక్కి మేడమీదకు పోయాడు నరసింగం. వచ్చిన రెండురోజులనుంచి క్రింద ఉన్న వరండా గది, ప్రక్కనున్న వంటిల్లు, వంటిల్లుకవతల కుళాయిఉన్న దొడ్డి మాత్రమే రాణి చూసింది.

వెనకాల మేడగది కూడ ఒకటుందని తెలుసుకుని, ఇంతవరకు తనకు తెలియకుండా ఆ విషయం దాచడం గ్రహించి రాణి దిగ్భ్రాంతి పొందింది. అయినా తన ఆశ్చర్యం మరియమ్మకు తెలియనీయకుండా మౌనంగా అమాయకంగా నిశ్చలంగా మసల మొదలిడింది రాణి.

నరసింగం మేడమీదకు వెళ్ళి దుస్తులు విడిచి ఒకలుంగి బనీను తొడుక్కుని క్రిందకు వచ్చేడు. మరియమ్మ హస్త ప్రక్షాళనకు నీళ్ళు యిచ్చింది. మౌనంగా వంటయింట్లో ప్రవేశించి భోంచేసి మళ్ళీ మేడమీదకు వెళ్లిపోయాడు నరసింగం.

"ఉత్తకోపిష్టి!" నరసింగం వెళ్ళిపోయాక మరియమ్మ పెదవి విరుచుకుంది అతనివైపు.

"మేడమీదిగది కూడా మనదేనా?" అడిగింది రాణి అమాయకంగా.

"ఆగదిలో ఆయన ఒక్కరే ఉంటారు. మేమెవ్వరంపోము. ఉత్తకోపిష్టి" నవ్వేసింది మరియమ్మ.

భోజనం పూర్తిచేసి రాణి యథాప్రకారం నులకమంచంమీద ఒరిగి, కథల పత్రిక ఒకటి చదవడం మొదలుపెట్టింది. రసవత్తరమైన కథలపఠనంతో గంటలు గబగబ నడిచాయి. పాశ్చాత్య నాగరిక ప్రభావంతో, కృత్రిమ భావాలతో, యుక్తాయుక్త విచక్షణాజ్ఞానం నశింపజేసుకుని, అహంభావగర్వాలతో, ప్రవర్తిస్తున్న ఆధునిక యువతీయువకుల జీవిత చిత్రణాలు కథల్లో ప్రతిబింబించాయి. కథలు చదివి ఆవలించి గడియారం చూసింది రాణి. పన్నెండుగంట లయింది. విజయ యింకా రాలేదేమని విస్తుపోయింది.

ఒక వుపన్యాసకుడు ఒకానొక సభలో మాట్లాడుతూ "స్వార్థపరులైన రాజకీయ వేత్తలందరిని పట్టుకుని ఏదో ఒక ద్వీపంలో పెట్టి బంధించాలి" అని, ఇంతలో విచారంగా ఇలా అన్నాడు;

"ఖర్మ. వీళ్లు లేని దెక్కడ! పైగా చంద్రగోళం చేరాలని చూస్తుంటే!"

ఇంతలో తలుపు చప్పుడయింది. మరియమ్మ కూతురుగురించి ఏం భయం, బెంగ, బెంగలేనట్టు గుర్రుపెట్టి నిద్రపోతోంది. విజయగొంతు వినిపించింది తేలిపోయిన స్వరంలో.

రాణి తలుపుతీసింది. మేలిముసుగు వేసుకుని చేతిలోని వేనిటీబేగ్ ఊపుకుంటూ, తూలుతూ గుమ్మంలో అడుగుపెట్టింది విజయ. ఇంట్లోకి రాగానే మేలిముసుగు తొలగిపోయింది. శిరోజాలు చెదిరి ఉన్నాయి. చీర నలిగిపోయింది. నిమీలిత నేత్రాలతో తూలుతూ వచ్చి కుర్చీలో కూర్చుంది.

"ఎవరు?...రాణి!" పకపక నవ్వింది విజయ. ఆమాట తీరుచూసి ఆమె త్రాగి వచ్చిందని నిర్ణయించుకుంది రాణి.

"అమ్మ... ఏది?...నిద్రపోతోందీ... అమ్మ...బొమ్మ! నిజంగా నాకు దొరికిన ఒక బొమ్మ...కన్నెదుపైతే యిలా దిమ్మచెక్కలా నిద్రపోతుందీ...రాణీ...భోజనం పెట్టు...మజ్జిగ ఉందా?..."

విజయ తూలుతూ రెండుసార్లు ఎక్కిళ్ళతో వెకిలిగా నవ్వింది.

రాణి విజయను పట్టుకుని వంటింట్లోకి నడిపించింది. "బ్రతుకు... ఏంచేస్తా... సంపాదించాలి... యీ ముసలిపీనుగకోసం! ...నల్లమందుకే చాలదు నా డబ్బు!" నీల్గింది విజయ నవుస్తూ.

మరియమ్మ ముసుగులోంచి గురక వినిపిస్తోంది విజయ పిలిచింది మెల్లిగా... "అమ్మా" అని ప్రశాంతంగా...

మరియమ్మ లేవలేదు.

విజయ బిగ్గరగా అరిచింది పెంకులు ఎగిరిపోయేటట్టు కోపంగా.

మరియమ్మలో చలనం కలగలేదు.

"లేస్తావా!...లేవవా?" మంచాన్ని తన్నింది విజయ బిగ్గరగా స్పృహతప్పి అరుస్తూ.

మరియమ్మ లేచి కూర్చుంది కంగారుగా ఆ తాపుతో.

మేడమెట్లుదిగి గదిగుమ్మంలో నిలుచున్నాడు నరిసింగం. కళ్ళు నిప్పుల్లా ఎర్రబడ్డాయి. కోపంతో ముఖం చిట్లించాడు.

"ఏయ్...విజయా...!" అతని అరుపు ప్రతిధ్వనించింది.

లేడిలా విజయమీదకు ఉరికాడు. జడ పుచ్చుకునిలాగి దవడమీద విరామంలేకుండా నిర్దయగా శక్తికొలది కొట్టాడు. త్రాగి శక్తిలేక తూలుతున్న విజయ ఆదెబ్బలతో శోష వచ్చి నేలమీద కూలిపోయింది.

మరియమ్మ తల లబలబ బాదుకుంది.

"ఎందుకురా నాకూతుర్ని యిలా చంపేస్తావు! నీపీడ విరగడైపోయినా బాగుండేది!" కూనిరాగాలుతీసి ఏడ్చింది మరియమ్మ

"నీకూతురు!...... హేళనగా పకపక నవ్వాడు. నరిసింగం మరుక్షణంలో పళ్ళు పటపట కొరికాడు.

"మీ యిద్దరికీ త్వరలో తగినశాస్తి చేస్తా! ఇల్లంతా కొల్లగొట్టేక... విశ్వాసం కూడా లేకుండా విచ్చలవిడిగా సంచరించే దాన్ని ఏంచేస్తే బాగుంటుంది?... కసాయివాడిలా కత్తితో పనసపొట్టులా ముక్కలు ముక్కలు చేస్తే! నరిసింగం గర్జించాడు.

"చంపుమాద్దాం!" మరియమ్మ దెయ్యంలా జుట్టుపీక్కుని నరసింగం మీదకువెళ్ళి చేతులు త్రిప్పుకుంటూ గయ్యాళిలా అరిగింది.

"ఒహో!... ముసలి పీనుగ రక్షిస్తుంది కాబోలు!"

వ్యంగ్యంగా క్రూరంగా రౌడీలా నవ్వాడు నరసింగం.

అతని మాటలు వినిపించుకోకుండా మరియమ్మ విజయను నేలమీదనుంచి బలవంతంగా లేవదీసి పరుపుమంచంమీద పడుకోబెట్టింది. చన్నీళ్ళు తెచ్చి ముఖంమీద చల్లింది. విజయ మూల్గింది.

రాణి ఈ దృశ్యమంతా చూస్తూ చకితురాలై మౌనంగా, భయంతో, మరియమ్మ దగ్గరకుపోయి కూర్చుంది.

"ఏమిటీ గొడవ?" మెల్లిగా నసిగింది రాణి మరియమ్మ చెవిలో.

"రాక్షసుడమ్మా... పెళ్ళిచేసుకున్నప్పటి నుంచీ ఇంతే!...అందుకే మనిషి పాడయిపోయింది!" మరియమ్మ తెల్ల కనుబొమలు గిలకనూతి చేంతాడులా అల్లుకున్నాయి. ఆమె కళ్ళలో ఏవో అగాధాలు ఉన్నట్లు స్ఫురించాయి రాణికి."

### నేను సైతం

"ఒరే గోపీ, ఓ సిగరెట్టు ఇలా యివ్వు", అన్నాడు రాము.

"ఏరా లేనిపోని అలవాటు చేసుకుంటావా? మేం ఆహుతి అవుతున్నాం చాలు," అన్నాడు గోపి.

'కాదురా. ఆ మహాకవి లాగానే నేను సైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను. అని చెప్పుకోనైనా చెప్పుకోవాలి కదా' అని. మరి నన్నూ ఒక సమిధ ఆహుతి యివ్వని' అంటూ రాము సిగరెట్టు' తగలేశాడు.

కాస్సేపు మూల్గి, నీరసంగాలేచి, కాస్త మజ్జిగ అన్నంతిని, తూలుతూ, విలాసంగా నవ్వుతూ, నిర్లక్ష్యంగా, నిశ్చింతగా మంచం మీద ఒరిగింది విజయ.

వంటింట్లో పిల్లులు కుమ్ముకుని గిన్నెలు పడగొట్టాయి. గోడమీది బల్లి విద్యుద్దీపం చుట్టూ ఎగిరేపురుగులను పట్టుకుని భక్షిస్తోంది. కిటికీలోంచి కనిపించే రాత్రి చీకటితో దట్టమయి భయంకరంగా ఉంది.

తన జీవితంలో ప్రతిదినం ఒక పరీక్ష అయిపోయిందనుకుని, నిట్టూర్చింది రాణి. మరియమ్మ విద్యుద్దీపం ఆర్పింది.

ఆ చీకటిలో మనుష్యుల నిశ్వాసాల రొదలు కాస్సేపు వినిపించాయి. ఆవేశించిన సుషుప్తిలో, అలుముకున్న చీకటిలో ప్రపంచమే మరిచిపోయింది రాణి.

మర్నాడు నరసింగం మధ్యాహ్నం తన లెదర్ బేగ్ తీసుకుని విజయవాడ వెడుతున్నానని రెండు దినాలదాకా రానని మరియమ్మతో చెప్పి వెళ్ళిపోయేడు. వెళ్ళేముందు విజయవైపు చూశాడు. గతరాత్రి సన్నివేశానికి కుపితయై విజయ నరసింగంతో మాట్లాడలేదు "వెఱ్ఱిదానా! ఇటువంటి పోట్లాటలు మనకు మామూలే కదూ!" నవ్వుతూ వెళ్ళిపోయాడు నరసింగం.

అతను ఇల్లువిడిచి వెళ్ళిపోయాక, మరియమ్మ విజయ వంటింట్లో కూర్చుని ఏవో గుసగుసలాడుకున్నారు అరగంటసేపు. మౌనాన్ని భేదించి, భేదాన్ని త్యజించి, విజయ యథాప్రకారం రాణితో కబుర్లు చెప్పింది. సాయంత్రం ఆరుగంటలు కాగానే తనకేవో పనిఉందని విజయ అందంగా అలంకరించుకుని వీధిలోకి వెళ్ళిపోయింది.

రాణి తనకార్యక్రమం నిర్ణయించుకోవలసిన ఆవశ్యకత ఏర్పడినట్లు గుర్తించింది. ఇంట్లో ఎవరిమటుకు వారు తమ కార్యాలలో నిమగ్నులైనప్పుడు తానుకూడ ఒక నిర్ణీతపద్ధతిని జీవితయాత్ర గడపడం ముఖ్యమనిపించింది. మరియమ్మ కుటుంబంలో ఏవో దాగని రహస్యాలున్నాయని అవి ఎప్పటికో బట్టబయలైతే మళ్ళీ తన జీవితం విపన్నంగా నడిసముద్రంలోని నావలా ఊగులాడుతుందో అని భయం పొందింది. అటువంటి పరిస్థితులు ఏర్పడకముందే ఇంట్లో దొరికిన స్కూలుఫైనలు సర్టిఫికేటుతో త్వరలో ఉద్యోగం సంపాదించుకోవాలని నిర్ణయించుకుంది రాణి.

సాయంత్రం విజయ వెళ్ళిపోయాక, రెడ్డి రావు వచ్చారు. విజయ లేకపోవడంవల్ల రాణివాళ్ళతో మాట్లాడక తప్పలేదు. సంభాషణల మధ్యలో తానొక ఉద్యోగం చూసుకుందామనే ప్రయత్నంలో, ఉన్నానని

(55-వ పేజీ చూడండి)








**ఆధునిక భారతీయ చలనచిత్ర సంగీతచరిత్రలో దాదాపు ప్రతిఅధ్యాయానికీ మొదటివాక్యంలో ఉండతగ్గపేరు నౌషద్ అనడం అతిశయోక్తి కాదు.**

నౌషద్ చేసినపాట, అచ్చు నౌషద్ చేసినపాటలాగే నిండుగా ఠీవిగా, లోతుగా ఉంటుంది. అందులో మధుర శిల్పాల నైపుణ్యం, నైగనిగ్యం ఉంటాయి. మహాకవివాక్యంలా అర్థపుష్టి ఉంటుంది. ప్రబంధనాయిక అంగసౌష్ఠవం ఉంటుంది. త్రికాలాలలో త్రిలోకాలలో విహరించివచ్చే ఖాన్ సాహెబ్ కంఠస్వరవిన్యాసాల ఠీవి, సొగసు, అంతా స్పృశించగల స్వరదిగంతాల దూరం, సైగల్ పాట మార్దవం నౌషద్ సంగీత రచనాశిల్పంలో స్ఫురిస్తాయి.

## నౌషద్

గాయకుల పరిభాష ప్రకారం ప్లానింగ్ కమిషన్ వారికి పదింతలైనా "ప్లానింగ్" ఉంటుంది.

ఈనాటి సంగీత రచనా రీతులలో, స్వర కల్పనా శిల్పంలో, వాద్య సమ్మేళనంలో, ప్రయోగంలో నౌషద్ చేసిన వాటిలో ఏదో ఒకటి ఎక్కడో అక్కడ కనబడితే కనబడవచ్చుగాని, ఆయన చేయనిది కనబడదు. ఒక చిత్రంలో అన్నిపాటలూ జనరంజకాలు కావటం ఆయనతోనే ఆరంభమైంది, ఫ్లూటూ క్లారినెట్ కలిపీ, సితార్ మాండలిన్‌లు కలిపీ అందమైన బహుశ్రీ సమూహాలు సృష్టించినది ఆయనే. అకార్డియన్, బీన్ మొదలైన పాశ్చాత్య వాద్యాలను సినిమాలో ప్రవేశపెటిన వాడాయనే. సింఫనీ సంగీతాన్ని భారతీయ సంగీత భాషలోకి గొప్పగా, అంగరికి అర్థమైపోయి గోలిపేటంత నిండుగా అనువదించిన వాడు ఆయనే. ఎప్పుడూ మార్పులుచేసే వాడు ఆయనే, శాస్త్రీయ రాగాలను కల్తీలేకుండా శుద్ధ స్వరాలలోనే సులభ శైలిలో వరసలుకట్టి మధుర స్వర సరోవరం నిర్మించినవాడు ఆయనే. అందులో ఇంగ్లీషు కెరటాలు లేపిన వాడూ ఆయనే ఇన్ని పనులుచేసిన నౌషద్ సీను బాణీలను అనుసరించడంలో కూడా వెనకబడలేదు. అయితే ఈ విద్యలో రామచంద్రాలు నయ్యర్‌లు మొదలైన వారితో పోటీచేసి ప్రథమ బహుమతిని అందుకో లేదు.

(తరువాయి 37 పేజీ



### కేయీ మోసం

'మీ అండ్ ది కర్నల్' చిత్రంలో 'మీ' వేషంవేసిన డానీకేయీకి మీసం కావలసివచ్చింది. అతికిన మీసం కృత్రిమంగా ఉంటుందని కేయీ తనే మీసంపెంచాడు. కాని అదే అతికిన మీసంలా అసహజంగా కనిపించిందిట. చివరకి అంటించిన మీసమే పెంచినదాన్ని మించి నటించింది కేయీ పెదిమలమీద

ఘనీభవించిన సౌందర్యం అనిపించుకున పథేర్ పాంచాలి, అపరాజిత చిత్ర స్రష్ట చలనచిత్ర విశ్వకవీంద్రుడు సత్యజిత్ రాయ్, ఇపుడు రవీంద్రుడి కథ నొకదాని చలనచిత్రంగా అనువదిస్తున్నాడు. చిత్ర పేరు "రాణూరి కథామాల". తన అభిమా గ్రంథంలో నాయికను జీవితంలో అప హరించబోయిన ఒక చిన్నదాని కథ, వస్తు రచన పూర్తికాందే షూటింగ్ ఆరంభిం కూడదనే 'చాదస్తు'లలో ఒకడైన దర్శ నిర్మాతరాయ్, స్క్రిప్టు రచనకైతే పూర్తిలో ఉండి, రెండు వారాలలో ... ముగించాడు. నిర్మాణం అక్టోబరులో ఆర భిస్తారట.

### అమెరికాలో 'అపరాజిత

రాయ్ తొలి చిత్రం 'పథేర్ పాంచా జూలై 2 వరకూ న్యూయార్కులోని ఫి ఎవెన్యూ సినిమాలో ఆడి, అ రో జు (అక్టోబరు అక్కడ ఏ విదేశీ చిత్ర

# అతిశయోక్తులు

దిలీప్ కుమార్ ఒక చిత్రానికి పన్నెండు లక్షల (రూపాయలే) పుచ్చుకుంటున్నాడు.

రాజ్ కపూర్ రేటు ఎనిమిది లక్షలు.

దేవానంద్ కు ఆరు పలుకుతోంది.

పాపం జోకర్ జోనీవాకర్ కు నాలుగే లక్షలిస్తున్నారు. హీరోయిను లందరు రెండు మూడు లక్షల దగ్గిరే ఉన్నారు.

ఈ రుసుములు క్రీ. శ. 1984 లోనో, 2078 లోనో కావుట. సాక్షాత్తూ ఈ రోజు రుసుములేనన, రేపు పెరుగవనడానికి సదుపాయం లేదనీ ఒక ఉత్తరాది పత్రిక ఈ మధ్య ప్రకటించింది. ఈ అంకెలు భయంకరంగా ఉన్నమాట నిజమే అయినా అవి నిజమన్నమాట నిజమని రూఢిగా తెలిసినట్లు ఆ పత్రిక వ్రాస్తోంది.

వీటిని చాలవరకు 'ఎడిట్' చేయవచ్చుననడానికి సందేహంలేదు. ఎంతచేసినా వడబోసిన నిజాలుకూడా ఇంత భయకరంగానూ ఉంటాయనడానికి సందేహంలేదు. దీనికి ఎవరు బాధ్యులు అని వాళ్ళ పట్టుకుని వాళ్ళని కోప్పడబోవడం, ఈ వ్యవస్థ స్వరూప స్వభావాలనుబట్టి అర్థంలేని పని. లక్షలతో వ్యాపారం పోటాపోటీగా జరిగేచోట ఇవి పరిపాటే. అయితే, ఇందుకు కారణాలు ఆలోచించుకొని వాటికి దోహదం చేసే పరిస్థితులను నివారించడానికి నిర్మాతలంతా సమష్టిగా ఒక నిర్ణయానికి రావడం అవసరం.



"సెబాష్ పిల్లా" చిత్రంలో శివాజిగణేశన్, కుసుమకుమారి.

హాలివుడ్ లోకూడా ఇదే సమస్య చర్చకు వచ్చినప్పుడు (అక్కడ లక్షల రుసుముతో పాటు, లాభాలలో వాటాలుకూడా పెద్ద తారలకు). దర్శక నిర్మాత ఆటో ప్రిమింజర్ అన్నమాట: "కావాలని చేతులారా మనం ఇస్తున్నాం. ఫలానా వాడికి పదిలక్షలిస్తే పాతికలక్షలు వస్తాయన్న ఆశకొద్దీ ఇస్తున్నాం. అలా వస్తున్నమాట నిజమే. కాబట్టి పుచ్చుకుంటున్న వాళ్లని తిట్టడం అర్థంలేనిపని. ఇష్టం కాకపోతే ఇవ్వడం మానేస్తే సరి."

ఇంతకీ ఇది నటుల నిర్మాతల సమస్య.

కాని దీనివల్ల, తెలుగు పరిశ్రమలో ఒక చిన్న ఇబ్బంది రాబోతోందని కొందరు బాధపడుతున్నారు. ఇపుడున్న పెద్ద నటీనటులంతా తమిళ పరిశ్రమ వేపు మొగ్గు చూపుతున్నారు. తమిళచిత్రాల మార్కెట్ తెలుగు మార్కెట్ కన్న నాలుగురెట్లెక్కువ (బహుశా) అందువల్ల అందులో తారలకు తెలుగునిర్మాత లిచ్చేదానికన్న రెట్టింపు ఇస్తున్నారు. ఇపుడు తెలుగు తారలు కొందరికి తమిళనాడులో మంచి పేరు ఉంది. తెలుగుచిత్రానికి 30 రోజులు పనిచేస్తే వచ్చేది ఒకరూపాయ అయితే, ఆ 80 రోజులపనికీ తమిళచిత్రంవల్ల రెండు రూపాయలు వస్తోందట. అందువల్ల వీరంతా రెండు రూపాయలూ ఇచ్చి తెలుగు తమిళ చిత్రాలు రెండూ తీయాలనీ, లేదా తెలుగులోనే అయేపక్షంలో రేటు పెంచడమో మానుకోవడమో చేయాలనీ అభిప్రాయపడుతున్నారట.

ఈ లెక్కన, నిర్మాతలు అట్టే ధైర్య సాహసాలు ఔదార్యం చూప నవసరం లేకుండానే, 1962 నాటికి తెలుగులో కొత్తతారలబృందం తయారయి వాళ్ల కాల్ షీట్ లకి ఇబ్బంది పెడుతున్నారని విసుక్కోవడం పరిపాటి అయేలా ఉందని ఒకనిర్మాత ఛలోక్తి విసిరారు.

* * *

"భట్జీ! ఇహ నక్కడ మాళాగో లేదో గాని ఇదిగో ఈ వేలు చివర్నుంచి ఈ గణుపుదాకా ఒహ డాక్టరుంటాడా. అంతే ఆ గణుపవతల కొంప మునిగిపోతున్నా మరి వాడి కప్పా తెలీదుమ. అక్కణ్ణించి ఇలా కామరోహ డాక్టరు దన్నమాట. అక్కణ్ణించి మణికట్టుదాకా మరోహడూ" అన్నారు చెన్నపట్నం జనరల్ హాస్పిటల్ చూసి వచ్చిన ఒక పెద్దాయన నాటేవాళ్ళకి విశేషాలు చెబుతూ.

ఇది అతిశయోక్తిఅయితే కావచ్చునని



రాజ్యంపిక్చర్సువారి 'కృష్ణలీలలు' చిత్రంలో శ్రీమతి కృష్ణరాజ్యం, బేబీ ఉమ

సినిమాలలో కొన్ని కొన్ని పనులు ఈ పద్ధతిలో జరుగుతాయని అనా రెండేసి శాఖలలో—కొండొకచో ఒక శాఖలోనే ఇద్దరు చేసిన పనులు కలవటం లేదనీ అనుకోవడం పెద్ద సైజు అతిశయోక్తి కాదు. వీటిలో, తరచి చూడకుండా వాటంతట అవి ఎబ్బెట్టుగా కనబడేవాటిలో మేకప్ ఒకటి. మనకి ఉన్న మేకప్ ఆర్టిస్టులు ఎవరికీ తీసిపోతారని కాదు. గాని, ఇందాక భట్టీగారి కథలో డాక్టర్లలా వ్యవహారం జరుగుతూందనిపిస్తుంది. చిన్న మేకప్ ఆర్టిస్టులు పెద్ద ఆర్టిస్టులకే రంగులు వేస్తారట. అదైనా సాధారణంగా ముఖానికే. కాస్ట్యూము ఆర్టు డైరెక్టరూ, డైరెక్టరూ, ప్రొడ్యూసరూ చూసుకునే పని. అంచేత ఒక హీరో ముఖానికి చెవులకూ, గడ్డానికీ చక్కగా నే మేక్స్ ఫాక్టర్ కోటాలు పూయిస్తారు. ఆ పూత కంఠందగ్గిర ఆగిపోతుంది. డ్రెస్సు డిజైన్ చేసేవారు, హీరో చొక్కాకి బొత్తాములు లేకుండా ఉంటే అప్పీలు ఎక్కువని నిర్ణయిస్తారు. చివరకి, తెరమీద హీరోకి కంఠం దాకా తెల్లగా పిండి కొట్టినట్టు రంగు కంఠందగ్గిర్నుంచి ఇంకో ధాయూను ఇది చూడ్డానికి ఎబ్బెట్టుగా కనిపించి, గిట్టని వాళ్ళచేత 'పగటి వేషం' అనిపిస్తాయి. దీనికి మేకప్ ఆర్టిస్టుని మాత్రం విమర్శించటం న్యాయం కాదు.

అలాగే విగ్గు ఏర్పాటు. ఇక హెయిర్ స్టయిల్ కూర్పు అనేది దాదాపు అసంభవం కాబోలు అనిపిస్తుంది. ప్రస్తుతం చిన్న నటులంతా (తెలుగు తమిళం హిందీ కూడా) మేకప్‌కి ఒక్కొక్కరు ఒక్కొక్కర్ని ఎన్నుకుంటున్నారట. ఇప్పుడిది ఫాషన్. అంగువల్ల ఒక చిత్రంలో హీరో, హీరోయిను, విలను, వాంపు, హాస్య నటుడూ ఉంటే వాళ్లు ఐదుగురూ ఐదుగురు మేకప్ ఆర్టిస్టులను ఎన్నుకునే ప్రమాదం (కనీసం ముగ్గుర్ని) ఏర్పడుతుంది. అందువల్ల నిర్మాతకి మూడువేల రూపాయలతో అయ్యే పని పన్నెండువేల రూపాయల ఖర్చును వెనకేసుకొస్తోంది. వెనకడబ్బు పోతే పోయింది. ప్రొడ్యూసరుదిగదా అని సర్దుకోవచ్చు మనకి కళ ముఖ్యం కాబట్టి. అయితే మనం కళనుకూడా మరీ కృష్ణదేవరాయల మల్లే గౌరవాభిమానాలతో గురి తప్పక రోజుకు మూడుకాల్ షీట్లా ఆరాధిస్తున్నట్టు దాఖలాలు ఆట్టే లేవు. ఆ వైనాలు పట్టుకుని చెప్పుకుందికి కూడా ఆమోఘంగా ఉండవని ఈ విషయాలమీద బాగా మాట్లాడిన ఒక నిర్మాత అంటున్నారు. ముష్టివాడి వేషం వేసినా గాబర్డీను తప్ప వ రకం లాగు పనికిరాదని, దానికి కాటన్‌తో మాసికలు వెయ్యాలనీ, అప్పలమ్మ వేషానికి నైలాన్ కారీ తప్ప మరొకటి నప్పదనీ హెయిర్ స్టయిల్ జోసెఫైనే చేసి తీరాలనీ, కార్మికుడు, (వేషం వేసింది హీరో కాబట్టి) లేటెస్ట్ ఫాషన్‌లో సొట్ట చెదరని ఫెల్ట్ హాట్ పెట్టుకోవడమే సహజమనీ, వాడించే నటులు మేకప్‌కు ఫలానావారే ఉండాలని పట్టుపట్టడం తగదని ఆ నిర్మాత అన్నాడు.

దక్షిణభారత నటీ నటసంఘంవారు రెండు మూడు వారాలలో ఒక ఫ్రెంచి మేకప్ నిపుణుడిని ఆహ్వానించి ఉపన్యాసాలు ఇవ్వగోరుతున్నారన్న వార్త వల్ల నిర్మాతల వర్గాలలో ఇంతటి గర్భ వచ్చింది. అది విన్న తరవాతనించీ, ఫ్రాంసునించి మేకప్‌వాళ్ళని తెమ్మంటారేమోనని వీరంతా ఉటీలో కోటు తొడుక్కొని వాళ్లలా గజ గజ వణికిపోతున్నారు. ★

# 'మీ అండ్ ది కర్నల్'

స్త్రీ రుచేనా సముద్రం లో చావుబతుకుల పరి గంగాస్నానాలాడే సన్నివేశానికి ఆహ్లాదకరమైన రూపచిత్రం 'మీ అండ్ ది కర్నల్' గత వారం మద్రాసు ఓడియన్ సినిమాలో విడుదల అయింది.



ది కర్నల్

"నన్నడిగితే దేనికైనా ఎటువంటి చూసినా, ఒకే ఒక తరణోపాయం ఉందంటాను.... గౌరవప్రదమైన మరణం" అంటాడు పోలిష్ కర్నల్ ప్రాకోస్కీ - మృత్యుద్వారబంధంపై నిలచి.



'మీ'

"గౌరవప్రదమైన జీవితానికి కూడా అవకాశం ఉంది గా! మార్గాంతరాలు ఎప్పుడూ రెండేసి ఉంటాయని మా అమ్మ అనేది" అంటాడు శాశ్వత కాందిశీకుడు సమూయేల్ జాకబాస్కీ అమాయికంగా కళ్లు చికిలిస్తూ.

ఇద్దరి మధ్యా ఒక ఫ్రెంచి దేశ వాళీ అమ్మడూ, పక్కని నౌకరు అకిమ్ టామిరాఫ్, వనకా, నెత్తిమీదా నాజీ సేనలూను. ఈస్థితిలో కర్నలూ, కాందిశీకుడూ కలసి ఫ్రాన్సునుంచి ఇంగ్లండు పారిపోవడం మీ అండ్ ది కర్నల్ (పారమౌంట్ పిక్చర్సు) ఇతివృత్తం.

జర్మని పోలెండ్‌ను పట్టుకుంది. ఫ్రాన్సు మీదకు వస్తున్న ఆ సమయంలో జనం అంతా ఊళ్లు ఖాళీచేసి పోతున్నారు. కాందిశీకుడు జాకబాస్కీ ఉపాయశాలి. అపాయం పెద్ద కెరటంలా విరుచుకు పడుతున్న ప్పుడు దానికి ఎదురొడ్డక నేర్పుగా దానిమీద ఎక్కి సవారీ చేయడం అతని జీవన శిల్పం.

చావు ఒకటే దారి అని నమ్మి ఎపుడూ యుద్ధం చెయబోయే అపాయశాలి కర్నల్ కూ, బ్రతుకు అనే రెండో దారి ఒకటి ఉంటుందని నమ్మి ఎప్పుడూ పారిపోబోయే కాందిశీకుడు జాకబాస్కీకి జంట కట్టాల్సిన పరిస్థితి వస్తుంది. జాకబాస్కీ, పారిపోవడానికి ఒక రోల్స్ రాయిస్ కారు సంపాదించాడు కాని తోలడం రాదు. కర్నల్ కి కారు చాలా అవసరం. కాని, లేదు. అందువల్ల ఈ యిద్దరూ రాజీపడి ఆ కారుమీద ఒకరిటూ ఒకరంటూ లాగుతూ, చావుబ్రతుల సరిహద్దు రేఖ మీగుగా ఇంగ్లీషు చానెల్ రేవు దగ్గరకు చేరుకోబోతారు. జాకబాస్కీ యూదు అని ఏవగించుకుంటున్న కర్నల్, అతని వేదాంతం తమాషా గా వుందనుకున్న కర్నలు ప్రియురాలూ, చివరకి మనం అందరమూ కూడా ఒక్కసారిగా అడంగి చేరే వేళకు జాకబాస్కీని మనసారా ప్రేమించడం జరుగుతుంది. చుట్టూ ఉన్నవాళ్ళందరికీ చిరాకు కలిగించిన తిక్కమనిషి కర్నల్ మీద కూడా మనకి అభిమానం కలుగుతుంది. కర్నల్ ని అంత మనోహరంగా ధరించిన కర్ట్ జర్గెన్స్‌కూ, జాకబాస్కీని అంత రమణీయంగా తోడుక్కున్న డానీకేయీకీ, వాళ్ళిద్దరిమధ్య మన తరపున నిలబడ్డ ప్రైవేట్ (కర్నలు నౌకరు) అకిమ్‌టామిరాఫ్‌కూ ఇంతకన్న కావలసినదేముంటుంది. డానీకేయీ మామూలు ప్రకారం ఇందులో చిలిపి చేష్టలూ డాన్సులూ మిమిక్రీ చేస్తాడనుకుని వెళ్ళకండి. ఈసారి ఆ పనులన్నీ అతని బదులు అతని మాటలు చేస్తాయి. ఆ మాటల ఆటపాటలు కేయీకన్న హుషారుగా ఉంటాయి. అతను వాటితో పోటీగా నటించాలని ప్రయత్నించకపోతే ఇంకా బాగుండేది.

'కర్నల్' జర్గెన్స్‌కు ఇందులో నటనకు అకాడమీ అవార్డు వచ్చింది. అతని ప్రియురాలుగా నటించిన ఫ్రెంచి వనిత నికోల్ మారే పేరు గుర్తుంచుకో తగ్గది. ★

# సంగీత వార్తలు

డానీకేయీకి దేశవాళీ రకమూ అని అభిమానులు అంటూవచ్చిన కిశోర కుమార్ రెండు చిత్రాలకు సంగీతరచన, దర్శకత్వాలను నిర్వహిస్తున్నాడన్న విషయం విదితమే. రెండూ అతను స్వయంగా నిర్మిస్తున్నవే. ఒకటి 'సుహానీగీత్'. మరొకటి 'నీలా ఆస్మాన్.' తొలిచిత్రానికి పాటలరికార్డింగు పూర్తయింది. షూటింగ్ ఆరంభిస్తున్నారు.

సంగీత విద్యాధరి లతామంగేష్కర్ ఆరాధించే సంగీత విద్వాంసులలో పండిట్ రవిశంకర్ ఒకరు. గతవారం, తొలిసారిగా, ఆమెకు ఆయన చేసినపాట పాడేఅవకాశం వచ్చింది. జెమ్లెఫిలింస్ వారు ప్రేమ్‌చంద్ నవల ఆధారంగా తీస్తున్న 'గోదాన్'కు ఈయన సంగీతం సమకూర్చుతున్నారు. 15 ఏళ్ళక్రితం 'ధర్తీకేలాల్'కు సంగీతంకూర్చిన రవిశంకర్ తిరిగి ఇన్నాళ్ళకు తొలిసారిగా ఒక హిందీచిత్రానికి పనిచేస్తున్నారు. రవిశంకర్ తాను స్వయంగా సృష్టించిన 'మాచ్ ఖమాచ్' రాగంలో చేసిన పాటను లతా పాడింది.

నిముషాలతో పోటీ చేసి పరిగెడుతూ పాటలుపాడే లతా రోజూ ఎందరికృతులో వింటూ అంటూ ఉంటుంది. ఎప్పుడు ఆమెకు వ్యక్తిగతంగాకూడా చాలానచ్చిన పాటలు తటస్థపడతాయి. చాలాకాలం క్రితం ఆమె, 'దోబీఘా జమీన్‌లో' సలీల్ చౌదరి చేసిన పాట "నిందియా ఆజారే"ను ప్రత్యేకం మెచ్చుకుంది. ★



'వీరపాండ్య కట్టబ్రహ్మన'లో శివాజి గణేశన్.

# ★ స్వర లహరి ★

(32 వ పేజీ తరువాయి)

కాని సినిమా సంగీతానికి ఒకస్థాయినీ గౌరవస్థానాన్ని కల్పించడానికి కృషిచేసిన పెద్దలలో నౌషద్‌కు సర్వదా గౌరవనీయమైన ప్రముఖస్థానం ఉండతీరుతుంది

నౌషద్ శకానికి పూర్వం ఉజ్వలంగా వెలిగి నేటికీ పూజనీయమైన స్థానంలో నిలిచినవారిలో ఘులాం హైదర్, ఖేమ్‌చంద్ ప్రకాష్, శ్యామసుందర్ లను చెప్పుకోవాలి ఖజాంచీ, హుమాయూన్ వంటి చిత్రాలలో ఘులాం హైదర్ చేసిన పాటలు ఇప్పుడు ఎప్పుడూ కూడా బాగుంటునే ఉంటాయి సినిమా సంగీతంలో, (ఇటీవల బాగా ప్రచారంలోకి వచ్చిన) పంజాబీ జానపద గీత రీతులను ప్రవేశపెట్టిన వాడు ఈయనే ఢోలక్ ఈయన కానుకే

నౌషద్ ఈయనదగ్గర సహకారం చేశాడు. చేసి గురువంత శిష్యుడై సినిమా సంగీతాన్ని నవరాగ తాళాలతో అలంకరించాడు.

పేరీజులు వేస్తే, నిజానికి, నౌషద్ పని చేసిన చిత్రాలు మిగతావారికన్న తక్కువ ఉంటాయి ఘులాం హైదర్, ఖేమ్‌రాజ్ జీ, రామచంద్రలు పది నిముషాలలో ఒక పాటకి వరసకడితే, నౌషద్ పదిహేను రోజులు తీసుకుంటాడు అందుకే అందరూ సాలుకు పది చిత్రాలకు పనిచేస్తే నౌషద్ ఒకటి రెండింటికిమాత్రం చేస్తాడు, అలా చవ్వున పని చెయ్యడం చాలా తప్పు అనటంలేదు కాని, ఇలా స్థిమితంగా, ప్రతి స్వరాన్నీ ప్రతి స్వరం ముందూ వెనకా ఉంచి పరిక్షించి నిగ్గుతేల్చి, జాగ్రత్తగా కొత్తరీతిల్లా నగిషీలు చెక్కడం ఒక ప్రత్యేకత అందుకే, ఉపమానాలు వెతికితేవడం కష్టమైన నాటిలో నౌషద్ పాట చెరుతుం దనిపించుకుంది

"నౌషద్ శిల్పం, ఆయన పాటల స్నిగ్ధత్వం నిరుపమానమైనవి" అని ఒక సందర్భంలో లతామంగేష్కర్ జోహార్లు అర్పించింది.

సత్యాన్వేషకి సమాధానం ఏమిటని గణిత శాస్త్రజ్ఞుడిని అడిగితే 'స్క్వేర్ రూట్ ఆఫ్ మైనస్ వన్' అంటాడు నౌషద్‌ను అడిగితే సప్త స్వరాలను అడగమంటాడు అది ఆయన తపస్సు

కష్టపడి చిత్తశుద్ధితో చేసిన పని నిష్ఫలం కాదన్న నినాదానికి బలం చేకూర్చింది నౌషద్ కథ అంతవరకూ సినిమాలలో ఒకటి అర పాటలు జనంనోట వినబడేవి నౌషద్, 'రత్తన్' చిత్రంతో భారతీయ ప్రేక్షకుల శ్రోతలహృదయాలను సంగీతంతో నింపివేశాడు నాటినుండి ఒక చిత్రంలోని పాటలన్నీ ప్రజాదరణ పొంది చిత్రవిజయానికి కూడా దోహదం చేయడం ఆరంభమైంది అదే చిత్రాలలో సంగీతం ప్రాముఖ్యాన్ని పెంచింది రత్తన్‌లో పాటలు, పాట రానివాళ్లకికూడా పాడాలనిపించేటంత సులభంగాను సుఖంగానూ, పాట వచ్చినవాళ్లు మెచ్చుకునేటంత అందంగాను కూడా ఉంటాయి ఆ పద్ధతిలో కొంతకాలం పాటలుచేశాక నౌషద్ మళ్లీ కొత్తపద్ధతి, కొత్తవరవడి దిద్దుకున్నాడు. ప్రగతి మార్చడం నౌషద్ పద్ధతులలో ముఖ్యమైనదని ఆయనను ఎరిగినవారంతా కూడా అంటారు అయినా సంగీతాన్నిబట్టే ఆయనను అర్థంచేసుకునేవారికి కాలాన్ని శ్రోతల అభిరుచినిబట్టి నౌషద్ కొత్త పద్ధతులు ఆరంభిస్తాడా, ఆయన కొత్తపద్ధతి ఆరంభించడంతో కొత్తకాలం, కొత్త అభిరుచి ఆరంభమవుతాయా అన్నది సమస్య.

ఈ మార్పులు క్రమంగా సినిమాలో ఫేడింగ్ షాట్‌లలా, ఒక దానిలో ఒకటి కరిగిపోతాయి వీణమీద స్వరాలలా పాతపద్ధతి కొత్తదానిమీదకి, సాగిపోతుంది శారద 'స్టేషన్‌మాస్టర్' చిత్రాలనుండి 'రత్తన్' వరకూ స్థూలంగా ఒక ఘట్టం ఆ తరవాత కొద్దిగా మార్పులు వచ్చాయి అనోఖీ అదా తరవాత పద్ధతి పూర్తిగా మారిపోయింది

రత్తన్‌లో పాటలరూపం అప్పటికి చాలా కొత్త. పల్లవి, దానికి సరిపడే బరువుతో ఆర్కెస్ట్రా, ఆ తరవాత చరణం, మళ్ళీ అంత పొడుగునా ఆర్కెస్ట్రా తిరిగి మాట వరసమారి (పాటవరస అంతే,) చరణం ఇలా వచ్చేవి ఈ పాటలు సంచలనం కలిగించాయి మిగతావాళ్లు చాలమంది నౌషద్ పద్ధతిని పాటించేశారు. పల్లవి నౌషద్ పెట్టినంత హుందాగా పెట్టేవాళ్లు అరుదు అనోఖీ ఘడీలో సురయ్యా పాడిన భోజాక్యా, దిల్లగీలో శ్యామ్ సురయ్యాలు కలసిపాడిన 'తూ మేరీ చాంద్ మై తేరీ చాందినీ,' షాజహాన్‌లో సైగల్ మధురస్వరం వినిపించిన 'గమ్‌దియే ముస్తకిల్' నజీంఅక్తర్ పాడిన 'జగ్ ఉగ్' ఈ కోవకి చెందినవి ఈ పాటలు వింటున్నప్పుడు ఉద్వేగ్తున లేచిన కెరటంమీద కూర్చొని అది ఎక్కడికి ఆశతోంగో కూడా తెలీకుండా వెళ్ళిపోతున్నట్టనిపిస్తుంది 'గమ్‌దియే' లో కొద్దిపాటి మంద్రస్వరాలతో వరసను కట్టి వినిపించాడు నౌషద్ 'ఆన్'లో పాటల రచనాశిల్పం ప్రత్యేకించి చెప్పుకోవలసినది. రెండుమూడు స్వరాలనే కలిపి పోసి విసుగెత్తకుండా వరసలుకట్టి దాదాపు



'కృష్ణలీలలు'లో కృష్ణుడుగా ఉమ.



భాస్కర్ ప్రొడక్షన్స్ వారి కొత్తచిత్రంలో రమణారెడ్డి.

# ★ స్వరలహరి ★

మూటే బాటమీద పాడుకుపాటి పల్లవులు కట్టాడాయన.

స్వరవిన్యాసానికి చెప్పుకోదగినది అందాజ్ చిత్రంలో ముఖేష్ పాడిన 'తోడ్ దియా దిల్ మెరా' ఇందులో స్వరాలూ అనుస్వరాలూ మొత్తం పదహారింటినీ రచయిత స్పృశించాడు. కేవలం మట్టుకుని చక్రం వడపోకొక, పాటలో ప్రతిస్వరాన్నీ సార్థకంగా ప్రయోగించాడు అన్నివిధాలా ఈ తరం అనదగ్గపాట ఇది (ఆల్ రౌండ్ మాస్టర్ పీస్) అని లతా దీనిని అభివర్ణించి మెచ్చుకుంది. ఇది ఇలా టివి వింటూన్నకొద్దీ కొత్త అందాలు స్ఫురిస్తాయి. కొత్తరంగులు కనిపిస్తాయి. ఈ పాటతోటే ముఖేష్ ఒక్కసారిగా తారాపథాన్ని అందుకున్నాడు

అశోక్ ఆదావరకూ – నాటక్, దిల్లగీ, దాస్తాన్, అందాజ్, దర్ద్ వంటి చిత్రాలలో అనేకరకాల ప్రయోగాలు చేస్తూ త్రిస్థాయిలా షెంషాద్, ముఖేష్, రఫీ, లతాల కంఠాలతో విహరిస్తూ సినిమాసంగీతానికి అపూర్వమైన ప్రజాదరణను సంపాదించి పెట్టాడు

దీదార్ లో రఫీపాట మేరీకహానీ, గులాబీలో రఫీ, లతా పాడిన సుహానీ రాత్, జాదూలోని ప్యార్ కె సాగర్ సే (రఫీ), అనోఖి అదాలో భూల్ గయా సావరియా (లతా) ఎవరూ మరచిపోలేరు సంగీత ప్రియులకు ఈ పాటలలో వాద్యాల ఉపశ్రుతులుకూడా కంఠతా వచ్చు అసలు ఏ సంగీత దర్శకుడికైనా, ఆర్కెస్ట్రాలో అపారమైన ప్రతిభ చూపే అవకాశం ఉంటుంది పాటకి శ్రుతులు, ప్రతులు, ఉపశ్రుతులు, 'సమాంతరాలంకారాలు', రూపకాలు, విశేషణాలు, అర్థవివరణలూ, కోరికలూ అన్నీ ఈ వాద్యాలలో పొందుపరచవచ్చు పాటలో సాహిత్యాన్ని, అందులోని భావాన్ని రాగరేఖలలో చిత్రించవచ్చు. వర్ణచిత్రాలు స్ఫురింపచేయవచ్చు ఇవి, ఇంకా మరెన్నో ఇలా చేయవచ్చునని నౌషద్ కాంపోజిషన్లు విన్నమీదటనే బాగా తెలియవచ్చింది. ఆయన ఆర్కెస్ట్రాలో 60 వాద్యాలనుంచి (కొత్త చిత్రం 'మొగల్ అజామ్' కోసం) 200 వాద్యాల వరకూ ఉంటూ ఉంటాయి ఇన్ని వయొలిన్లు చెప్పగలసంగతిని ఆరు వయొలిన్లతో చెప్పించడం ఆయనకు గిట్టదు 19 తో సరిపెట్టవచ్చునేమో అని అనిపించేందుకూ కూడా వీలులేనంతగా ఆయన వాటిని ప్రయోగిస్తాడు. పాశ్చాత్య వాద్యాలన్నిటి గురించి నౌషద్ తెలుసుకున్నాడు

సింఫనీని చాలా సమర్థంగా కల్పించి నిపుణం అభ్యసించాడు 'నాటక్' చిత్రంలో ఉమాదేవి (ఇప్పటి హాస్యనటి టున్ టున్) పాడిన 'దిల్ వాలే' ఆంగ్లేయ విధానంలో చేసిన పాటలో చాలా మంచిది

కేవలం వాద్యసంగీతం (పాటలే కాకుండా) కూడా నౌషద్ మాజిక్ వాండ్ లోంచి వస్తే శ్రోతలను మంత్రముగ్ధుల్ని చేయగలగు దులారి చిత్రంలో టైటిల్ మ్యూజిక్ రికార్డు ఆరకం వాటి అమ్మకంలో రికార్డులన్నీ చితగ్గొట్టేసి కొత్తరికార్డు పెట్టింది అలాగే దాస్తాన్, మేలా చిత్రాలలో కథావస్తువును ఉద్ఘోషించే వాద్య సంగీతం రికార్డులు విశేష ప్రజాదరణ పొందాయి. మేలాలో 'ధర్తీ కే ఆకాశ్ పుకారే' అన్న వాక్యాన్ని ఆయన వాద్యసంగీతంలోకి అనువదించినప్పుడు అంత పనీ జరుగుతుందనిపించి గుండె ఝల్లుమంటుంది ఏపాటచేసినా ముందర అదంతా విని అందులోని ఈ పాటవచ్చే సన్నివేశం అక్కడి పాత్రల స్థితిగతులూ క్షుణ్ణంగా



'లవ్ మారేజ్' చిత్రంలో సావిత్రి

తెలుసుకుని, ఆపైననే ఆయన రచనకి ఉపక్రమిస్తారు అందువల్లనే ఆలస్యం, అద్భుతమైన సంగీతం సంభవిస్తాయి అందువల్లనే ఆయన పాటలు కొన్ని ఆపాతమధురాలు కాకపోయినా, అన్నీ విధిగా 'ఆలోచనామృతం' అనిపిస్తాయి. అయితే ఇంత ఆలోచించి పనిచేసి, ఆ సందర్భం పాటకు యోగ్యమని తనకు అనిపిస్తేనే పాటసుకూర్చే స్వాతంత్ర్యం సంపాదించి, ఇంత ఆలోచించి పనిచేసే నౌషద్, 'మదరిండియా' చిత్రంలో "నగరి నగరీ ద్వారే ద్వారే" అనే పాటను సందర్భశుద్ధిని వెయ్యికళ్లతో పరిశీలించి మరీ పెట్టాగని అనుకోము ఇది చిన్న అపశ్రుతి. మదరిండియాలో పాటలన్నీ నిండుగా, అర్థంచేసుకొన్నకొద్దీ చవులూరేవిగా ఉన్నాయి ఆర్కెస్ట్రేషను గొప్ప చెప్పుకోదగిన చిత్రం మరొకటి ఉంది. ఉరన్ ఖటోలా 'నదియాధరీ బహే' అనే పాటలో స్వరకల్పన, నది ఎంత మెల్లగా నిండుగా ప్రవహిస్తోందో వర్ణించింది దాని నేపథ్యంలో వాద్యాలుగా మానవ కంఠస్వరాలనే ఉపయోగించి ఒక మంచి ప్రయోగం చేశారు ఈ చిత్రంలోనే, టైటిల్ మ్యూజిక్ కు ఆయనచేసిన ఆర్కెస్ట్రేషన్ (ఇది నౌషద్ స్వంతంగా నిర్మించిన చిత్రం) ఆయన అభిమానులకు కూడా బాధ కలిగించింది

ఇది సన్మానపత్రాలలో పేర్కొనవలసిన అంశం ఎంతమాత్రం కాదు.

ఈ ఉరన్ ఖటోలా చిత్రంలోనే శాస్త్రీయమైన సంగీతం కూడా వినిపించారు. మొహబ్బత్ కి రాహోంమే (రఫీ) అనే ఆపాట నౌషద్ రచనలలో చాలా గొప్పది సినిమా సంగీత రచయితలు సాధారణంగా రెండేసి మూడేసి రాగాలను కలిపి పాటలు చేస్తారు కొందరు ప్రజ్ఞానిధులు ఒక రాగం అనుకుని చేస్తుంటే, వాళ్లకి తెలీకుండానే అది ఇంకోదాంట్లోకి జారిపోవడం వేరే సంగతి. రాగాలను మేళవించి ఎన్నో పాటలు చేసిన నౌషద్, కొన్ని చిత్రాలలో శుద్ధమైన రాగాలను యథాతథంగా వాడి, ప్రయోగం తెలిస్తే దేనినైనా ప్రజలాదరిస్తారన్న మాటను ఋజువుచేశారు బైజుబావ్రాలో పాటలన్నీ అలాటివే (అందులో 'హరిఓం'ను మొదట ఖాన్ సాహెబ్ బడేగులామ్ అలీఖాన్ చేత పాడించాలనుకున్నారు) లతా రఫీ పాడిన 'ఝూలేమె పవనుకీ ఆయీ బహార్' మరొకటి ఇది పీలూ రాగంలో చేసినది సాధారణంగా ఈ రాగాన్ని బాధపలకడానికి ఉపయోగిస్తారు నౌషద్ దీనిని ప్రేమగీతానికి మనోహరంగా తొడిగాడు షబాబ్ లో రఫీ పాడిన 'ఆయేన బాలమ్' జయజయవంతి రాగానికి లలితానువాదం షబాబ్ లో పాటలన్నీ ఈ శ్రేణిలోనివే లతా పాడిన 'మర్ నా తెరీ గలీమే' మంపురాని పాట. ఇటీవలి 'సోనీ మహీవాల్' చిత్రంలోకూడా అన్ని శాస్త్రీయమైన వరసలే చేశారు. ఇందులో మహేంద్రకపూర్ అనే కొత్త గాయకుడిని నౌషద్ పరిచయం చేశారు

నౌషద్ సృజనాత్మక ప్రతిభగల విద్వాంసుడు కళ పరిణామశీలమైనదని గుర్తించి, వ్యాపారపు ఒత్తిడినిబట్టి వ్యవహరించకుండా ఉండగల వివేకి సంగీతం ఆయనకి సర్వమూ అని నమ్మి అందులోంచి తీసి ఇవ్వతగ్గ సర్వస్వాన్ని తీసుకోడానికి నిరంతరం కృషి చేసే కళారాధకుడు ఈ ప్రయత్నంలో ఆయన భారతీయ చలనచిత్రసంగీతాన్ని ఎన్నో కొత్తమార్గాలలో నడిపారు. ఎన్నో వరవడులు పెట్టారు అందుచేతనే ఆధునిక చలనచిత్ర సంగీత చరిత్రలో ప్రతిఅధ్యాయానికి మొదటి వాక్యంలో నౌషద్ పేరు కనబడుతుంది. ★

# మానవుడి విజయం

ఏట్ల మధ్యాహ్నం గదిలో పడుకుని ఏదో పుస్తకం చదువుకుంటున్నాను. ముందటి వీధి తలుపు తెరిచిన సవ్వడి, వెను వెంటనే గొంతు సవరించుకున్న శబ్దమూ వినిపించాయి. ఆ సకిలింపు నాకు బాగా గుర్తు! వచ్చేది వాడు ఆదిశేషయ్య!

"ఏం శేషయ్య మామా! రా, కూర్చో! ఈమధ్య మన కార్యకలాపాలు బొత్తిగా స్తంభించిపోయినట్టున్నాయి! ఏం చేస్తున్నావు? లేదా ఏం చేయదలచుకుంటున్నావు?" అంటూ పరామర్శించాను.

"ఏమీ చేయడం లేదు. ఊరికే గోళ్లు గిల్లుకుంటూ యింటిదగ్గర పడివున్నాను." చాప పైన కూర్చుని గోడకు చేరగిలబడిపోతూ అన్నాడు ఆదిశేషయ్య.

ధరతగ్గుట హాస్యోక్తికే అన్న వాదాన్ని బట్టి చూస్తే ఏమీ చేయకపోవడం ఏదైనా చేయడానికే! పొర విడువబోతున్న పాములా నిద్రముఖంలో జోగుతూ ఆలోచనలన్నింటినీ అంతర్ముఖంగా సారించి ఈయన ఆ చేయబోతున్న పనికి బ్రహ్మాండమైన పునాదులే వేస్తున్నట్టున్నాడు. బాగా గోళ్లు గిల్లుకుంటున్నట్టు గూడా చెబుతున్నాడనుకోండి! ఆమాట నిజమే! గోళ్లు గిల్లుతూ కూర్చుంటే గానీ ఈ మనిషికి వూళ్ళుముంచే ఉపాయాలు స్ఫురించవు!

మూసి ముల్లు గొట్టుకపోయిన ఆకోశంలా ఐదు నిమిషాలు కదలకుండా మెదలకుండా కూర్చున్న తర్వాత వున్నట్టుండి నోరు తెరచి "ఒరే బాబూ! ఓ కాగితం చేతికి తీసుకో" అన్నాడు ఆదిశేషయ్య.

తెల్లబోతూ ఆయన ముఖంలోకి చూచాను. కొంపదీసి ఈయన ఆశుకవిత్వం చెప్పడుగదా! కాళికాదేవి ప్రసన్నురాలై నాలుక పైన బీజాక్షరాలేనా వ్రాసివుండాలి. కాక ఏ మహేంద్రుడైనా దయదలచి తారక మంత్రమైనా వుపదేశించివుండాలి. లేకుంటే అంతపని జరగదు. ఒకవేళ ప్రోనో టేమో! ఊహు, అయివుండదు. ఆదిశేషయ్య ప్రోనోటు కుంకం కట్టుకోడానికి తప్పితే మరెందుకూ పనికిరాదని ఈ ప్రాంతంలో అందరికీ తెలుసు!

తినబోతూ రుచులడగడ మెందుకని పెట్టె తెరిచి కాగితం పైకి తీశాను.

"మొన్న మన వూళ్ళో హరికథ జరిగింది గదూ! కథ ప్రారంభంలో హరిదాసు మంచి మంచి పసందైన మాటలు కొన్ని చెప్పాడు. వాటి నలాగే కాగితం పైకి దించేయాలి..."

అర్థం కాక మరికొంత వివరణ కోరుతూ ఆయన వైపు చూడసాగాను.

"అంటే, ఈ ప్రపంచకం అంతా వట్టి మాయ! సంసారమంటే అదోక వూబి! ఎందరు రాజులు రాజ్యాలేలలేదు? వాళ్ళేం మూట గట్టుకపోయారు? పోయేనాడు పూచిక పుల్లయినా వెంట వస్తుందేమన్నా? కాబట్టి దీపమున్నప్పుడే యిల్లు దిద్దుకోడం మంచిది... అలా అలా వ్రాసుకుంటూ వెళ్లు మరి! ముఖ్యమైన విషయం తరువాత చెబుతాను..."

ఐతే యిది ఉపోద్ఘాతమన్నమాట! ఇంతకూ అసలు విషయమేమిటో?

ముఖకవళికలనుబట్టి యింగితాన్ని తెలుసుకోవచ్చునంటే మన శాస్త్రజ్ఞుల ధీమాపాలిటికి ఆదిశేషయ్య ముఖం ఒక

మధురాంతకం
రాజారాం

వెక్కిరింపు. మనిషి బక్కపలచగావుంటాడు. తల బట్టగట్టిపోయి యితడిసిక్కెలా వుంటుంది. బలంగా గాలివీస్తే వరుసగా అయిదు పల్లటీలు వేస్తాడేమో ననిపిస్తుంది. కాని అతడి ముఖంమాత్రం ఉక్కుకోట. ఆకోట గోడలలోపల ఎలాటి సన్నాహం జరుగుతోందో ఎంతటి సంరంభం చెలరేగుతోందో వూహించడం కష్టం!

తనంతటతానై తనవుద్దేశమేమిటో బయట పెట్టేదాకా నేనతడి పథకమేమిటో తెలుసుకోలేక పోయాను.

అసలు సంగతేమిటంటే ధర్మవరంనుంచీ రాయలపేటకు వెళ్లేరోడ్డులోనట, పన్నెండో మైలురాతిదగ్గర గుక్కెడు మంచినీళ్లు దొరకక బాటసారులు తల్లడిల్లిపోతున్నారట! అందుకుతోడూ ఆ ప్రాంతంలో తల దాచుకోను చెట్టయినా కనిపించదట! అక్కడ చేదబావి ఒకటి త్రవ్వి ఓసత్రాన్ని నిర్మించాలని ఆదిశేషయ్య వుద్దేశం. అందుకోసం ఉదారహృదయులైన సజ్జనులు విరివిగా చందాలు, విరాళాలు యిచ్చి తోడ్పడవలసిందిగా అభ్యర్థించడం ఈ విజ్ఞప్తిలోని సారాంశం!

ఉన్న సంతానం పున్నామనరకంనుంచీ వుద్ధరించగా, సప్తసంతానాల్లో ఒకటైన సత్రప్రతిష్ఠ ఆదిశేషయ్యకు స్వర్గంలో శాశ్వతస్థానం ఏర్పరచవచ్చు! కానీ నాసంశయం వేరు. ఈయన గారికి ధర్మవరం, రాయపేట బాటసారుల పైన వున్నట్టుండి ఎందుకిలా అనుతాపం కలిగినట్టు? నీతిచంద్రికలో దీర్ఘదర్శి చెప్పినట్టు—నూకలు నిర్హేతుకంగా చల్లబడవుగదా!

## 2

ఆదిశేషయ్య అదోకరకం మనిషి. అతనికి ఎంతోకొంత భూవసతికద్దు. కానీ చెమటోడ్చి పైరెక్కించి ఆ ఫలసాయం పైన ఆధారపడి జీవించడం అతడికెందుకో వట్టి నామోషీపనిగా తోచింది. నాకు బుద్ధి తెలిసినప్పటినుంచీ అతడుచేస్తున్న పని ఒక్కటే ఒక్కటి—అర్థసముపార్జనకు అడ్డదారులు అన్వేషించడం!

ఆదిశేషయ్య తనకంటూ ప్రత్యేకంగా ఓ లోకాన్ని ఏర్పరచుకున్నాడు, బుద్ధిగా సేద్యం చేసుకుంటూ గుట్టుగా బ్రతకమని హితబోధ చేసినవాళ్ళను, యిది నీకు బుద్ధిగాదని గట్టిగా గడ్డిపెట్టిన వాళ్ళను ఆలోకంనుంచీ బహిష్కరించాడు. ఎదురుకదపడానికి సాహసంలేక, అతడి నడవడిపట్ల వైముఖ్యాన్ని మనసులో సేదాచుకున్న నాలాంటి వాళ్ళను అప్పుడప్పుడూ తనలోకంలోకి రానిచ్చినా అప్పటికప్పుడే వెళ్లగొడ్తూ వచ్చాడు. ముప్పాతిక మువ్వీసం జనాభా ఆవిధంగా బహిష్కరింపబడగా అతడిలోకంలో—జాతకంలో శుక్రమహర్దశ తొంగిచూస్తున్నదని నమ్మబలికే జ్యోతిష్కులు, యినుమునైన ఏవో తంత్రాలుజరిపి బంగారంగా మార్చడం సాధ్యమేనని గొప్పలు చెప్పుకునే బైరాగులు, భూమిలోని పాతరలనుయిట్టే పెకలించగలమని కోతలు కోసే మాంత్రికులు, యిలాంటివాళ్ళు కొందరు మాత్రమే మిగిలారు!

గిరిగీసుకుని కూర్చున్న ఆ చిన్నలోకం నుంచీ ఆదిశేషయ్య మిగిలిన ప్రపంచాన్ని అదిలించాలనీ, బెదిరించాలనీ ప్రయత్నించాడు. అందుకోసం, వున్నారా, అసలు లేరా అని మనం శంకించే క్షుద్రదేవతల్ని ఉపాసించాడు. రాయిరాయికరిగే అర్ధరాత్రివేళ శ్మశానాలవెంబడి తిరిగాడు. మంచుసోనలు కొండలు కొండలుగా దూకే వందుచలికాలపు రాత్రుల్లో గొంతుకదాకా పచ్చిమంచినీటిలో మునిగి మంత్రాలు జపించాడు. నాకు తెలిసినంతలో ఆ తిరుపత్ఫు మాకాటినొప్పుల్ని, నానుల్లి జలుబుల్ని



"విధి అనే చిత్రకారుడు వేసిన కార్టూను బొమ్మలా కనిపించాడు..."

జ్వరాల్నీ ప్రసాదించాయి. మనిషి 'తీన్ తేరా' పట్టిపోయాడు. లేదంటే మంత్రతంత్రాలపట్ల నమ్మకమున్న వాళ్ళు అతణ్ణి ఒక అపాయకరమైన వ్యక్తిగా గుర్తించి, సంఘ బాహ్యుడిక్రింద లెక్క కట్టేశారు!

తన క్షుద్రదేవతల మూలబలాన్ని నమ్ముకుని ఆదిశేషయ్య ఒకసారి పెంకుటింటి పోతరాజును జగడానికి రాదీశాడు. ఈ పోతరాజాభిధానుడు తిండికి తిమ్మరాజువునో కాదో గానీ పనికిమాత్రం పోతరాజు—కాడు! ఆ పని తిట్టడానికీ, కొట్టడానికీ సంబంధించినదయితే మరీ మంచిది! అతను నడివీధిలో ఆదిశేషయ్యను ఛెళ్ళుఛెళ్ళున చెంప వుద్ది చేసి 'ఒళ్ళు జాగ్రత్త' అని హెచ్చరించి తన దారిని తాను—బోయాడు. ఆదిశేషయ్య మీసం మెలివేశాడు. జబ్బ చరిచాడు. 'ఈ భూమిమీద నీకు నూకలు లేవు పొమ్మని' పంతం పట్టాడు.

రోజులు గడచిపోతున్నాయి. పోతరాజు మాత్రం పోతపోసిన విగ్రహంలా వుండి పోతూ వచ్చాడు. కొందరు సంశయాత్ములు 'ఆదివారం అమాస' రావాలిగదా అనుకున్నారు. ఆ ఆదివారం అమావాస్యగూడా రానూవచ్చింది. పోనూ పోయింది. పోతరాజు చెక్కు చెదరలేదు!

ఇతరుల సంగతలావుండగా అంతటితో ఆదిశేషయ్యకే తన మంత్రశక్తిపట్ల నమ్మకం సడలిపోయింది!

అప్పుడతడనుకున్నాడు—మంత్రాలూ లేవు, మట్టిలేదు. ఉన్నా మంత్రాలకు మామిడికాయలు రాలవు. మామిడికాయలు రాల్చగలిగేదీ, మనుషులను తోలుబొమ్మలను చేసి ఆడించేదీ, కొండమీది కోతిని క్రిందికి తీసుకొచ్చేదీ డబ్బు! లోకం ఒక పాలిచ్చే బర్రెలాంటిదైతే డబ్బే దానికి పగ్గం! ఆ పగ్గంతో ఆ బర్రెను యింటిముంగిట కట్టి వుంచేయవచ్చు!

ఈ రహస్యం ఆకళింపుకు రాగానే ఆదిశేషయ్య ఆకొన్న వ్యాఘ్రంలా లోకంపై కెగబడ్డాడు. కొంతకాలంపాటు బోనులో నిలబడి ఒకరు చెప్పమన్నట్టు సాక్ష్యం చెప్పడం అతడికొక వృత్తిగా పరిణమించింది. కానీ ఏమాట కామాటే చెప్పుకోవాలి. నయ్యాక్రాసు పరీక్షకు తట్టుకుని చివరివరకూ అపద్ధాన్నే అంటిపెట్టుకోగల అతడి నిజాయితీ మెచ్చుకోదగ్గది! కొన్నాళ్ళకే ఆదిశేషయ్య సాక్ష్యం అపద్ధపు సాక్ష్యానికి పర్యాయపదం కావడంతో మొదట మొదట లాభసాటిగా ప్రారంభమైన ఈ వ్యాపారం నానాటికీ తీసికట్టయిపోయింది.

ఈసారి ఆదిశేషయ్య ఒకరికి తెలియకుండా ఒకరిదగ్గర ఓపినన్ని అప్పులు చేసేశాడు. ఆ అప్పులు వడ్డీలతో కలిసి ఒక నాలుగంకెల పెద్ద సంఖ్యగా రూపొందేసరికి ఓ చిన్న సత్యం బయటపడింది. ఆస్తిలో ఒక్క సెంటుగూడా ఆదిశేషయ్యది గాదు! ముందు జాగ్రత్తతో అతడేనాడో ఆస్తిని భార్యపేరిట వ్రాసి రిజిష్టరు చేసేశాడు!

కానీ ఎప్పుడులేచినా రాత్రిపక్క దగ్గర తెల్లవారినట్లు, ఆదిశేషయ్య ఎంత సంపాదించినా, అందులో కొంత పేకాటకు, మరికొంత కోడిపందాలకు, మిగిలింది నిజదారసుతోదరపోషణకు సరిపోయింది. పోగా జవసత్వాలుడిగి వృద్ధాప్యం దగ్గరించేసరికి అతనికి ఎర్రని ఏగానీ లభించని దుర్దశ ప్రాప్తించింది!

సరిగ్గా ఈ పరిస్థితిలోనే ఆదిశేషయ్య విజ్ఞప్తి వ్రాయించుకుని కాశంపైకి బయల్దేరాడు. ఎక్కడెక్కడ తిరిగాడో ఏమిటో రెండుమూడు మాసాలవరకూ అజా పజా లేకుండా పోయాడు. ఒకపడి బియ్యమనీ, పిడికెడు వుప్పనీ, గుప్పెడు మిరపకాయలనీ తులసమ్మత్త వూళ్ళో ప్రతియింటా బాకీలు చేసిపెట్టింది. చీలికలు పేలికలైన చింపిరి గుడ్డలతో గంగజాతరలో బయల్దేరిన వేషాల్లా అతనిబిడ్డలు వీధుల్లో తిరుగుతూ వూళ్ళో ఎక్కడబడితే అక్కడ కనిపించారు.

ఓరోజు వుదయం పళ్ళు తోముకుంటూ చెరువుకట్టదిగి వూళ్ళోకి వస్తున్నాను. రచ్చపైన ఆదిశేషయ్య హఠాత్తుగా ప్రత్యక్షమయ్యాడు.

మనిషి మునుపటికన్నా చిక్కిపోయాడు. గడ్డం గుబురుగా పెరిగింది. పెదవుల మధ్య కాలుతున్న చుట్టతో గుప్పుగుప్పున పొగ వదులుతూ, నల్లగా మాసిపోయిన దుస్తుల్లో బొగ్గులో మునిగిలేచిన యింజనులా కనిపించాడు.

"ఏం శేషయ్య మామా! ఎప్పుడొచ్చావు?" అన్నాను.

"ఎప్పుడొస్తేనేమి గానీ ఈ గడ్డంతో పెద్ద పీకగావుందిరా బాబూ! మంగలికోసం చూస్తున్నాను" అన్నాడు ఆదిశేషయ్య.

ఏమాత్రం వసూలయిందని వాకబు చేయాలనుకున్నాను. కానీ ఎప్పుడొచ్చావన్న మామూలు ప్రశ్నకే సదుత్తరం లేకపోగా యిక ఈ విశేషాంశాన్ని గురించి ప్రస్తావించే ధైర్యం నాకు లేకపోయింది.

ఆదిశేషయ్య కలిమిలేములతో తనకేమీ సంబంధం లేనట్టు మళ్ళీ కాలచక్రం దొర్లిపోసాగింది. ఒకటి రెండు మాసాలు గడచిపోయాయి. ఈ వ్యవధిలో ఆదిశేషయ్య యింటిల్లిపాదికీ వరుసగా కొత్త బట్టలు

# ★ మానవుడి విజయం ★

కొన్నాడనీ, పదిమూటలవడ్లుతీసి మినుములో దంపించాడనీ రోజుకొక్కటి రెండు చొప్పున కొత్తకొత్త కబుర్లు నాచెవిలో పడుతూ వచ్చాయి. అయిదారు నెలల పాటునునా అరకడుపు పరకడుపుగా పస్తులుమాడిన ఆ కుటుంబానికి ఈ మాత్రం వసులుబాటు కలగడం నా మట్టుకు నాకు కొంత సంతృప్తినే చేకూర్చింది. కానీ ఈ సంతృప్తికి వెనుక నాలో సర్వేశ్వరం- రాయిలపేట బాటసారుల పట్ల సానుభూతి లేకపోలేదు! పాపం, వాళ్ళని. భగవంతుడు నాటికీ నేటికీ చిన్నచూపే చూచాడు!... తెట్ట తేరకు భగవంతుడిపైన నింద వేయకుండా వేరొక విధంగా భావించడం మరీ మంచిది! వాళ్ళు దిగివచ్చిన రాత చిన్నది! ఎండలో తిలమాడి పోవాలి, కాళ్ళు కాలిపోవాలి, నాలుక పిడచగట్టుక పోవాలి అని అడిగివచ్చిన వాళ్ళకు సత్రాలూ, చేద బావులూ ఎక్కడి నుంచి లభిస్తాయి?

## 3

ఒకసారి మానవ రక్తానికి మరిగినతర్వాత పెద్దపులిని ఆ వ్యామోహం ఒక పట్టాన వదలి పెట్టదని చెబుతారు. ఆదిశేషయ్య రెండో సారి విజ్ఞప్తి వ్రాయించుక పోవడానికి వచ్చినప్పుడు నా కాపాలిక జ్ఞప్తికి వచ్చి నిర్విణ్ణుడినై పోయాను.

రెండోసారి ఆదిశేషయ్య తన పథకాన్ని కొంచెం సవరించుకున్నాడు. నిరంకుశుడైన నియంతలాకాకుండా మంచి 'మూడ్'లోవున్న మంత్రిసత్తముడిలా అందుకు కారణాలుకూడా వివరీకరించాడు. "సత్రమూ చావడీ, గుడీ, గోపురమూ అంటే ఈరోజుల్లో మనషులు కదిలీ మెదలడంలేదు! ఉన్న సత్రాలే పాడుబడి పోతుండగా కొత్తవి కావలిసి వచ్చాయా అంటూ దులపరించుకుని వెళ్తారు. ఇంకో వాళ్ళే నయం! మరి కొందరైతే 'రోడ్లలో బస్సులు పరుగిడుతుండగా వీళ్ళ సైనడు నడిచి చావమన్నాడు' అంటూ మడత పేచీకి సిద్ధమయ్యారు! ఎందుకొచ్చిన గొడవగానీ నువ్వీ దఫా నేనుచెప్పినట్టు వ్రాయరా బాబూ!"

ఎలా వ్రాయమంటాడో చెప్పమన్నాను.

ఆదిశేషయ్య చెప్పాడు.

ఆ మాటలు చెబుతుండగా అతడి ఆకారాన్ని చూస్తూ నోట మాటరాక స్తంభించి పోయాను. పరమేశ్వరుణ్ణి కరుణామయుడని పేర్కొంటారు. ఆ పేర్కొనడంలోని పరమార్థం నాకొ క్షణాన తేటతెల్లమైనట్టు మరెన్నడూ కాలేదు. రత్నగర్భ అయిన వసుంధరను, నిండుగా ప్రవహించే జీవనదులను, అంబుదాలను నిలవేసే మహా పర్వతాలనూ ఆయన భూలోకవాసులకు ప్రసాదించాడు. ఇదంతా ఒక ఎత్తయితే, పుట్టగానే నిప్పుతో అవసరంలేకుండా లోకాన్ని కాల్చివేయగల విపరీతమైన తెలివితేటలతో పుట్టినవారికి విద్య, డబ్బు, అధికారంలాంటివి ప్రసాదించకపోవడం ఒక ఎత్తు. ఇది సాధారణంగా కంటికి కనిపించని భగవంతుని కరుణామయత్వం.

ఆదిశేషయ్య ఈ దఫా ఊరు పూరంతా పరశురామప్రీతి అయిపోయినట్టు వ్రాసేయమన్నాడు.

ఆ వ్రాయడంకూడా చదివినవాడి గుండె అలాగే కరిగి కన్నీరైపోయేలా వ్రాయమన్నాడు. భగభగ మని మంటలు ఎలా చిటిలింది, గాలి విసురులో మంటలెలా నాలుకలు సాచింది, ఆడామగా, పిన్నా పెద్దా, పిల్లా జెల్లా ఎలా దీనంగా ఆక్రోశించింది తూణంగా వర్ణించమన్నాడు. ఇలాంటి గుణవస్థలో యిల్లూ వాకిలీ, తిండీ గుడ్డా లేకుండా తల్లడిల్లిపోతున్న గ్రామసులకు యథోచితంగా ధనరూపంగానో, ధాన్యరూపంగానో సాయపడడం తోడి మానవుల కనీసపు ధర్మమని నొక్కి వక్కాణించమన్నాడు.

"ఆ మాత్రం రాయకపోతే నాలుగు కాసులు రాలవురా బాబూ! నీకు మరేం భయంలేదులే! నేనీసారి రొంపిచెర్ల దగ్గర నుంచీ మొదలుపెట్టి గొట్టిగిల్లు బాకరాపేట నెరబయలుదాకా వెళ్తున్నాను. అయిలాకా వాళ్ళకు అసలీపేరుతో ఒక పూరువున్నదీ, లేనిదీ తెలియదు! వట్టి బోళాభాయీలనుకో! చిటికెలో నమ్మించగలను వాళ్ళని! నా అవస్థేదో నేను పడతానుగానీ నువ్వు నేను చెప్పినట్టు వ్రాసివ్వు! తొందరపడుతున్నాననుకోకు! బాగా ఆలోచించి నిదానంగా రాయి..."

మరునాటి వుదయం మసక మసక చీకటిలో వీధిమెట్లు దిగుతున్నాను. అరుగు పైన పడుకున్న ఆదిశేషయ్య తటాలునలేచి కూర్చుంటూ "రాసేశావా నాయనా" అన్నాడు.

"లేదు శేషయ్యమామా! వ్రాయాలనుకోలేదు. నిజానికి నేనావిధంగా వ్రాయలేను" అన్నాను.

"ఏం, ఎందుకు వ్రాయవు?" జీవితంలో గొప్ప ఆశాభంగంపొందినవాడిలా అడిగాడు ఆదిశేషయ్య.

"చూచి చూచి అలాటి అబద్ధం వ్రాయడానికి నాకు మనస్కరించదు" అన్నాను.

"పోనీలే, పూరి సంగతి నాకొద్దుగానీ నా యిల్లుమాత్రం కాలిపోయినట్టు రాయి! ఇందుకైతే నీకు మనస్కరిస్తుంది కదా! ఒక అన్నీ! కథలూ కారణాలూ వ్రాసి నీకొక మాదిరిగా పేరు తెచ్చిందని యిలా ప్రాధేయపడుతున్నాను. అదేదో గొప్ప పనైనట్టు నువ్వు బిర బిగుసుకుంటున్నావు. ఆ మాటకొస్తే నేనొక టడుగుతాను. కథల్లో నువ్వు వ్రాసేదంతా నిజమే నేమిటి?"

నాకు ఒళ్ళు మండింది. గబగబా యింటి లోపలికివెళ్ళి వెనుకాముందూ చూడకుండా పదిగీతలు గిలికి ఆ కాగితాన్ని తెచ్చి అరుగు పైన పడవేసి "నీకు పదివేల నమస్కారాలు శేషయ్యమామా! ఇకమీదట యిలాటి విజ్ఞ

త్తులు వ్రాసి పెట్టమని నన్ను బలవంత పెట్టకు" అన్నాను.

ఎదుటివాడు నొచ్చుకోడంతోగానీ, మెచ్చుకోడంతోగానీ ప్రమేయం పెట్టుకోని మనిషి ఆదిశేషయ్య! కాగితం చేతిలో పడగానే గబాలున పైకిలేచి తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు.

## 4

ఎవరోగానీ ఒక లోకజ్ఞుడు వంచనా శిల్పాన్ని గురించి నాలుగు మంచి మాటలు చెప్పాడు. కొందరిని ఎల్లకాలమూ ఏమరించవచ్చు. అందరినీ కొంతకాలం ఏమరించవచ్చు. అందరినీ ఎల్లకాలమూ ఏమరించడం అసాధ్యం."

ఆదిశేషయ్య కొంతకాలంపాటు అందరినీ మోసగించాడు. ఎలా బయటపడిందో గానీ అతడి కుతంత్రం బయటపడింది. ఇలాంటి వాడు కమ్మలకు బయటవుండడం లోకానికి ఉపద్రవకరమని భావించి పోలీసులు ఆదిశేషయ్యను తమ 'కస్టడీ'లోకి తీసుకున్నారు. ఒకటి రెండు రోజుల్లో ప్రాథమిక చర్యలన్నీ ముగించి, లోకుల్ని దగా చేశాడన్న నేరం క్రింద ఎక్కడా ఓటుగానీ బీటుగానీ లేకుండా అతడిపైన కేసును రూపొందించారు.

ఒక్క తులసమ్మత్త తప్పితే ఈ పరిణామాన్ని గురించి చింతించే నాథుడే లేకపోయాడు. కేసు జరుగుతున్నప్పుడు జామీను నిలిచి అతణ్ణి విడిపించుకునే ఔదార్యం మానవమాత్రుడికి ఎవడికీ లేకపోయింది! కడకతనికి న్యాయవాదిగానీ, సాక్షులుగానీ లేకపోయారు.

ఎలాగూ నీయిల్లు కాలిపోయింది. రెండు సంవత్సరాలపాటు ప్రభుత్వంవారికి అతిథిగా వుండి రమ్మన్నాడు న్యాయమూర్తి.

'రెండు సంవత్సరాలంటే ఎంత! కాలచక్రం రెండుసార్లు చుట్టితేచాలు! కాసుండగానే రెండేళ్ళు గడచిపోతాయిలె' అని తులసమ్మత్తను ఓదార్చడం నా దినకృత్యాల్లో ఒకటైపోయింది.

జైల్లోకి వెళ్ళి కూర్చున్న తర్వాత కూడా ఆదిశేషయ్య నన్ను పీడించడం మానలేదు. అప్పుడెప్పుడు స్వయంగా పీడించాడు. ఇప్పుడు భార్యద్వారా పీడిస్తున్నాడు!

"ఏం చేయమంటావు నాయనా! ముందే అబ్బనాకొరపుమనిషి! ఏమైపోయాడో ఏమిటో ఒకటే ఆరాటంగావుంది. ఆడదాన్ని. పుట్టి బట్టకట్టినప్పటినుంచీ పొరుగూరిముఖం చూచి ఎరుగనిదాన్ని. ఇప్పుడుకూడా పిల్లల్ని వెంటబెట్టుకుని నేను యిల్లుకదల్లేను. నువ్వయినా వెళ్ళి ఎలావున్నాడో చూచి రాకపోతే నాకు నిబ్బరం కలుగదు. బాబ్బాబూ, నీమేలు మరచిపోను. వచ్చి నీకడుపున బుట్టాను..."

చెవిలో యిల్లుకట్టుకున్న తులసమ్మత్త పోరుపడలేక జైలు అధికారులకొక విన్నపం వ్రాసి పంపుకున్నాను. వాళ్ళు ఖైదీని కలుసుకోడానికి అనుమతిస్తూ సమయాన్ని నిర్దేశించి నాకు తెలియజేశారు.

## 5

పాపానికి దండన తప్పదు. నేరానికి శిక్ష తప్పదు. పాపానికి దండన యమలోకంలో విధింపబడుతుంది. నేరానికి శిక్ష జైల్లో అమలుజరుగుతుంది. ఖైదీని కలుసుకోవడానికి జైల్లో ప్రవేశిస్తూ కొంచెం ఆత్మవిమర్శ చేసుకోవలసివచ్చింది. ఆదిశేషయ్య నేరంలో నా పాత్రకూడా ఏమాత్రమూ లేకపోలేదు. అతడి నేరానికి శిక్ష రెండేళ్ళు నా నేరానికి శిక్ష పదిహేను నిమిషాలు!

కమ్మలకు అటువైపున ఆదిశేషయ్య. ఇటువైపున నేను. దూరంగా చెట్టుక్రింద సాయుధుడైన పోలీసు.

ఆదిశేషయ్య ఎంతో ఒరుగైపోయాడు. జానెడుపొడుగు గడ్డంలో అతణ్ణి గుర్తుపట్టడమే దుస్తరమైపోయింది. ఈ వికారస్వరూపం చాలదన్నట్టు అతడికొక పొట్టి మరాయీ, గళ్ళబనీనూ తగిలించారు. ఈ వేషంలో అతడు 'విధి' అన్న చిత్రకారుడు వేసిన కార్టూను బొమ్మలా కనిపించాడు.

నన్ను చూడగానే ఆదిశేషయ్య కళ్ళలో కన్నీరు పెల్లుబికింది. పెదవులు ఎండుటాకుల్లా కంపించాయి. కంఠం గద్గదికమైపోయింది.

"ఊళ్ళో అందరూ బాగున్నారా?" శోకరుద్ధమైన గొంతుకతో అతడు ప్రశ్నించాడు.

"బాగానే వున్నారు శేషయ్యమామా! కానీ నువ్వుమాత్రం ఎముకలగూడైపోయావు. జరిగిందేమో జరిగిపోయింది. అందుకు చింతించి లాభంలేదు. ధైర్యం చిక్కబట్టుకోవాలి. తులసమ్మత్త నిన్ను తలచుకోని క్షణం లేదు. నువ్వామె కళ్ళల్లో మెదలుతున్నావట! బిడ్డలు నీకోసం బెంగ పెట్టుకున్నారని చెప్పమంది..." అన్నాను.

ఆదిశేషయ్య కారాగారనివాసంలోని క్లేశాలనుగురించి చెప్పకపోసాగాడు. ఆ తిండిని చూస్తే డోకొస్తుందట! ఆపని చేయలేక ఎముకలు నుగ్గునూచమైపోయాయట! రాత్రుల్లో దోమలూ, నల్లులు నిద్రపోనీయవట! ఆమధ్య ఒకసారి పదిరోజులపాటు జ్వరం ముమ్మరంగా కాసిందిట! "చచ్చినా బాగుండేది. మందులిచ్చి మళ్ళీ నన్ను బ్రతికించేశారు" అన్నాడు ఆదిశేషయ్య

"అదేంమాట శేషయ్యమామా! నువ్వు పోతే నీబిడ్డలేంగావాలి? తులసమ్మత్త గతేం కావాలి?" అన్నాను.

"నిజమేరాబాబూ నిజమే! వాళ్ళను తలచుకుంటే నాగుండె చెరువైపోతుంది" కొంతాగంలాంటి అతడి గడ్డంలో కన్నీటి ధారలు కొండవాగుల్లా ప్రవహిస్తున్నాయి.

"టైమైపోతోంది. త్వరగా ముగించండి" బిగ్గరగా అరిచి చెప్పాడు పోలీసు.

"వెళ్ళొస్తాను శేషయ్యమామా!" అన్నాను.

"వెళ్ళొస్తావా! అప్పుడే! ఇదిగో బాబూ! ఉండుండు...ఒకమాట..."

తటపటాయించకుండా చెప్పమన్నాను.

"నాకేదైనా కలవస్తే అదితప్పకుండా పాటించుకొచ్చేది. మరి ఈ జైల్లో పడినప్పటినుంచీ ఒకేకల...ప్రతిరాత్రీ అదే కల..."

"చెప్పు శేషయ్యమామా! అప్పుడే ఒక నిమిషం ఆలస్యమైపోయింది" అన్నాను.

"ఇల్లు కాలిపోయినట్టు! అసలే నాది పూరికొంప! ఆపదానికి బిడ్డలకూ నిలువనీడకూడా లేకపోయిందేమోనని నాదిగులు"

నేను ఆదిశేషయ్యను ఎగాదిగా చూచాను. ఇతడు పాత ఆదిశేషయ్యగాడు. పాత ఆదిశేషయ్య తనలోని దానవునికి దాసుడై మానవుణ్ణి హతమార్చడానికి సాయశక్తులా ప్రయత్నించాడు. కానీ మానవుడు మొండివాడు. భూమిలో దాగొన్న బీజం తడిసోకగానే మొలకెత్తినట్టుగా అతడు అవకాశం దొరకగానే దుమ్ముదులుపుకుని పైకిలేచాడు ఆదిశేషయ్యలోని దానవుణ్ణి త్రోసిరాజని ఇలలో కాకపోతే నేమి, కలలోనైనా అతడు తనరాజ్యాన్ని స్థాపించగలిగాడు! ఇప్పటికీ పరిణామంచాలు! ఎప్పటికైనా మానవుడిదే విజయమని భావించడంలోగల ఆనందం అనుపమానమైంది. అట్టి ఆనందం నాకు మా శేషయ్యమామ జీవిత గాథ ద్వారా లభ్యమైంది! 

---

**అన్వేషణ**

ఒక ప్రొఫెసర్‌గారి భార్యను ఒక పక్కింటామె ఇలాఅడిగింది!

'ఏమండీ ప్రొఫెసరుగారు నిరంతరం చదువుతారు. ఆలోచిస్తారు. దేనికో అన్వేషణ?'

వెంటనే ప్రొఫెసర్ భార్య ఇలా జవాబిచ్చింది 'దేనికీ లేదమ్మా. తెల్లారింది మొదలు కళ్ళజోడు కోసంపొడుం డబ్బీకోసమూను,' అన్నది విసుగ్గా.

---

# ★ పెళ్లి ప్రయాణం ★

( 28వ పేజీ తరువాయి)

తెగించిపోతున్నారు." వేదాంతులు కళ్ళు మూసుకున్నారు.

ఏదయితేనా శేఖరం కోరికలు ఫలించాయి. అతని నాయకత్వాన మిత్రబృందం కార్యరంగంలోకి వురికింది. పెళ్లంతా తమ చేతుల మీదే జరిగి పోతుందన్నట్లు గోల ప్రారంభించారు. పెళ్ళికొచ్చిన బంధువులు వీళ్ల సందడి చూడ ముచ్చటగా వుందని మెచ్చుకున్నారు. పెళ్ళికి తరలివెళ్ళేరోజు వచ్చింది. పెళ్లికొడుకు స్నేహితులు మరీ కాకిగోల చేస్తున్నారని, ఈ గోల పెళ్లికూతురుగారి వూళ్లో కూడచేస్తే మనపరువు పోతుందని ఒక పెద్దమనిషి సూర్యం తండ్రి దగ్గర గుసగుసలాడాడు. ఆయన నవ్వి-"పోనీండి, కుర్రాళ్లు. వాళ్ల సరదాకి మనం అడ్డురకూడదు. అయినా మగపెళ్ళివారిలో ఆ మాత్రం చలాకీతనం లేకపోతే యెలా?" వచ్చిన పెద్దమనిషి మొహం పెసరట్టుమాడిపోయినట్టు మాడిపోయింది.

పెళ్లికూతురిది బందరు అనేసరికి శేఖరం పొరపాటు చేశాననుకున్నాడు. మంజులతని అడ్రస్ అడిగివుంచవలసింది. అయినా తనకేం తెలుసు? శుభలేఖలో బందరని లేదుగా! ఇదే సూర్యాన్నడిగితే—అతను జవాబు యిలా ఇచ్చాడు.

"అది మరీ పల్లెటూరురా! రాకపోకలకి సౌఖర్యంలేదు. అందుకని నాన్నగారు బందరులో చేయమన్నారు.

పెళ్ళి రేపనగా ముందురోజు రాత్రే అంతా బందరు చేరుకున్నారు. పెళ్లికొడుకంటే, బంధువులకంటే, అసలు వియ్యాలవారికంటే మధ్య ఈ పెళ్ళికొడుకు స్నేహితులకి మర్యాదలు చాలటంలేదు. 'చచ్చిపోతున్నాం పరుగులు పెట్టలేక'— బిగ్గరగానే విసుక్కున్నారు. శేఖరం వాళ్లు ఆ సణుగుడు విన్నారు. వినాలనే వాళ్లన్నారు. తాము వినాలని వాళ్ళు అన్నారు కాబట్టి శేఖరంవాళ్లు నవ్వుకున్నారు. పెళ్ళికొడుకు పక్క అబ్బాయిలేలా తక్కువలేరో పెళ్ళికూతురు పక్క అమ్మాయిలకిగూడ లోటులేదు. పెళ్ళిపెద్దయిన ప్రసాదు సూర్యానికి ముఖ్యస్నేహితుడు. అటుకూడ చుట్టరికం లభించినందుకు పెళ్ళికొడుకు స్నేహితులు పొంగిపోతూ-భుజాలు యెగరేశారు. వీళ్ళని చూస్తున్న అమ్మాయిల బృందం మూతులు ముక్కులు మూడు వంకర్లు తిప్పింది.

ఉదయం పది గంటలకి లగ్నం అయిపోయింది. పురోహితుడు సూర్యాన్ని భార్యని కూర్చోపెట్టి ఇంకా యేమిటో చేస్తున్నాడు. అగ్నిహోత్రం ముందు కూర్చున్న వధూవరులకి చెమటలు కారిపోతున్నాయి. ఇది గమనించిన ఒక స్నేహితురాలు ఒక విసనకఱ్ఱ తీసుకొచ్చి పెళ్లికూతురికి మాత్రం తగిలేటట్లుగా విసరసాగింది. సూర్యం నిస్సహాయంగా తన స్నేహితులవైపు చూచాడు. ప్రభాకరం చటుక్కునలేచి పక్కనున్న ఓ పెద్దమనిషి పైమీద వుత్తరీయం లాక్కొచ్చి సూర్యానికి విసరటం మొదలుపెట్టాడు. మొదట అంతా తెల్లబోయినా అసలు సంగతి గ్రహించి ప్రభాకరాన్ని, ఆ అమ్మాయిని యిద్దర్నీ పక్కకు రమ్మనమని మరో మనిషి చేత యిద్దరికీ గాలి వచ్చేటట్లు విసిరించారు. పెళ్ళంతా సూర్యం కోరికపై రీలుగా ఫోటో తీస్తున్నాడు శేఖరం. ఇంతలో 'పెళ్ళికొడుకు స్నేహితులకి ఆకలవుతోందట. అర్జంటుగా వున్నపళంగా కాఫీ టిఫెన్లు గావాలట'అని విడిదినుంచి కబురొచ్చింది. "యిప్పుడేం కాఫీలు! ఓ చెంపన భోజనాలకి లేవబోతుంటే" యెవరో బుగ్గన వేలుంచుకున్నారు.

"మగపెళ్ళివారు కదటమ్మా!, తాణాతి వాలు." తాటాకు విసనకఱ్ఱతో గబగబా విసురుకుంటున్న ఒక స్థూలకాయం చెమట తుడుచుకుంటూ అంది. అంతవరకూ వధూవరులదగ్గర కూర్చుని చూస్తున్న పెళ్ళికూతురు తండ్రి లేచి ఓ గదివైపుగా నడిచి-"అమ్మాయి మంజూ!" అని పిల్చారు. ఒకసారి తీసిన ఫోటోనే మరో కోణంనుంచి తీస్తున్న శేఖరం వులిక్కిపడి అటు తిరిగాడు. అప్పటికే ఆయన వంటనే కాఫీ వుప్మా పంపించమని చెప్పేసి తిరిగివచ్చి యథాస్థానంలో కూర్చున్నారు. బహుశా ఆగదికి లోపల ద్వారం వుందేమో! ఆ మంజులతాదేవి యెవరోయిటు మటుకు రాలేదు. శేఖర్ మళ్లా కెమెరా సరిచూసుకునే గొడవలో పడిపోయాడు.

"అన్యాయం! యింతకంటే అవమానం యింకోటిలేదు. యింత పరాభవానికి ప్రతీకారం చేయకుండా యెలా వూరుకునేది." భోజనాలయింతర్వాత అందరూ విడిదికి తిరిగివచ్చేసి పేకాటముందు కూర్చోబోతుండగా చంద్రం గుండెలు బాదుకున్నాడు.

ఇంతవరకూ బాగానే వుండి-ఇంతకుముందే నింపాదిగా సలక్షణంగా భోంచేసిన వీడికి ఇంతలోనే యేమయింది అన్నట్లు చూచాడు సూర్యం

"యేమిట్రా? యేమయింది ఎవరయినా అమ్మాయి నువ్వడిగింది వడ్డించలేదా!" పేకముక్కలు కలుపుతూ అన్నాడు శేఖరం.

'ఆదిగో గురూ-ఇందాక నిజంగానే ఎంతవమానం జరిగింది! మేమంతా కాఫీలు టిఫిన్లు కావాలని కబురెట్టలా? అప్పుడు-'

"అప్పుడు యేమయింది? పంపించారుగా" అన్నాడు శేఖరం.

'పంపించార్లే మహాలావ్!" ప్రభాకరం చేతులు తిప్పాడు.

'యేమయిందీ! అసలు సంగతి చెప్పండి మరి' అన్నాడు శేఖరం తనీ బృందానికి నాయకుడుగాబట్టి నిజంగా అలాటి అవమానం యేదయినా జరిగితే, తప్పకుండా ప్రతీకారం చేయాల్సిందే.

'యేముందిరా. అడిగిన అరగంటకి కాఫీ ఉప్మా పంపించారు. కాని కాఫీలో పంచదారలేదు. పైగా యేమిటో చప్పగా ఉంది. ఉప్మాలో ఉప్పు లేదు. పైగా ఆ పట్టించుకొచ్చినవాళ్లలో ఒకమ్మాయి 'మర్చిపోయారేమో! అయినా నిజంగా ఆకలుంటే అసలు రుచెందుకూ' అని చెప్పింది. ఒళ్ళు మండిపోయిందంటే నమ్ము. పైగా 'పోన్లెండి. మళ్ళీ మంచిది చేయించుకొస్తాం" అంటూ వెళ్ళింది. మళ్లా అయిపులేదు. ఈలోగా భోంచేశాం.

"మర్చిపోయారేమోనిజంగానే" నవ్వుతూ అన్నాడు సూర్యం.

'మాడు, చూడు! అప్పుడే మూడుముళ్ళుపడి మూడుగంటలుకూడా కాలేదు. యెలా వెనకేసుకొస్తున్నాడో!! వెంకట్రావు కన్నుగీటాడు.

అయితే వాళ్ళు తెస్తే వెర్రిమొహాల్లాగా మాకీ కాఫీ బాగాలేదు. మళ్లా తెండి' అని వాళ్లని బతిమలాడుకున్నారన్నమాట. ఇంకా పైగా మళ్ళీ కన్పించలేదంటారేం. తెలివిగలవాళ్ళు వాళ్ళు."

"మరేం చెయ్యమంటావురా!" యేడుపు మొహంపెట్టాడు ప్రభాకరం. అసలు చెప్పకుండావుంటే బాగుండేదేమో అనుకుంటూ.

"యేడవమంటాను. ఆ మాత్రం తెలీట్రా. కాఫీలో పంచదార వుప్మాలో వుప్పు రెండూ ఒక్కసారి యెందుకు మర్చిపోతారని ఆ మాత్రం గ్రహించలేకపోయారన్నమాట- వాళ్లు కావాలని మర్చిపోయారని స్పష్టంగా కన్పిస్తుంటే. ఎప్పుడైతే నీకు అనుమానం తగిలిందో వెంటనే "అబ్బే! యెందుకండీ! యిప్పుడే భోజనాలకి లేవబోతున్నాం అనే సంగతి మాకు తెలియక కబురుపంపాం వద్దండీ! మీ వాళ్ళకే యెవరికయినా పెట్టండి' అంటే బాగుండేది' శేఖరం తెలివికి అంతా మెచ్చుకున్నారు. ఆ సమయంలో అతనే అక్కడుంటే యెంత బాగుండేది అనుకున్నారంతా-

[మిగతా వచ్చేవారం]

# నక్షత్ర ఫలితాలు

**[5-8-59 మొదలు 11-8-59 వరకు]**

గ్రహ స్థితి.

| | | | |
|---|---|---|---|
| కే | | | |
| | కర్కాటక, సింహ, కన్యా తులలలో చంద్రుడు. | | ర బు |
| | | | శు కు |
| శ | గు | | రా |

*** అశ్విని [చూ, చే, చో, లా] ***

ఈ వారము ఎంత ప్రయత్నించినా అనేక ఆటంకములు కలుగుతవి. సాహసము పట్టుదల కలవారగుటచే నిరాశ చెందక ప్రయత్నించి కలిగిన చిక్కులను విప్పుకొని మేలు పొందుతారు. సోదర సహాయమువల్ల ఒడుదుడుకులు సర్దుకొంటారు. జాగ్రత్తగా వుండడంవల్ల అవయవములకు దెబ్బలు తగిలే ప్రమాదము తప్పవచ్చును. గనుల యజమానులకు భూగర్భశాస్త్రజ్ఞులకు లాభం, ఖనిజ వ్యాపారస్తులకు, పోలీసుశాఖ ఉద్యోగులకు కష్టముతో కూడిన యోగము.

*** భరణి [లీ, లూ, లే, లో] ***

మీరు ధైర్యముతో వృత్తి ఉద్యోగాలలో ముందంజవేసి, హోదా ఆదాయము పెంచుకుంటారు. క్రొత్త అనుకూలతలు ఏర్పడుతవి. మీ బుద్ధికుశలతవల్ల ఉపద్రవాలు సాధించుతారు. మీరు వేసుకున్న పథకము ప్రకారము అన్ని విధాలా డబ్బు చేతికి అందుతుంది. మనుష్య సహాయముకూడా కలుగుతుంది. మాట పలుకుబడితో పరిస్థితులలో అనుకూలమైన మార్పులు తెచ్చుకొనగలుగుతారు. ఈశాన్యదిక్కునుంచి బంధువుల క్షేమవార్త తెలుస్తుంది గణితశాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, చిత్రకారులకు, నటీనటులకు యోగకాలము.

*** కృత్తిక [అ, ఈ, ఊ, ఏ]**

ఈ వారము మీకు యోగప్రదము, అవకుండా నిలిచిపోయిన కార్యములు ఈ వారము శుభముతో ముగుస్తాయి. అధికారముతో పాటు ధనాదాయముకూడా పెరుగుతుంది. బిరుదులు పొందుట, సన్మానమువంటి శుభయోగములు కలవు. పండితగోష్ఠి, నూతన గ్రంథములు చదువుటచే విజ్ఞానాభివృద్ధి కలుగుతవి. పిల్లల మేలుకొరకు మీరు కొన్ని యేర్పాట్లు చేస్తారు. వర్తకులకు లాభయోగము, న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, ఉపాధ్యాయులకు, పండితులకు మేలుకాలము.

***రోహిణి [ఓ, వా, వీ, వూ] ***

ఈ వారము లౌకిక వ్యవహార రంగములో మీకు చాలా జయప్రదముగా వుంటుంది. ఆదాయము ఎక్కువ అవుతుంది. నీటిమీద ప్రయాణము చేయవలసి వుంటుంది. కవితాగోష్ఠి, గానసభలు మున్నగు వినోదములలో బంధుమిత్రులతో కలిసి శుభకార్యములలో పాల్గొని మృష్టాన్న భోజనము చేస్తారు. బియ్యము, వెండి, నూలు, బట్టలు, వ్యాపారస్తులకు లాభము. కవులకు, గాయకులకు,

**బి. నరసింగరావు**

కళాకారులకు, నటనటులకు యోగకాలము. వారమంతా శుభయోగముతో కూడివున్నా మానసిక ఆందోళన కలుగుతూ వుంటుంది.

*** మృగశిర [వే, వో, కా, కీ] ***

ఈ వారము మీకు ఇష్టకార్యసిద్ధి, ధనధాన్యవృద్ధి, వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, యత్నకార్యానుకూలత, పరోపకారమువల్ల కీర్తి, వాహనయోగములు కల్గుతయి. విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకులాభము కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. ఇంట్లోవారికి అలంకార ప్రాప్తి.

*** ఆర్ద్ర [కూ, ఖ, జ, ఛ] ***

ఈవారము మీకు కార్యభారముఎక్కువ, రాబడి తక్కువ. గృహావసరములు తీరక కలతలు, అకాలభోజనమువల్ల ఆరోగ్యము చెడుచున్న సూచనలు కనపడగానే ఔషధ చికిత్సపొందడమే కాకుండా గ్రహరాజైన రవికి శాంతి చేయించుటమేలు. ఉద్యోగస్తులకు క్రొత్తసమస్యలు వర్తకులకు ఆందోళన రాజకీయవాగులకు అశాంతి తప్పట. శివ పితృవర్గ సహాయము ధనలాభము ప్రయాణము. 7 న అనారోగ్య సూచనలు.

*** పునర్వసు [కే, కో, హా, హీ] ***

ఈవారము మీకు మిశ్రమయోగము. మొదట్లో మీకు నిరాశగావున్నా మిత్రసహాయమువల్ల కార్యలాభము పొందుతారు. ధన లోపమువల్ల ఆందోళన. ఉద్యోగస్తులకు ఏమంతబాగుండదు. విద్యార్థులకు బద్ధకమువల్ల చదువు బాగాసాగదు. అప్తుల ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. వారములో అవయోగములున్నా మిత్రసహాయము కార్యసిద్ధి విదేశీయుల పరిచయము, విచిత్రవస్తువుల సంపాదనవంటి మంచి యోగములుకూడా వుంటాయి.

*** పుష్యమి [హూ, హే, హో, డా] ***

ఈవారము మీరు సహాయము పొందదలచుకున్న వ్యక్తివలనగా కార్యహాని పొందుతారు. ధనాభావముకూడాఎక్కువ. ఇంట్లో వారి ఆరోగ్యము సరిగా వుండనందున చింత కలుగుతుంది. అయినా ఆధ్యాత్మికభావము కలవారగుటచే దైవముపై భారమువేసి కార్యలాభము పొందుతారు. ఉద్యోగస్తులకు ఒత్తిడి, వర్తకులకు నిరాశ. విద్యార్థులకు మంచిరోజులుకావు. పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము, విచిత్రములను చూచుట, నష్టద్రవ్యలాభము కలుగును. వారమంతా అవయోగ శుభయోగమిశ్రమముగా వుంటుంది.

*** ఆశ్లేష [డీ, డూ, డే, డో] ***

ఈవారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. ప్రయత్నించిన కార్యములు ఎక్కువ శ్రమతో ఫలిస్తాయి. కోర్టు దావాలు అనుకూలిస్తవి. ఇతరులకు చేయదలచుకున్న సహాయము చేయలేకపోవుటచేతను నిందలు పొందుతారు. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ. తోటివారి సహకారము కలుగుతాయి. వర్తకులకు వారమంతా నిరాశగావున్నా వారాంతమున మేలుపొందుతారు. విద్యార్థులకు చదువు బాగా సాగదు. 7 న భార్యకు అనారోగ్యం కలుగుటచే ఆందోళన.

*** మఖ [మా, మీ, మూ, మే.]**

ఈవారము ఎన్ని ఆటంకములు వచ్చినా పట్టువిడువకుండా ప్రయత్నించి కార్యలాభము పొందుతారు. అనుకున్న సొమ్ము సమయానికిరాక అప్పు చేస్తారు. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు లోహ, ఖనిజ వ్యాపారస్తులకు కష్టముతోకూడిన లాభము గనుల యజమానులకు, యంత్రములు నడుపు నిపుణులకు, ఇంజనీరింగుశాఖ ఉద్యో

 

# నక్షత్రఫలితాలు



గులకు మేలుకాలము. 7 న ప్రమాదసూచన.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### [మో, టా, టీ, టూ,]

గత రెండు వారములనుండి కలుగుచుండిన కష్టములుగడిచి అధికారుల సహాయముచేతను, మీ నేర్పరితనముచేతను కార్యసిద్ధి పొందు



తారు. ఆర్థికస్థితి బాగుపడుతుంది. వారమంతా యోగప్రదముగా వుంటుంది. ప్రయాణము, అధికారుల ఆదరణ, బంధుసహాయమూ కలుగుతవి. విద్యార్థులకు మేలుగా వుంటుంది. డాక్టర్లకు, గణితశాస్త్రజ్ఞులకు, కవులకు, చిత్రకారులకు, శిల్పులకు, నటీనటులకు యోగకాలము. 9 న అధికఖర్చులు.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### (టే, టో, పా, పీ)

ఈ వారము అన్ని ఇబ్బందులు తీరుతవి. అనుకున్నసొమ్ము చేతికి వస్తుంది కోర్టు దావాలు అనుకూలముగా తీర్పు అవుతవి. పిల్లల మేలుకొరకు కొన్ని యేర్పాట్లు చేస్తారు. నూతనకార్యారంభము చేస్తారు. ప్రభుత్వసన్మానము కలుగుతుంది. పండితులతో శాస్త్రగోష్ఠి జరిపి జ్ఞానము వృద్ధి చేసుకుంటారు. విద్యార్థులు శ్రద్ధతో కొత్త విషయాలు నేర్చుకుంటారు. వారమంతా యోగదాయకము. 7 న ఆందోళన కలుగుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుపడుతుంది. పండితులకు, ఉపాధ్యాయులకు, న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగస్తులకు మేలుకాలము.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము మీకు యోగదాయకమైనను మానసికాందోళన కలుగుతుంది. నీటిమీద ప్రయాణముచేస్తారు. బంధుమిత్రులతో కలిసి కవితాగోష్ఠి, గానసభలవంటి వినోదాలలో పాల్గొంటారు. దూరముంగున్న ఆప్తుల క్షేమవార్త తెలిసి సంతోషం పొందుతారు. నూలు, బట్టలు, బియ్యము, వెండి వ్యాపారస్తులకు వారమంతా లాభదాయకముగా వుంటుంది. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. శుభకార్యములలో పాల్గొంటారు.

### *చిత్త [పే, పో, రా, రీ]*

గతవారము పూర్తికాకుండా ఉండిపోయిన పనలు ఈ వారము లాభకరముగా చేయకలుగుతారు. ధనయోగము అనుకున్నదానికన్నా ఎక్కువగా కలుగుతుంది. పుణ్యకార్యాచరణలో పాల్గొంటారు. విలువగల వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు లాభము కలుగుతుంది. ఉద్యోగస్తులకు అధికారము పెరుగుతుంది. స్త్రీలతోనూ, బంధువులతోనూ కలిసి విందు, వినోదములతో ఆనందిస్తారు. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము.

## ఈవారము ధరలు:

నూలు, బట్టలు:- నిలకడగా వుండును.

నూనెదినుసులు:- కొంచము తగ్గును.

ఆహారధాన్యములు: — స్వల్పముగా పెరుగును

బెల్లము, పంచదార, చింతపండు:- కొంచము పెరుగును.

పప్పుదినుసులు:- కించిత్తు పెరుగును.

వెండి, బంగారము:- స్వల్ప తేడాలో వుండును.

మధ్య వృష్టి కలుగును.

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మనక్షత్రము నెరుగనివారు నామనక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటియక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడనే పేరునకు మృగశిరా నక్షత్రమును, హృషీకేశుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడనే పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భార్గవుడు అనే పేర్లకు పూర్వాషాఢయునూ చూచుకొనునది.

### * స్వాతి [రూ, రే, రో, తా]*

ఈవారము యత్నకార్యములకు ఆటంకములు. కార్యభారము ఎక్కువ. తీరుబడిలేని కార్యక్రమమువల్ల అకాలభోజనము చేయుటచే ఉష్ణాధిక్యము, కడుపునొప్పివంటి అనారోగ్య సూచనలు కనపడగానే ఔషధ చికిత్స పొందుట మేలు. వర్తకులకు శ్రమ ఎక్కువ. ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడిచే శలవు పెట్టవలసి వస్తుంది. రాజకీయవాదులకు మేలుగా వుంటుంది. పితృవర్గము నుండి సహాయముచే ధనలోపము కొంత తీరుతుంది.

### * విశాఖ [తీ, తూ, తే, తో] *

ఈవారము నిరాశగా వుంటుంది గాని మిత్రసహాయంవల్ల క్రమేణా కార్యలాభము పొందుతారు. రహస్యములను కనిపెట్టుటకు ప్రభుత్వముచే నియోగించబడుతారు. ధనలోపమువల్ల ఆందోళన ఉద్యోగస్తులకు బదిలీఅయే యోగములున్నవి. వర్తకులకు మాంద్యము. విద్యార్థులకు శ్రద్ధతక్కువ. ప్రయాణము విదేశీయులతో పరిచయము, వింతవస్తువుల సంపాదన, కార్యసిద్ధి కలుగుతాయి ఇంట్లోవున్న వృద్ధుల ఆరోగ్యము చెడుటచే ఆందోళన కలుగుతుంది.

### * అనూరాధ [నా, నీ, నూ, నే] *

ఈవారము మీరు అనుకున్నట్లు పనులు జరుగవు. ధనాభావముచే ఇబ్బంది ఎక్కువ. ఏ వ్యక్తి సహాయమువల్ల పనులు చేయదలుచుకున్నారో అతనే ఆటంకములను

కలుగజేస్తాడు. ఆధ్యాత్మికచింత కలవారగుటచే ఈశ్వర కృపవల్ల కష్టములను గడిచి కార్యసిద్ధి పొందుతారు. ఇంట్లో వారి ఆరోగ్యము ఆందోళన కలిగించుతుంది. ఉద్యోగస్థులకు ఒత్తిడి, వ్యాపారస్థులకు నిరాశ కలిగినా నష్టద్రవ్యలాభము కలిగిస్తుంది. సాధుసజ్జన సాంగత్యముచే ఆత్మవిశ్వాసము కలుగుతుంది.

### * జ్యేష్ఠ [నో, యా, యీ, యూ,] *

ఈ వారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. రావలసినడబ్బు చేతికందక అశాంతి బంధువుల రాకపోకలవల్ల ఖర్చులు ఎక్కువ. కోర్టు వ్యవహారములు కొంతవరకూ అనుకూలిస్తవి. పరులకు చేయవలచే సహాయము చేసేందుకు అవకాశములేక మాట పడతారు. ఉద్యోగస్థులకు కొత్త సమస్యలవల్ల కార్యభారము ఎక్కువ. వర్తకులకు వ్యవహారముపట్ల పేచీలు. 7 న భార్య అనారోగ్యమువల్ల మనోవ్యథ విద్యార్థులకు బద్ధకముచే చదువుబాగా సాగదు.

### * మూల [యే, యో, బా, బీ] *

మీ ఆలోచనలు కార్యరూపమునకు వచ్చేందుకు కలిగే ఆటంకములకు నిరుత్సాహ పడకుండా పట్టుదలతో ప్రయత్నించి తుదకు కార్యసిద్ధి పొందుతారు. సమయానికి సొమ్ము అందక అప్పు చేయవలసి వస్తుంది. కాని వారాంతమునకు తీరుస్తారు. 7 న యంత్రములవల్ల గాని, అగ్నివల్ల గాని ఎత్తయిన స్థలములనుండి పడుటవల్ల గాని కలిగే గాయాలు జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు లోహపు సామానులు, రంగుల వ్యాపారస్థులకు గనుల యజమానులకు కష్టముతో కూడిన యోగము ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు యంత్రములు నడుపు ఉద్యోగులకు యోగకాలము.

### * పూర్వాషాఢ [బూ, ధ, భా, డా] *

ఈ వారము మీకు ధనయోగము. వ్యవహారాలలో జయము. శుభకార్యాలలో పాల్గొంటారు. బంధుదర్శనము. విద్యాప్రాప్తి, నూతన కార్యలాభము. ఈశాన్యదిక్కునుండి శుభవార్తతో ఉత్తరములువచ్చుట, జ్ఞానమార్గ ప్రసంగములు, యుక్తిగా ప్రసంగించుట, గణితజ్యోతిష శాస్త్ర చర్చలు; సుఖభోజనము వంటి మంచి ఫలితాలే కలుగుతాయి. ప్రత్తి, దూది, నూలు, వస్త్రములు, ఇత్తడి, కంచు మొదలగు సరుకుల వ్యాపారస్థులకు లాభము. కవులకు, చిత్రకారులకు, శిల్పులకు, నటీనటులకు మేలుకాలము. విద్యార్థులకు చదువు సరిగా సాగుతుంది.

### * ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ] *

ఈ వారము శుభకార్యములలో పాల్గొనుట, పుత్రప్రాప్తి సూచనలు, ధనలాభము. భాగ్యవృద్ధి, బిరుదులు పొందుట, ప్రభుత్వ సన్మానము, ఘనకార్యాచరణ, పుణ్యకార్యములు చేయుట, పుణ్యక్షేత్ర సంచారము, వైద్యజ్యోతిషశాస్త్ర ప్రసంగములవంటి మంచియోగములు కలుగును. విద్యార్థులకు పండితులకు న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు మంచికాలము.

### * శ్రవణము [జూ, జే, జో, ఖా] *

ఈ వారము మీరు వినోదాలలో పాల్గొంటారు. బంధుమిత్రులతో కలిసి వెండిపాత్రలలో దధి, క్షీర మధురపదార్థయుక్త సుఖభోజనము చేస్తారు. నీటిమీద ప్రయాణము, తలపెట్టిన కార్యములలో జయము, తెల్లని వస్తువులు కొనుటవంటి మంచియోగములు కలుగును. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, ద్రవపదార్థ జన్యముల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. ఈ వారము మానసికాందోళనవున్నా అలంకారప్రాప్తి, విందువినోదములు కలుగును. కవులకు, గాయకులకు, నటీనటులకు మేలుకాలము. విద్యార్థులు బాగాచదువుకుంటారు.

### * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈ వారము ధనధాన్యవృద్ధి, పశువృద్ధి కలుగును. కష్టమే ఫలించును. వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, ఇష్టవస్తులాభం, పరోపకారమువల్ల కీర్తి మొదలగు రాజయోగములు కలుగును. విద్యార్థులు వినోదాల్లో పాల్గొన్నా చదువు బాగాసాగుతుంది. వర్తకులకు బంగారము, నవరత్నములవంటి విలువగల వస్తువుల క్రయవిక్రయములలో లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలం.

### * శతభిషం [గో, సా, సి, సూ] *

ఈ వారము మీకు కార్యభారము ఎక్కువ. ఆరోగ్యము సరిగాలేని సూచనలు కనపడగానే గ్రహారాజైన రవికి శాంతి చేయుటవల్ల మేలుకలిగించును. ఔషధ చికిత్సకూడా పొందుట మంచిది. ఉద్యోగస్థులకు కొత్తసమస్యలు, వర్తకులకు ఆందోళన, విద్యార్థులకు సరిగా చదువు సాగదు. పితృవర్గమునుండి సహాయము, ప్రయాణము. కార్యభారము కలుగును. 7 న ఆరోగ్యభంగము. రాజకీయవాదులకు ఆందోళన అధిక ఖర్చులు.

### * పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] *

ఈ వారము అనుకున్న సొమ్ము సకాలములో చేతికిరాదు. కార్యాచరణకు పాలుపోని అనిశ్చిత స్థితిలో వుంటారు. చేదామనుకున్న పనులకు ఆటంకములు కలిగినా వారాంతమునకు మిత్రసహాయమువల్ల కార్యలాభము కలుగుతుంది. ఉద్యోగస్థులకు వన పర్వత ప్రాంతములకు బదిలీ అయ్యే సూచనలున్నవి. ప్రయాణము, విదేశీయుల పరిచయము, విచిత్రవస్తు సంపాదన, మిత్ర సహాయము కలుగును. 5 న ఆప్తుల ఆరోగ్యము గురించి చింత, విద్యార్థులకు చదువుబాగా సాగదు.

### * ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] *

ఈ వారము మీకు మిశ్రమయోగము. అనుకున్నట్టుగా పనులు జరుగవు. కోరిన సహాయము సకాలమునకు లభించదు. అవసరములు తీరక ఆందోళన కలుగుతుంది. దైవముపై భారము వేసి కార్యసాధనకు ప్రయత్నించి ఫలముపొందుతారు. వర్తకులకు చాలా కాలమునుండీ నిలిచిపోయిన బాకీలు వసూలవుతవి. వ్యర్థ ప్రసంగములవల్ల ఉద్యోగస్థులు అధికారుల ఆగ్రహమునకు లోనౌతారు. పుణ్యపురుషుల సాంగత్యము, ఆత్మవిశ్వాసము, శాంతి, పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము, నష్టద్రవ్య లాభము కలుగును. 9 న ఇంట్లో వారి అనారోగ్యముచే చింత.

### * రేవతి [దే, దో, చా, చీ] *

మీ ఆలోచన ప్రకారము కార్యక్రమాలు నెరవేరడానికి కొందరు అడ్డు వస్తుంటారు. కొన్ని సందర్భములలో అశాంతి, బంధువిరోధము వచ్చును. కోర్టు దావాలు అనుకూలముగా తీర్పు అయినా మరి కొన్ని కొత్త చిక్కులు కలుగుతవి. కొర్రలు, రాగులవంటి అపరదినుసులు, మినుములు, ఉప్పు, నువ్వులు, నూనె, సంబంధముగు వస్తువులు వర్తకులకు లాభము. అన్యజాతి వారివల్ల గౌరవము కలుగుతుంది. 7 న భార్యకు అనారోగ్యము, అధిక ఖర్చులు. ★

లేదో, దూర్వాస మహాముని వచ్చాడు. అప్పుడే బ్రాహ్మణులంతా భోజనాలు చేయడానికి ప్రారంభించారు. మునికి కోపం వచ్చింది. అందులో దుర్వాసుని కోపం సంగతి వేరే చెప్పాలా? రాజును ముని పరిపరివిధాల తిట్టాడు. రాజు వినమ్రుడై ముని తిట్టిన తిట్లన్నిటినీ సహించాడు. ఆఖరుకు రాజు, మునిపాదాల మీద పడి "మహాత్మా, నేను భోజనం చేయలేదు. జలపానం చేశాను. భోజనం చేస్తే మీకు కోపం, చేయకుంటే మహావిష్ణువుకు కోపం, నన్నేమి చేయమంటారు?" అని అడిగాడు. దుర్వాసుడు రాజుమాటలు వినిపించుకోకుండా, తన కాలితో తన్ని "నివు ఈ జన్మ తర్వాత పది జన్మలు ఎత్తెదవు గాక" అని శపించి వెళ్ళిపోబోయాడు. రాజు "ఓ ముని శ్రేష్ఠా మీరిచ్చిన శాపాలను అనుభవిస్తాను" అన్నాడు. అప్పుడు రాజు కంఠము మారింది. ఇంతలోనే విష్ణుచక్రము దూర్వాసుని చంపడానికి వచ్చింది. దూర్వాసుడు దానిని చూచి భయపడి పారిపోయాడు. అన్నిలోకాలు తిరిగాడు. కాని ఏ దేవత గాని రక్షింపలేక పోయింది. ఆఖరుకు శివుడు కూడ రక్షింపలేకపోయాడు. తుదకు దూర్వాసుడు విష్ణులోకానికి వెళ్ళి, మహావిష్ణువు పాదాలమీద వ్రాలాడు. విష్ణువు, దూర్వాసుని లేవనెత్తి చిరునవ్వు నవ్వుతూ "మహామునీ, నీవుగొప్పవాడివే కాదని నేను చెప్పలేను. కాని నీలో బ్రాహ్మణులకుండవలసిన ఓర్పు లేదు. నీవు, అంబరీషుడు నాకు ప్రియులు. అంబరీషుడిలో తప్పు లేదు. అతడు నీళ్ళను మాత్రమే త్రాగాడు. నీటిని త్రాగి

# నీ కెన్నేళ్లో చెప్పనా?

[ఇది తమాషా అని తెలుసు,
తెలుసు నాకు నీ వయసు ]

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 4 | 8 | 16 | 32 |
| 3 | 3 | 5 | 9 | 17 | 33 |
| 5 | 6 | 6 | 10 | 18 | 34 |
| 7 | 7 | 7 | 11 | 19 | 35 |
| 9 | 10 | 12 | 12 | 20 | 36 |
| 11 | 11 | 13 | 13 | 21 | 37 |
| 13 | 14 | 14 | 14 | 22 | 38 |
| 15 | 15 | 15 | 15 | 23 | 39 |
| 17 | 18 | 20 | 24 | 24 | 40 |
| 19 | 19 | 21 | 25 | 25 | 41 |
| 21 | 22 | 22 | 26 | 26 | 42 |
| 23 | 23 | 23 | 27 | 27 | 43 |
| 25 | 26 | 28 | 28 | 28 | 44 |
| 27 | 27 | 29 | 29 | 29 | 45 |
| 29 | 30 | 30 | 30 | 30 | 46 |
| 31 | 31 | 31 | 31 | 31 | 47 |
| 33 | 34 | 36 | 40 | 48 | 48 |
| 35 | 35 | 37 | 41 | 49 | 49 |
| 37 | 38 | 38 | 42 | 50 | 50 |
| 39 | 39 | 39 | 43 | 51 | 51 |
| 41 | 42 | 44 | 44 | 52 | 52 |
| 43 | 43 | 45 | 45 | 53 | 53 |
| 45 | 46 | 46 | 46 | 54 | 54 |
| 47 | 47 | 47 | 47 | 55 | 55 |
| 49 | 50 | 52 | 56 | 56 | 56 |
| 51 | 51 | 53 | 57 | 57 | 57 |
| 53 | 54 | 54 | 58 | 58 | 58 |
| 55 | 55 | 55 | 59 | 59 | 59 |
| 57 | 58 | 60 | 60 | 60 | 60 |
| 59 | 59 | 61 | 61 | 61 | 61 |
| 61 | 62 | 62 | 62 | 62 | 62 |
| 63 | 63 | 63 | 63 | 63 | 63 |

ఇక్కడ ఆరు వరుసల్లో అంకెలు ఉన్నాయి. మీ స్నేహితుని పిలిచి "ఏమోయ్! నీ వయస్సు అంకె ఏయే వరసల్లో ఉందో చెప్పు. రెండో వరసలో ఉందా, మూడో దానిలో కూడా ఉందా, నాలుగో దానిలో కూడా ఉందా?" అని ఇలా ఏయే వరసల్లో ఉందో అడుగు. ఉదాహరణకి రెండు, మూడు, నాలుగు వరసల్లో తన వయస్సు ఉందన్నాడనుకోండి. అప్పుడు గబుక్కున రెండు, మూడు, నాలుగు వరసలపైనున్న మొదటి అంకెలు-అంటే, 2, 4, 8 కలపండి. 14. అతని వయస్సు 14 అన్నమాట. 14 అనే అంకె రెండు మూడు నాలుగు వరసల్లో తప్ప ఇంకే వరసలోనూ ఉండదు. అలాగే 63 ఏళ్ల దాకా ఎవరి వయస్సయినా ఈ పద్ధతిలో చెప్పుకోవచ్చు.

# ★ దశావతారాలు ★

సందువలన తప్పులేదు. అది నీవు గ్రహించక అతనిమీద కోపించావు. అంబరీషుడు తనది తప్పన్నట్లు నీ పాదాలమీద పడ్డాడు. నీవు ఓర్పు వహించక అతనిని శపించావు. నీ శాపాలను అతడు అనుభవించడము ఇష్టంలేక, నేను అనుభవిస్తానని అతనిలో ప్రవేశించి నేను చెప్పాను. అప్పుడు అంబరీషుడి కంఠము మారింది. అది గ్రహించావా?" అని అన్నాడు. దూర్వాసుడు తను శపించిన శాపాలను విష్ణువు భరిస్తాడని వినేసరికి వణికిపోతున్నాడు. అప్పుడు విష్ణువు మునిని చూచి "దూర్వాసా, భయపడవద్దు, నీ శాపాలను నేను లోకకళ్యాణానికై అనుభవిస్తాను. వాటినిగురించి నీకు చెప్తాను. ఇప్పుడే స్నానము చేసి వస్తాను, వుండు" అని చెప్పి, తనపైనున్న నగలను, వస్త్రాలను విప్పుతున్నాడు. అప్పుడు విష్ణు గుండెపై దూర్వాసునికి తనపాదం కన్పించింది. దానిని చూచి తాను తన్ననది అంబరీషుని కాదని, విష్ణునని గ్రహించి, మళ్లీ విష్ణు పాదాల మీద పడ్డాడు. విష్ణువు అది గ్రహించి "మహాముని, తపస్సంపన్నులు దేవుని తన్నినా పర్వాలేదు. మహామునులు కూడ దేవునితో సమానులు" అని పల్కి, స్నానానికి వెళ్ళాడు. ఎంత సేపయినా రాలేదు. దూర్వాసునికి ఓపిక నశించింది. విష్ణువు మీద కోపం వచ్చింది. కాని కోపంవలన ఇంతవరకు జరిగిన సంగతి జ్ఞాపకం వచ్చి, కోపాన్ని పైకి ప్రదర్శించలేకపోయాడు. కొంత సేపటికి విష్ణువు స్నానం చేసి వచ్చాడు. దూర్వాసుడు "దేవా, మీరు స్నానం చేసి వచ్చేటంత లోపల మీరు ఆలస్యము చేస్తున్నారని నాకు కోపం వచ్చింది. విసుగు కూడ పుట్టింది. అదే విధంగా నేను స్నానం చేసి వచ్చేసరికి అంబరీషుడికి కూడ కోపం, విసుగు కలిగాయేమో నని ఆలోచిస్తున్నాను." అన్నాడు. విష్ణువు, దూర్వాసునితో "లేదు మహామునీ, అంబరీషుడు కోపం చెందలేదు. మన ఇద్దరి తృప్తికోసం జలపానం చేశాడు" అన్నాడు. మహావిష్ణువు, దూర్వాస మహాముని ఈ విధంగా మాట్లాడుకొంటుండగా, అంబరీషుడు అక్కడికి వచ్చాడు. దూర్వాసుడు రాజుని చూచి తన తప్పును క్షమించమని వేడుకున్నాడు. రాజు "నేను కాదు క్షమించేది. అన్నిటికీ ఆ సర్వేశ్వరుడే" అంటూ విష్ణు పాదాలకు నమస్కరించాడు. విష్ణువు జరిగినదంతా అంబరీషుడికి చెప్పి, ఇద్దరినీ తనవెంట తీసుకొనిపోయాడు. ముగ్గురూ ఒక ఏకాంతప్రదేశంలోకి ప్రవేశించారు. ముని "స్వామీ, తమరి దశావతారాల సంగతి చెప్పండి" అన్నాడు.

"నేను మొదట మత్స్యముగా రెండవ సారి కూర్మంగా, తర్వాత వరాహము, నరసింహము, వామనుడు, పరశురాముడు, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, బుద్ధుడు ఈ విధంగా తొమ్మిది అవతారాలు ఎత్తి కలియుగాంతంలో కల్కి అనే పేరుతో పదవఅవతారంఎత్తుతాను. ఈదశావతారాలలో ఒక్కొక్క అవతారంలో ఒక్కొక్క రాక్షసుడిని చంపి, లోకోద్ధరణ గావిస్తాను." అని విష్ణువు చెప్పాడు. అంబరీషుడు, దూర్వాసుడు విష్ణువుకు నమస్కరించి తమ తమ ఇండ్లకు బయలుదేరారు. దూర్వాసుడు మాత్రం తనశాపాలు ఈ విధంగా మారాయని సంతోషించి, నిట్టూరుస్తూ తనఆశ్రమానికి వెళ్లిపోయాడు.



మనవి



గత వారం సంచికలో "పాదుపు" కథ వ్రాసినవారు "తాతినేని" అని గమనింప ప్రార్థన.

## చప్పున చెప్పుకోండి!

(1) అమెరికాలో నేటి ముఖ్యనగరం పేరు నాటి మహాయోధుడు.

(2) టిక్కట్టు కొనకపోతే రైల్లో అటువంటిదే తప్పదు.

(3) మామిడిపండ్లలో ఒక మొగల్ చక్రవర్తి.

(4) వారపత్రికలో కనిపించే 'తేడా'.

(5) సిటీల్లో ఇది ఎప్పుడుపడితే అప్పుడు, ఎక్కడపడితే అక్కడ.

(6) పాతాళభైరవిలో ఒకలోకం, ఒకవృక్షం, ఒకరాగం, ఒక ముఖ్యగోళం ఉన్నాయి.

# యాజులు తెలివి

పూర్వం ఓ ఊళ్లో గున్నయ్య అనే ఓ వర్తకుడు ఉండేవాడు. అతడు అంతా ఇంతా ధనవంతుడు కాదు. ఎంతో ధనవంతుడు! ఇనప్పెట్టె బందిఖానాలోంచి విముక్తి లేని రూపాయలు చేసేదిలేక ఆ చీకటికొట్లో మూలుగుతూండేవి! గున్నయ్యకి కానీ సంపాదించడంమీద ఉండే ఆసక్తిలో కానీ దానం చేద్దాం అనే ఉదారబుద్ధి వెయ్యోవంతు లేదు. కాని ఒక్కగుణం మంచో, చెడో ఉంది. ఎవరేనా వొచ్చి నోరారా కానీ ధర్మం అడుగుతే మెడపట్టుకు బైటకు గెంటే గున్నయ్య ఎవరేనా వచ్చి అతడిని పొగడ్తలతో ఆకాశానికెత్తేస్తే గాలిబుంగలా మనిషి పెరిగిపోయి గాలిలో తేలిపోయేవాడు. తేలిపోయి ఆ పొగిడినవాడికి అడక్కుండా అర్ధో పదో చేతులోపెట్టి పంపించేవాడు. కాని ఆవూరి యాచకులకి అతడంటే అసహ్యం! "ఛీ ఛీ అలాంటి తుచ్ఛపు వెధవని పొగిడి డబ్బు రాబట్టుకోవడమా? ఛీ! అలాటి దుర్మార్గుణ్ణి పొరపాటునేనా ఇంద్రుడూ, చంద్రుడూ అంటే మహాపాపం!" అని అసలు యాచనకి గున్నయ్య దగ్గఱకే వెళ్ళేవారు కారు.

ఇలా ఉండగా యాయవారంలో ప్రసిద్ధికెక్కిన యాజులు ఆ ఊరు చక్కావచ్చేడు చిన్న పనిమీద.

ఏదో మాటల సందర్భంలో అతనికి గున్నయ్య సంగతి తెలిసింది.

"ఓస్! ఇంతేనటయ్యా! అతగాణ్ణి పొగిడే డబ్బు గుంజుదాం!" అన్నాడు యాజులు అందులో తప్పేం లేదన్నట్లు.

"ఛీ! ఛీ! వాణ్ణి పొగుడుతే పంచమహాపాతకాలూ చుట్టబెట్టుకుంటాయ్!" అన్నారు అంతా.

"మరేం చుట్టబెట్టుకోవు! నే పొగుడుతాగా!" అని భరోసా యిచ్చాడు యాజులు.

అంతా ఆశ్చర్యపోయారు. ఈ యాజులు గున్నయ్యకి గడ్డిపెట్టేటట్టున్నాడే, దేవాంతకుడు! అని సంతోషించారు.

ఆ మర్నాడు సూర్యోదయానంతరం యాజులు మరో యిద్దఱు బ్రాహ్మణులని తనతో తీసుకుని షావుకారు గున్నయ్య ఇంటికి

'భావశ్రీ'

వెళ్లేడు. ఆ సమయానికి గున్నయ్య తన బంతిలాంటి శరీరాన్ని గోడకి ఆన్చి హాయిగా విశాలంగా అరుగుమీద కూర్చుని ఉన్నాడు.

"నమస్కారం షావుకారుగారూ!" అన్నాడు యాజులు గున్నయ్యకి కొద్దిదూరంలో కూర్చుంటూ.

"నమస్కారం. ఏం ఇలా దయచేశారు?" కాస్త పెడసరంగా వాళ్లు వచ్చినపని తానప్పుడే ఊహించినట్లు అడిగేడు.

"చిత్తం! చిత్తం! తమ దర్శనం చేసుకుందామని!" యాజులు చిన్నగా నవ్వుతూ అన్నాడు. మిగిలిన ఇద్దరు బ్రాహ్మణులూ అయోమయంగా చూస్తూ కూర్చున్నారు.

"అలాగా! అయితే వచ్చిన పనేమిటో చెప్పండి!" కాస్త విసుగ్గా అన్నాడు గున్నయ్య.

"అన్నన్న ఎంతమాట! మీరు విసుగుపడితే ఎట్లా? మీ గుణగణాలూ గట్రా విని వచ్చేం! మీరెక్కడ?"

"పితృసమానులు! సహజసౌందర్య సంపన్నులు! నారాయణుడంటివారు! రికమెండేషన్లు చేయని మహానుభావులు! విఱగని మనస్సు కలవారు! అలాంటివారు మీరే" అంటూ ఏకబిగిని పాఠం వప్పజెప్పినట్లు అప్పజెప్పేయగానే గాలితో నింపిపోయిన రబ్బరు బుడగలా తేలిపోతూ గబగబా లోపలికెళ్ళి ఓ పదిరూపాయల నోటుతెచ్చి యాజులు చేతిలో పెట్టేశాడు గున్నయ్య. గున్నయ్యకి లేని గుణాలన్నీ కల్పించేడేమిటా అని ఆశ్చర్యపోతున్నారు ఇద్దరు బ్రాహ్మలూ.

"ఏది బాబూ! ఇందాక మీరు చెప్పినవన్నీ మళ్లా ఒకసారి చెప్పండి!" పొగడ్తలంటే పెసరట్టు తిన్నంత సంబరపడే గున్నయ్య కోరికని కాదనలేక యాజులు మొదటినించి మళ్లా క్రమంలో అన్నీ చెప్పి... ఉన్నట్టుండి చివరికి "నే చెప్పినవాటి మొదటి అక్షరాలు తీసుకుని వాక్యం చేయండి బాబూ...వస్తా... శెలవ్!" అంటూ ఇద్దఱు బ్రాహ్మల్ని తీసుకుని చక్కాపోయారు.

గున్నయ్య ఉబికివచ్చే ఆనందంలో మొదటి అక్షరాల్ని పేర్చసాగేడు. "పి...స...నా...రి...వి!"

కొయ్యబారిపోయాడు షావుకారు గున్నయ్య!

యాజులు ఆపాటికి అరవైమైళ్ళ దూరంలోఉన్న తన ఊరి బస్సులో కూర్చుని కండక్టరుకి పదిరూపాయల నోటు అందిస్తున్నాడు టికెట్ కోసం!

## బాలల సంఘం

# కొందరు సభ్యుల పేర్లు

అద్దంకి ఫణి సంజీవస్థపత్ (సంగం జాగర్లమూడి, గుంటూరుజిల్లా) పరశురామపురం శ్యామల (ఏలూరు, ప. గో. జిల్లా) డి. కృష్ణమూర్తి (కర్నూలు) చేవెండ్ర హైమావతిదేవి (పాటిమీద, కృష్ణాజిల్లా) అడిదము విజయలక్ష్మి (కౌటూరు కృష్ణా జిల్లా) కొండోళ్ళ నరసింహారెడ్డి (మేలుమాయి, చిత్తూరుజిల్లా) చిలకమర్రి విజయలక్ష్మి (విజయనగరం విశాఖజిల్లా) చిలకమర్రి అతివేలు మంగతాయారు (కలపర్రు ప. గో. జిల్లా) గవ్వాని వెంకట సుబ్రహ్మణ్య గంగాధరశాస్త్రి (కాకినాడ తూ. గో. జిల్లా) చివుకుల సాయిరవేంద్ర ప్రసాద్ (గుంటూరు) బుద్ధవరపు కామేశ్వరి (పాలమూరు తూ. గో. జిల్లా) కస్తూరి శ్రీరామమూర్తి (రాజమండ్రి, తూ గో. జిల్లా) కస్తూరి శ్రీ విజయలక్ష్మి (రాజమండ్రి, తూ. గో. జిల్లా) చిల్లర రంగారావు (సికింద్రాబాదు) కమ్మల రామచంద్రరావు (ఏలూరు, ప. గో. జిల్లా)

నడిమింటి విశ్వనాథరావు (విశాఖపట్నం) యస్. శేషు (సికింద్రాబాదు) గాదేపల్లి శోభారాణి (కాళహస్తి, చిత్తూరుజిల్లా) సాధనాల మీన కుమారి (విశాఖపట్నం) చింతామణి భట్ల లక్ష్మీబాయి (జంషెడ్ పూర్) గూడిపూడి వెంకటరమణమూర్తి (శ్రీకూర్మం, శ్రీకాకుళం జిల్లా) మల్లాది చిన్న వీరాస్వామి (పాతగుంటూరు) తట్టికోట ఈశ్వర వెంకట అప్పారావు (సాలూరు, శ్రీకాకుళంజిల్లా) పావులూరి ప్రభావతి (గోవాడ, గుంటూరుజిల్లా) వై. జానకి (వరంగల్) యం. శారద (జగిత్యాల, కరీంనగరంజిల్లా) గుజ్జారి మధుసూదనరావు (విజయవాడ) మాడుగుల విజయలక్ష్మి (అల్లినగరం, శ్రీకాకుళంజిల్లా). పి. రవిబ్రహ్మ (బెల్లంపల్లి) కోరిటాల ప్రభాకరరావు (పొనుగుపాడు, గుంటూరుజిల్లా) వర్ధినేడి రామసత్యనాగభూషణ వీరరాఘవరావు (నారాయణపురం, ప. గో. జిల్లా) తుమ్మలపల్లి హేమలతాదేవి (గురజాడ, కృష్ణాజిల్లా) కంగుమూరి రత్నమాల (రాజమండ్రి, తూ. గో. జిల్లా) గొల్లపూడి వెంకటసరోజిని (జగ్గయ్యపేట, కృష్ణాజిల్లా) తిమ్మా లలితాకుమారి (విశాఖపట్నం.)

ఆకెళ్ల సత్యవతి (విశాఖపట్నం) మేడేపల్లి వెంకటకృష్ణ వేణిసాయిమణి (నరసన్నపేట, శ్రీకాకుళంజిల్లా) కోసరాజు రాఘవేంద్ర ప్రసాద్ (తురుమెళ్ళ, గుంటూరుజిల్లా) బి. నరసింగరావు (పులివెందుల, కడపజిల్లా) నీలి నారాయణరావు (టెక్కలి, శ్రీకాకుళంజిల్లా) ఉలిమిరి ఉమామహేశ్వరమ్మ (విశాఖపట్నం) కొత్తూరి రాజేశ్వరరావు (అమలాపురం, తూ. గో. జిల్లా) మాడభూషి విజయబాబు (తెనాలి, గుంటూరుజిల్లా) పి. ఆనందకుమార్ (రాజమండ్రి తూ. గో. జిల్లా) గోవిందరాజు రవిచంద్రబాబు (విజయవాడ) పెమ్మరాజు వెంకటసత్యప్రసాద్ (బాడిపార, రాయపూర్) సి. ప్రభాకర్ రావు (నాగర్ కర్నూల్, మహబూబ్ నగర్ జిల్లా) తనిగంటి ముక్తి గోవిందయ్య (కాళహస్తి, చిత్తూరుజిల్లా) గౌరిపెద్ది దుర్గా మల్లేశ్వరశర్మ (జనగామ, వరంగల్ జిల్లా) చన్నావఝుల పూర్ణచంద్ర ప్రసాదు (జనగామ, వరంగల్ జిల్లా) పిడింటి రామతీర్థ (రాజమండ్రి, తూ. గో. జిల్లా) కొనకొల్లు లక్ష్మీనారాయణరావు (పాతనెమ్మికూరు, కృష్ణా జిల్లా) జి. రాధ (గుంటూరు) జి. వి. యస్. కృష్ణశర్మ (గుంటూరు) బి. అంజనాదేవి (హైదరాబాదు.)

ఎం. నరసింహాచారి (హైద్రాబాదు) పెండ్యాల అన్నపూర్ణ (సికింద్రాబాద్) కంటాలక్ష్మి జనార్దన (కాకినాడ) రాళ్ళపోలు నాగమల్లికార్జున శర్మ (గుంటూరు) పాలమడ చెన్నకేశవులు (తాడిపత్రి అనంతపురంజిల్లా) ఆచంట లక్ష్మీనరసింహారావు (పూనా) జయంతి శాంతి స్వరూపనరసింహం (హైద్రాబాదు) పిన్నమనేని రాంబాబు (విజయవాడ) అకుల ఇందిరమ్మ (తాడిపత్రి అనంతపురంజిల్లా) జి. పార్థసారథి (కాళహస్తి చిత్తూరుజిల్లా) శాఖమూరి శోభ (హనుమకొండ వరంగల్లుజిల్లా) మద్దాలి రామచంద్రరావు (విజయవాడ) ఆచంట లలితా కుమారి (పాలకొల్లు ప. గో. జిల్లా) రాయల హేమలత (ఉల్లిపాలెం గుంటూరు జిల్లా) చట్టి రమాదేవి (విజయనగరం) ఎల్. వెంకటేశ్వరరావు (విజయవాడ) అంబటిపూడి కామేశ్వరరావు (మద్రాసు) ఎమ్. జాన్సీ లక్ష్మీబాయి (గిద్దలూరు) మహంకాళి శ్రీనివాసశాస్త్రి (ఖమ్మంమెట్టు) ముద్దల శ్రీదేవి (టికాబల్లి ఒరిస్సా.)



రంగుల రాట్నం-16 వాల్ట్ డిస్నీ




"నీతో ముందే చెప్పాను. చిలకలు విన్న ప్రతిదాన్ని మళ్ళీ అనవు."








(గతవారం తరువాయి)

అల్లకల్లోలంగా కనిపించే ప్రపంచం నిజస్వరూపం, అందులో వస్తువుల గమనవిధానం మనకి అర్థంకానప్పుడు, అర్థమైనంత మేరకే మనకి కనిపించినంతవరకే "రాయి ఎగరదు నీరు ప్రవహించును, గోళీకాయమీద గుర్రం నిలబడలేదు, చెవిని గిల్లినచో నొప్పిపుట్టును" అని సిద్ధాంతాలు తయారుచేసుకొని, రాయీ నీరూ, గుర్రం, చెవీ అవి చెప్పినట్టు విననప్పుడు సూత్రాలకు మినహాయింపులు రాకుమని సర్దుకుంటాం. అలా సర్దుకోనకపోవటం, ఇదంతా దగాలా అబద్ధం తప్పా కాలేనిది, అంటూ దేవతావస్త్రాల కథలోని రాజుగారు పంచె కట్టుకోలేదని అరచిన పసిపిల్లాడిలా గావుకేక పెట్టడం మార్క్స్ బ్రదర్స్ పద్ధతి.

సిద్ధాంతాలన్నిటినీ చిత్తగొట్టి ఈ ప్రపంచంలో, కొండంటే మా ప్రపంచంలో కథ కమామిషూ ఇవీఅని చెప్పి చిత్రం వచ్చినట్టు అల్లరిచెయ్యటం వాళ్ల జెండా. మనకంట్లో తెరమీద మనం చూసేవాటి బొమ్మలన్నీ తలక్రిందులుగా పడతాయనీ వాటని మనం మళ్లీ తిర్లమా చేసుకుంటామని శాస్త్రజ్ఞులు ప్రకటించారు. మార్క్స్ బ్రదర్స్ సినిమా జగతి ఈ సిద్ధాంతాన్ని చిత్తగొడుతుంది. అది అపసవ్యంగా ఉంటుందని తెలిసి, వాళ్లింగ్ ఉంచినాడా దాన్ని మనం సవ్యం చేస్తుగా చేసుకోలేము. చూస్తున్న కాసేపూ అదే మనని మింగేసి, గ్రూచో, చికో, హార్పోలుగా అనుకరించేస్తుంది. గ్రూచో మాటలవేగం, హార్పో చికోల చేష్టలవేగం సుడిగాలిగా వచ్చి మనని చుట్టుముట్టి విపరీతమైన వేగంతో ఎగరేసుకుపోతాయి. అందులో సాధ్యాసాధ్యాలు లేవు. హార్పో జేబులోంచి కూజు కప్పులు వేడికాఫీ దగ్గర్నుంచి ఏది పెడితే అది తీసేస్తాడు. అర్జెంటుగా ఎక్కడికేనా పోవాలంటే జేబులోంచి సైకిలుతీసి అందుమీద ఎక్కి వెళ్లిపోతాడు. 'ఇఫ్ విషెస్ వర్ హార్సెస్' అన్న ఇంగ్లీషు సామెతని అక్షరాలా నిజంచేసి, మనలోని అన్ని కోరికలనూ గుర్రాలుచేసి సవారీచేస్తారు వాళ్లు. మనం అసహజం అనుకున్న దానికి, అతిసహజమైన రూపకల్పన చేసి అది సహజమైనట్టు నటిస్తూ నవ్విస్తుంటారు. మనకి గ్రూచో మీసం, కళ్లజోడు హార్పోవిగ్గూ అవీ పచ్చి అబద్ధాలుఅని తెలిసినా అంతకన్నా కఠోర సత్యాలు లేవంటారు.

మనం వాళ్లని చూసి నవ్వబోతే వాళ్లు మనని చూసి తెల్లబోతారు. ఇందులో నవ్వేందుకేముంది అని. ఈ విషయంలో అధివాస్తవికవాదులకన్న అతివాస్తవికవాదులు వీళ్లే అనిపిస్తుంది. గోళీకాయమీద నిలబడి కదుపుతున్న గుర్రం బొమ్మ మనకి అర్థంకాకపోతే ఆశ్చర్యపడతాను సర్రియలిస్టు. మనని మాయ చాలించి తొడుక్కోడా వాళ్ళలా పకపక లేచినా మనం హర్షించలేము. కారణం వాళ్లది పూర్తిగా వ్యక్తిగతమైన భావన. 'వసకాయంత వెర్రి' అనిపిస్తుంది. అర్థం కానివాడికి ఆభావాన్ని వాళ్లు మనలో కలిగించలేరు. అందుకే సర్రియలిస్టులం. అలా దీన్ని మనము హర్షించగలిగితే అది మార్క్స్ బ్రదర్స్ మార్కు అవుతుంది.

* * *

డక్ సూప్ అనే చిత్రంలో మార్క్స్ బ్రదర్స్ ఇద్దరు ఒక్కలాగే వేషం వేసుకుని ఒక ద్వారందగ్గర ఎదురుబొదురుగా తటస్థపడతారు. ద్వారబంధం నిలువుటద్దము ఎదురుగా ఉన్నది నా ప్రతిబింబమేనా? వాడెవడు నేనెవడు వాడునిజమా? నేనబద్ధమా, నేను వాడి ప్రతిబింబాన్నా అని భంగారుపడి మనని భంగారు పెట్టేస్తారు. ఆ యిద్దరు రజ్జు సర్ప భ్రాంతిని ఇంకో స్థాయిలో ఇంతగొప్ప అనువాదం చేసిన కళాకారులు అరుదు. ఇది హాస్యనటుడికే సాధ్యం అవుతుంది. వాళ్లలో మార్క్స్ బ్రదర్స్‌కే సాధ్యం వుతుంది.

ఇంకో చిత్రంలో ఒక దుష్టుడిని, కోడి ఈకల డస్టర్ (గుమ్మ గుడ్డ పేడి)ను పిస్తోలులా చూపించి ఆయ్ అని గద్దిస్తాడు హార్పో. ఆ దుష్టుడు వాడు కంగారులో అది పిస్తోలే అని భ్రమపడి చేతులు పైకెత్తేస్తాడు. మనమంతా ఈ ట్రిక్కు చూసి అర్జెంటుగా పకలబడి నవ్వేస్తాం కాని నవ్వు పూర్తి అయేలోగా ఆ పిస్తోలే పేలుతుంది. ఈ సారి ఏం చేసేవట్టు, దేన్ని చూసి నవ్వేటట్టు? ఏది

# ★ అన్వేషణ ★

(31-వ పేజీ తరువాయి)

తెలియజేసింది రాణి. రెడ్డిరావు మేముండగా నీకు ఉద్యోగానికేమిలోటు...రేపే కనుక్కొని చెబుతా!" అన్నారు కొలరు లీవిగా తిప్పుతూ. ఇటువంటి మనుష్యుల పరిచయాలు చాకచక్యంగా ఉపయోగించుకోవాలనుకుంది రాణి. కనిపించినంతవరకు రెడ్డి, రావు రాణివైపు ఖులాసాగా చూస్తూ వెళ్ళిపోయారు.

మరియమ్మ వంట ప్రయత్నంలో వంటింట్లో ఉండిపోయింది.

ఇంట్లో తుడుపులు, కడుగులు పూర్తిచేసుకుని నడుంఒరిగిన నరసవ్వ తనయింటికి పోదామని బయలుదేరింది. వీధి అరుగుపై ఒంటరిగా ఏమీతోచక నిలుచున్న రాణి నరసవ్వను ఆపి కబుర్లు పెంచింది. ఊరుకోని నరసవ్వ తన జీవితచరిత్ర, చుట్టుప్రక్కల వారి భోగట్టా, చూసిన సినిమాలు తాను జీవితంలో నేర్చిననీతులు, చివరకు జీవితం ఎప్పటికైనా కాటిలో భస్మమైపోయేదే కనుక అది కలలా కనిపిస్తుందనే తన భావం, తన అమ్మమ్మదగ్గర నేర్చుకున్న వేదాంత జావళీలు వరుసగా ఏకరువు పెట్టింది నరసవ్వ. సామాన్యసంసారస్త్రీలు చిన్నతనంలో తల్లితండ్రుల అదుపులోను తర్వాత భర్త రక్షణలోను, గౌరవంగా నాల్గుగోడలమధ్య బ్రతికే జీవితానికి వారికి దూరంగా ఉండే బాహ్యవాతావరణంలో ఏ రక్షణలేక సంఘం యొక్క కర్కశ కృత్రిమ ప్రవర్తనలకు బలియై పొట్ట పోషించుకునే అలల జీవితానికి ఉన్న వ్యత్యాసం ఆధునిక యుగంలో సంక్లిష్టమౌతున్న నాగరికతతో నిమిషనిమిషం మారిపోతున్న కుటుంబ సంప్రదాయాలలో వ్యక్తిగత భావాలలో పదిరెట్లు ఇనుమడించినట్లు స్ఫురించింది రాణికి.

నరసింగం లెదర్ బేగ్ ఊపుకుంటూ రిక్షాలో దిగాడు ఇంటిముందు. రాణి ఆశ్చర్యపోయింది. విజయ యీ సాయంత్రం కూడా బైటికి వెళ్ళిపోయినందుకు మళ్ళీ యీ రాత్రి ఎటువంటి రభస జరుగుతుందో అని భయంతో అలజడి చెందింది.

"ఏం రాణీ! వీధిలో కూర్చున్నావు!" నవ్వుతూ నరసింగం లోపలికి వెళ్ళిపోయాడు మేడమీద తనగదిలోకి. అతని పదాలశబ్దం స్వరం విన్న మరియమ్మ కంగారుగా వంటింట్లోంచి వచ్చి తొట్రుపాటు సర్దుకుని, ముసిముసి నవ్వులు నవ్వింది.

మేడమీదనుంచి 'విజయా' అని కేక పెట్టాడు నరసింగం.

'రాణీ! ఏం కావాలో నువ్వు మాడమాశి ఉత్త కోపిష్టి!"

రాణిని మేడమీదకు పెట్టింది. మరియమ్మ ఆ పరిస్థితిలో మరోమార్గంలేక, నరసింగం ప్రవర్తనపై భయంతో మెల్లిగా మేడమెట్లు ఎక్కి నిలుచుంది.

'ఏం కావాలి?' లేని ధైర్యం తెచ్చుకుని పలకరించింది రాణి.

'కావలసినవన్నీ నువ్వు యివ్వగలవా ?' ఒక్కసారి రాణివైపు తీక్షణంగా చూసి పకపక నవ్వేశాడు నరసింగం "కాఫీ...ఉంటే లేకపోతే మంచినీళ్ళు తెచ్చిపెట్టు!" తాపీగా నెమ్మదిగా తలఒంచుకున్నాడు నరసింగం.

రాణి మంచినీళ్ళు తెచ్చి మేడమీద పెట్టి మేడమెట్లు దిగబోయింది.

నరసింగం పిలిచాడు ఆమెను.

"ఎలా కూర్చో!" కుర్చీ చూపించాడు నరసింగం.

మౌనంగా, భయంతో, బెదురుతున్న కళ్ళతో కూర్చుంది రాణి.

'నేను దెయ్యాన్ని కాదు...మనిషినే!' నరసింగం నవ్వాడు. రాణికికూడా నవ్వు వచ్చింది.

"నీకో ముఖ్యవిషయం చెప్పాలని పిలిచా. వీళ్ళిద్దరు తల్లీకూతుళ్ళు కారని నా అనుమానం. గుంటూరులో విజయతో పరిచయం కలిగింది ఒకరింట్లో పెళ్ళిలో...భోగం మేళంలో...పదివేల ఆస్తి దీనిపరం చేశాను. విశ్వాసఘాతకురాలు...నువ్వు ఎల్లా ఈ యింట్లోకి వచ్చావో తెలియదు—కానీ జాగ్రత్త. నిన్ను చూస్తే అమాయకత్వం ఉట్టిపడుతున్నట్టుంది...మంచితనంగా యీ సంగతి నీకు చెప్పాను...తర్వాత నీయిష్టం!" నరసింగంలేచి లుంగీకట్టుకుని, తెల్లచొక్కా తొడుక్కుని, మెడకు మఫ్లర్ చుట్టుకుని, అందంగా తలదువ్వుకుని లేచి నిలబడ్డాడు.

"ఈనాటితో యీ యింట సంబంధాలు తెంచుకోదల్చుకున్నాను...విజయమీద చూపిన శ్రద్ధాసక్తులు నా భార్యాపిల్లలమీద చూపించి ఉంటే. నేనెంతో హాయిగా ఉండేవాణ్ణి...భార్యకు కళ్ళుగప్పి, వ్యాపారం పేరుతో యీ నగరంలో ఉంటూ నాశనమైపోయాను." నిట్టూర్చాడు నరసింగం. తలవంచుకుని గబగబ మెట్లు దిగివెళ్ళిపోయాడు నరసింగం.

మనుష్యులను పూర్తిగా అర్థం చేసుకోవడం చాలా కష్టమనిపించింది. క్రూరత్వం బాహ్యంగా ఆకారంలో ఉట్టిపడే నరసింగంలో మంచితనం కూడా ఉందని గ్రహించుకుంది రాణి.

"రైలు అందలేదా?" వెళ్ళిపోతున్న నరసింగాన్ని ప్రశ్నించింది మరియమ్మ. అతను సమాధానమియ్యలేదు. పెదిమలు విరుచుకుని, బుజాలెగరేసి, వక్రంగా నవ్వింది మరియమ్మ.

చెదిరిన జుట్టుతో, చికాకుగా కోపంగా ఒంటిమీద మఫ్లర్ లేకుండా రివ్వున ఇంట్లో అడుగుపెట్టాడు నరసింగం రాత్రి పన్నెండు గంటలకు. బయట ఈదురుగాలి జోరుగా రివ్వున విసురుతోంది. కీచురాళ్లు అరుస్తున్నాయి. చీకటిలో, విద్యుద్దీపాల వెలుగు నీడల్లో నిలుచున్న పాత కొంపలు, స్మశానంలోని పాతబడిన సిమెంటు సమాధుల్లా గోచరించాయి.

మరియమ్మ ఆరాత్రి నిద్రపోలేదు. నరసింగం మళ్ళీ విజయరాగానే రభస చేస్తాడనుకుంటోంది. అతనురాగానే లేచి తలుపు తీసింది.

'విజయ ఏదీ?!' ఇంట్లో అడుగుపెడుతూనే నిర్లక్ష్యంగా ప్రశ్నించాడు నరసింగం.

'ముందు భోజనం చెయ్యండీ!' నమ్రతగా అల్లుణ్ణి ఆహ్వానించినట్లు మర్యాదగా చేతులు నలుపుకుంటూ నిలుచుంది మరియమ్మ!

"భోజనం!......కడుపునిండా భోజనం అయిపోయింది. ఈవేళమాత్రం ప్రత్యేకంగా మనశ్శాంతికలిగించే నిండు భోజనం దొరికింది!" వ్యంగ్యంగా హేళనగా పకపక నవ్వుతూ, ఒక్కసారి భయంకరంగా గర్జించి మేడమెట్లు ఎక్కిపోయాడు నరసింగం.

రాత్రి విజయ ఇంటికి రాలేదు.

గదిలో సామాన్లన్నీ మూటగట్టి బయట పెట్టాడు నరసింగం. మర్నాడు ప్రొద్దున, వీధిలోకిపోయి టాంగా తీసుకువచ్చాడు. ఒక పెట్టె, బెడ్డింగు, రెండు గోనెసంచులు, సామాను, టాంగా ఎక్కాయి.

మరియమ్మ ఆశ్చర్యంగా కళ్ళు తేలేసి నిలుచుంది నరసింగం వైపు చూస్తూ. "ఇదే ఆఖరి నమస్కారం...మళ్ళీ మీ ముఖాలు చూడను!" నరసింగంవదనం కోపంతో ఎర్రబడిపోయింది.

'బహుశా...!' ఏదో అనబోయి మళ్ళీ ఆలోచనతో ఊరుకున్నాడు.

రాణికి మౌనంగా నమస్కరించి టాంగా ఎక్కి కూర్చున్నాడు నరసింగం. ఆ ఎగుడు దిగుడు గతుకుల రోడ్డు నరసింగం జీవితాన్ని జ్ఞప్తికి తెచ్చి టాంగాలో తీవ్రంగా కుదిపేసింది అతన్ని.

మరియమ్మ నరసింగాన్ని ఆపదల్చుకోలేదు. ధనంలేని నరసింగం ఇంక తమకు పనికిరాడని, నిర్ణయించుకుంది మరియమ్మ. ఈ విషయం విజయ అంగీకరించి, మరో అండ కోసం ప్రయత్నంలో ఉంది. అందుకే గతరాత్రి యింటికి రాకపోయి ఉండవచ్చునని నిర్ధారణ చేసుకుంది మరియమ్మ!

(—ఇంకా వుంది)

# వనితాలోకం



## కాలదోషం పట్టిన ప్రవచనాలు 2

# "ఆడది ఉద్యోగాలు చేయనా, ఊళ్లేలనా?"

వయసు మళ్ళిన ముదితలు కొందరు, నేటి విద్యావతి అయిన గృహిణినిగురించి ముచ్చటించుకొనగా వినడం తటస్థించింది. నేటి నాగరిక స్త్రీ, చక్కని గృహిణిగా రాణించలేక పోతూందని, తన కుటుంబానికి గాని, భర్తకుగాని, సహజమయిన ఆనందాన్ని అందివ్వలేకపోతూందని, వారు వాపోయారు.

ఈలాటి భావన సాధారణంగా ప్రతి అమ్మమ్మకి వుంటుంది. అయితే ఏ విషయం పైనన్నా ఒక అభిప్రాయం యిచ్చే ముందు, అందుకు సంబంధించిన అన్ని విషయాలు క్షుణ్ణంగా అవగాహన చేసుకుని, ఒక అభిప్రాయానికి రావడం ధర్మం.

కాలంతోపాటు మార్పు ప్రకృతి సిద్ధం. 50 ఏళ్ళ క్రితం వుండే స్త్రీ జీవితానికి, నేటి స్త్రీ జీవితానికి చెప్పలేనంత తేడా వుంది. ఈనాడు ప్రజల జీవనంలోనే బ్రహ్మాండమైన విప్లవం వచ్చింది. అందుకు సర్దుకుని పోయే శక్తి అవసరం. ఈ మహాపరిణామంలో జీవనస్థాయి చాల పెరిగిపోయింది. పాత పద్ధతిలో, ఒక్క పురుషుడు ఆర్జించడం, మిగతా కుటుంబం యావత్తూ అతని ఆర్జనమీద నే ఆధారపడ్డం ఈనాడు సరిపోదు. అటువంటివారు, ఆనందం అంటే ఏమిటో మర్చిపోతారు. ఆనందించాలనీ సుఖపడాలని ప్రతి జీవి కోరుతుంది అదిపొందడానికి ప్రయత్నం చేయడం సహజం. సుఖపడడం అందరి జన్మహక్కు.

కాలంతోపాటు నాగరికత, అంగుతో పాటు మానవుడి కోరికలు బాగా వృద్ధి పొందాయి. తను తను ఊహాలలో వుంటున్న కోరికలు తీర్చుకోవాలని అందరికీ వుంటుంది. సంపన్న గృహిణులు సౌఖ్యాలను డబ్బుతో కొనగలరు. మరీ క్రిందితరగతి స్త్రీ కష్టించి పనిచేసి, అందులోనే తృప్తిపడుతుంది. గాని ఎటువచ్చి, మధ్యతరగతి సంసార స్త్రీకి వచ్చింది చిక్కు. గాని ఈ సమస్యనికూడ చాలవరకు "విద్య" పరిష్కరించింది. కనీసం మెట్రిక్యులేషను పేసయిన సంపన్న గృహస్తులు ఈనాడు ఉద్యోగులపైపు మొగ్గుతున్నారు. అంతేకాదు. ఏమాత్రం చదువుకున్నా, కష్టించి ఉద్యోగంచేసి, భర్తకి చేదోడు వాదోడుగ వుండడానికి అనేకులు కృషిచేస్తున్నారు. కుటుంబ భారం అంతా ఒకేఒక్క పురుషునిపై వదిలేయ్యడం అన్యాయం అని మనసారా భావిస్తున్నారు. శక్తివున్న ప్రతిజీవి కష్టించి పనిచెయ్యాలి; లేకపోతే మానవశక్తి వృధాపోతుందని పోల్చుకున్నారు. ఈనాడు స్త్రీల దృక్పథమే వేరు. సమిష్టి కుటుంబంలో వుండడానికి నేటి స్త్రీ ఇష్టపడదు. తన కూడ కష్టపడి, భర్త ఆర్జన తనఆర్జన కలిపి తను స్వతంత్రంగా వుండడానికే చూస్తుంది నేటి గృహిణి.

జీవన ప్రమాణం విపరీతంగా పెరిగివున్న నేడు, భార్య గౌరవప్రదంగా భర్త ఆర్జనకు తోడుపడడం చాల అవసరం. నేడు స్త్రీ ఉద్యోగం చేస్తుందని హేళనచెయ్యడం శుద్ధ తెలివి తక్కువ. అలా హేళనగా చూసేవారు, వాస్తవ పరిస్థితులను అర్థంచేసుకోలేరని చెప్పాలి. వారు ఆదృక్పథం మార్చుకోవాలి. కారణం తమ తమ కూతుళ్ల ముందు జీవనం నేటి కాలమున పరిస్థితుల దృష్ట్యా ఆలోచించాలి. గాని సీత, సావిత్రులను నేటి స్త్రీలతో సరిపోల్చడం ఎంత బేసబబు! ఆకాలం ఈకాలం కాదు; ఈకాలం ఆకాలం కాదు. మార్పుకు సర్దుకోలేకపోతే చెడేది దెవరు?

ఈనాడు సంసార స్త్రీ ఉద్యోగం చెయ్యడం పట్నాలలో పరిపాటైంది. పోగా చిన్న చిన్న పూళ్ళలో హర్షించలేని వారు వుండవచ్చు. ఏనాటికైనా వారి అభిప్రాయం మారితీరుతుంది, అయితే సంగతులు తమ వరకు రావాలి. అంతే!

మధ్యతరగతి గృహిణి, పరిస్థితులు అనుకూలిస్తే, ఏ గౌరవప్రదమైన ఉద్యోగాన్నైనా, నిరభ్యంతరంగా చేసి, తమ సంసారాన్ని ఆనందప్రదం చేసుకోవాలి.

నేటి విప్లవయుగంలో మన తెలుగునాట సామెత "స్త్రీలు ఉద్యోగాలు చెయ్యాలా? వూళ్ళేలాలా?" ఈనాడు నప్పదు. దాన్ని [illegible]చి పోదాం.

వి. ఎల్. ఎస్. స్వామి

# కాటుక

స్త్రీకి అందంతోపాటు అలంకారం కూడా అవసరం. సహజ సౌందర్యానికి నగలూ నాణ్యాలంకంటే రేఖామాత్రంగా తీర్చుకున్న అలంకారాలే వింతైన వన్నెలు సమకూర్చి పెడతాయి.

నుదిటిపైన నొసటిని వెక్కిరిస్తూ నిర్వికారంగా నిలబడిపోయిన కుంకుమ రేఖ, నవ్వేకళ్ళకు గిలిగింతలు పెట్టి విద్యుల్లతల్లా వెలుగులు చిందేలా చేయగల కాటుక రేఖలు కుదురుగా దిద్దుకోవడం హైందవ స్త్రీ అనుదిన కృత్యాల్లో తప్పనిసరి పని.

## తాతిరెడ్డి రామలక్ష్మి

కాటుక కేవలం అలంకారం మాత్రమే అని తేల్చి పారెయ్యటానికి వీల్లేదు. అది కొన్ని కళ్ళజబ్బుల్ని కూడా నయం చేయగలదు. కంటిలో పడిన నలుసుల్ని రెప్పల క్రిందికి చేరనీయదు. అంచేత పసిపాపలకు కూడా దీన్ని వాడతారు. కళ్ళని రక్షించటంలో కనురెప్పలతో పాటు అదీ ఒక భాగాన్ని స్వీకరిస్తుంది. కళ్ళ మంటల్ని తగ్గిస్తుంది. కళ్ళని చల్లగా వుంచుతుంది.

పోతే కాటుక చేయటంకూడా పెద్ద కష్టమేమీ కాదు. అయితే జాగ్రత్తగా చెయ్యాలి. అలస్యం అయినా మనకేంయిబ్బంది వుండదు లెండి. దానికి కావలసిందల్లా ఆముదమూ— ఓ రెండో మూడో దూదివత్తులు (దీపారాధన వత్తులు కాదండీ! ఆకారం అలాగే వున్నా సదరు వత్తికి యిరవై ముప్పై రెట్లు ఎక్కువ పరిమాణంలో వుండాలి సుమండీ!) ఓ రాగి పళ్ళెం, పచ్చ కర్పూరం కావాలి.

ఓ పాత్రలో ఆముదంపోసి మొదట వత్తుల్ని నానవెయ్యాలి. అలా నానవెయ్యకపోతే తర్వాత వాటిని ముట్టించినప్పుడు చీటికిమాటికి ఆరిపోతూ వుంటాయి. అంచేత అనవసరంగా మనకు చీకాకూ అగ్గిపుల్లల దండగా లేకుండా మొదటే ఆముదంలో నానేస్తే ఏ యిబ్బంది వుండదు. వాటి నలా నానేసి రాగిపళ్ళెం తీసుకొని శుభ్రంగా తోమి కడిగి తుడిచి పెట్టుకోవాలి. రాగిపళ్ళెం అందుబాటులో లేనివారు కత్తికి (శ్రీగా వెడల్పా మందంవుండి చిలుము లేని యినుపముక్కయినా సరే వెల్లుల్లిరసంపూసి రాగిపళ్ళెరంస్థానే వాడుకోవచ్చు. రాగిపళ్ళెరమే అయితే సాధారణంగా వెల్లుల్లిరసంపూయరు. అలాచేస్తే కాటుక కొస్తా మంటగా వుంటుందంటారు. నేను మాత్రం అలా ఎన్నడూ చేయలేదు లెండి. నా అభిప్రాయం అడిగితే కాటుకకు మిగతా వాటి కన్నా రాగిపళ్ళెరం వాడటం ఉత్తమం అని చెబుతాను.

అట్టే గాలిరానిగదిలో ఓమూలగా ఓ పాత్రలో ఆముదం పోసి యింతకు ముందు ఆముదంలో నానవేసిన వత్తుల్లో ఒకదాన్ని ఆ పాత్ర మధ్యని నిలబెట్టాలి. ఆ పాత్రకు రెండు వేపులా వత్తికన్నా రెండుమూడంగుళాలు మాత్రం ఎత్తుగావుండేలా రెండు రాళ్ళని అమర్చాలి. ఆరాళ్ళపైని రాగిపళ్ళెం బోర్లించాలి. తర్వాత వత్తిని అంటించి ఆ వత్తినుండి వచ్చే పొగంతా రాగిపళ్ళెరం లోపలి భాగానికి అంటుకునేలా పళ్ళెరాన్ని సర్దాలి. ఆపైని ఓ పెద్ద వెదురుబుట్ట ఆ సామాగ్రినంతా కవర్ చేసేలా మూయాలి. అడుగున ఆముదం పోసిన పాత్రలోని వత్తి పూర్తిగా కాలిపోయి యింకా ఆముదం పాత్రలో మిగిలివుంటే ఆ కాలిపోయిన వత్తి తీసేసి మరోవత్తి అంటించాలి. ఈలాగే సేరు ఆముదము అయిపోయేదాకా ఆముదమూ, కాలిపోయిన వత్తులుతీసి తాజా వత్తులూ వేస్తుండాలి. మనం చూడవలసిన జాగ్రత్త అంతా వత్తి పొగను రాగిపళ్ళెం లోపలి భాగానికి అంటుకునేలా చేయటంలో కేంద్రీకరించాలి. సేరున్నర ఆముదం కాలిపోవటానికి అయిదారుగంటల కాలం పడుతుంది. తర్వాత రాగిపళ్ళెరాన్ని కొస్తా చల్లారనిచ్చి బయటకు తీసి దానికంటుకున్న మసినంతటిని గోకి కుప్పచేస్తే ఓ చిన్న చెంచాడు నల్లటిపొడుం తయారౌతుంది. ఇది కాటుకపొడి. ఓ చెంచాడు సగరుపొడికి అర చెంచాడు పచ్చకర్పూరం మెత్తగా కాటుకలా నూరి కలిపెయ్యాలి. అంటే

## ప్రథమపురుష: అది, వాడు, వాళ్ళు

ఆమధ్య శాబాయి కూతురు లలిత వచ్చింది పాపని చూడ్డానికంటూ. నాకన్నా పది పన్నెండేళ్ళు పెద్దది, మంచి మాటకారి. స్నానం, పానం ముగించి ప్రయాణపు బడలిక కొంత తగ్గింతరువాత, తాపీగా ప్రశ్నల వర్షం కురిపించింది.

మీ పాప బాగానే అల్లరి చేస్తుందే!! ఎవరిపోలిక అంటావ్? నాకేమో నీపోలికే అనిపిస్తోంది. ఆ ముక్కు కొస్త మీవారిది అయితే అయివుండొచ్చు కానీ, ఆ బూరి బుగ్గలూ, ఆ తెలుపు, ఆ కలిపితనం అంతా నీనోట్లోంచి ఊడిపడ్డట్లేవుంది. చిన్నప్పుడు ఇలానే వుండేదానివి నువ్వు!

నేను నవ్వేసి ఊరుకున్నా!

అది సరేకాని మీవారి జీతం ఎంత?

చెప్పేను.

అమ్మబాబోయ్! మాకన్నా చాలా ఎక్కువే! నెలకి కనీసం వందరూపాయలన్నా దాస్తుంటావనుకొంటా. ఏం?

ఆ ఏందాచటంలే! ఈ కరువుకాలంలో రూపాయలసంఖ్యే తెలుస్తోంది డాబుగా! అప్పుచెయ్యకుండా గడుపుతున్నాం. అంతే!

మరీ అంత దూరం కొరకపోతే ఇద్దరు మనుష్యులకి ఏం ఖర్చవుతుందని మహా చెప్తావు! అది సరేకాని, నెలనెలా మీ అత్తారికి 'ముడుపు' చెల్లించాలా?

ఆ......పంపుతాం! లేకపోతే వాళ్ళకి అవసరం కాదూ?

ఊఁ.. ఇంతకీ ఎంత పంపుతారు?

చెప్పేను.

హవ్వ! ఇంత పిచ్చిమాలోకం అయిపోతున్నా వేమిటే? నెలనెలా అంతంత పంపితే ఇక పిల్లలకి ఏం వుంటుందే? మీరేం తింటారు?

దానితో ధోరణి తెలిసినదాన్ని కాబట్టి నేనేం సమాధానం చెప్పలేదు. అది నూరిపోసే తెలివితేటలు మారు చెప్పకుండా వింటూ ఊర్కొన్నా....

## ఉత్తమ పురుష: నేను

దానిబోధన పూర్తయింతరువాత నేను అడగటం మొదలెట్టా. లల్లీ! అన్నయ్య (దానిఅన్నయ్య) ఎక్కడ ఉన్నాడు? వదిన మీతో కలిసికట్టుగా ఉంటుందా? మురళి ఎక్కడ చదువుతున్నాడు?

ఆ...ఏం అన్నయ్యలే! పూరిగా మారిపోయాడు! ఆ మహాతల్లి (వదిన) వచ్చినప్పటినుండీ! అమ్మకి ఓ ముప్పైరూపాయలు పంపడానికి ప్రతీనెలా ఇదైపోతున్నాడు. మురళి వాడిదగ్గరే బికాం. చదువుతున్నాడులే. వాడికి జీతంకట్టడానికి కూడా ఏడుస్తున్నాడు. మళ్ళీ రెండొందలపాతికవస్తుందనుకొంటూ జీతం! ఏంచెప్పను? చెప్పుకుంటే సిగ్గుచేటు! ఆమ్మాయ్య నేనువస్తే నేత చీర పెట్టేరు, గతిలేనట్టు. సిల్కుచీర కొనడానికి చేతులొస్తేగా? వచ్చినా...ఆవిడగారు ఊరుకుంటుందా? అమ్మ...ఏమిటో పెళ్ళి అయ్యేవరకే ఈమగబిడ్డల ప్రేమలు! అంటూ చప్పరించేసింది లల్లీ.

సి. ఉత్తర (షోలాపూర్)

# ‘మతతమ నెమలలు తప్పిన...’

స్థలం—మా ఇల్లు, కాలం—ఒకరోజు ఉదయం, రెండు నిమిషాలు తక్కువ ఎనిమిది. పాత్రలు—మేమే.

వంటింటిలో అమ్మ తమ్ముడూ—బాత్ రూమ్‌లోపల పెద్దక్కయ్య, తలుపు కివతల చిన్నక్కయ్య. డ్రాయింగు రూమ్‌లో అన్నయ్య, నేను—....నాన్న తాత్కాలికంగా రంగంమీదనుండి మార్కెటువైపు తప్పుకుని వున్నారు.

"ఏ మేవ్—ఒసేయ్—ఇదిగో...." అని నాన్న ఖాళీ సంచితో ప్రవేశించారు.

"కేక లెందుకు స్వామీ! కాయగూర లేవీ?" అంటూ అమ్మ నాన్న నెదుర్కొంది...

"ఇంకెక్కడి కూరలూ...తీరా బజారు వెళ్లి చూస్తే మనీపర్సు లేదు మరి..."

"బావుంది...చాలా బావుంది...పోగొట్టుకోవడం మీ వంశానికి మారు పేరుగా, ఒక పర్సు లేమిటి...మతులే పోగొట్టుకుంటున్నారు..."

"హారినీ! నన్ను సాంతం చెప్పనీయవే..."

"ఇంకా సా...ం...త మేమిటి సాం...తం!.."

"అది కాదే నిన్న సాయంకాలం నేను ఆగళ్ల చొక్కా విడిచానా?.... ఆ చొక్కా జేబులో పర్సుంచాను......

కాని పొద్దున బజారుకెళుతూ వేసుకున్నదేమో ఈ తెల్లచొక్కా ఆయెను......"

"అయితే—?"

"పర్సు ఆ జేబులో వుందన్నమాట..."

"అమ్మాయి కమలా! నాన్న గళ్ళషర్టు జేబులో పర్సు తీసియ్యవే..."

"పెద్దక్కయ్య ఇక్కడ లేదమ్మ" అని డ్రాయింగు రూమునుంచే పలికాను నేను.

"ఏమయిందీ......" అంటూ వచ్చారు నాన్న...

"బాత్ రూమ్‌లో వుంది...."

"చిన్నక్కయ్య ఏమయిందీ...."

"అదికూడా బాత్ రూమ్ ప్రాంతే... ద్వారానికటువైపే..కలదే" అన్నాడన్నయ్య....

"మీ రిద్దరూ ఇక్కడ ఏం చేస్తున్నారూ..?"

## ధూర్జటి ప్రమీలాదేవి

"నేను నాబాటనీ రికార్డు వెతుక్కుంటున్నాను...." అన్నాను.

"నీ బాటనీ రికార్డు నీ పుస్తకాల షెల్ఫులో వుండాలి. ఇక్కడి కెలా వస్తుందీ....?"

"అక్కడ కనపడలేదు గనుకనే ఇక్కడ వెతుకుతున్నాను.."

"నీ వేమిటోయ్ ఇక్కడ అవతరించావ్...?" అని అన్నయ్యవైపు తిరిగారు, నాన్న.

"నా సైకిలుకోసం...ఏమిస్ సైకిలు పంపుకోసం చూస్తున్నా...!"

"ఇంకానయం! సైకిలు పంపుకోసం వంటింట్లోకి వెళ్లావు కావు...హుం...ఇది ఇల్లుకాదురా...ఇల్లుకాదు..."

ఇంతలో చిన్నక్కయ్య పరుగెత్తుకొచ్చింది.

"ఏరా అన్నయ్యా...నాతర్వాత బాత్ రూమ్‌లో స్నానంచేసింది నీవట్రా?"

"అవును...ఏం?"

"నా ఉంగరం తీసి అక్కడ సోపుపెట్టెలో వుంచానూ—నువ్వేమయినా చూశావా?"

"నీ సోపుపెట్టెలో చూసేంత "మాన్ ఫెలో"ని కాను నేను...సారీ!

"ఏడిశావులేవోయ్! ఉంగరంపోయి నేనేడుస్తుంటేను..."

"హుం...ఉంగరం తీసుకెళ్ళి బాత్ రూములో అందులోనూ సబ్బుతో బాటుంచుతుంటారూ? హుం ఇది ఇల్లుకాదురా ఇల్లూ"

అంటూ నాన్న నిష్క్రమించారు అక్కడ నుండి...

"ఏవిటండీ ఇంతకూ ఇవ్వాళకి కూరలు లేవనేనా?"

"నా మొహాన పర్సు పడేస్తేగా?"

"రాత్రి ఆషర్టు నెక్కడ విడిచారూ"

'ఆషర్టునా? కోటుస్టాండుపై వుంచానూ'

"ఏమీ లేదు...రాత్రి పక్కింటి పిన్నిగారాగదిలో కూచున్నారని మీ రటు రాకనే పోతిరే?"

"అయితే ఎక్కడ విడిచానబ్బా..." అని తల గోక్కుంటున్న నాన్నగారి కాలికి ఏదో తగిలినట్లయితే క్రిందకు చూశారు...

నేలమీద ఆవాలూ, ఆవాలమీద చిన్న డబ్బా పొర్లుతున్నాయి.

"ఎంత ఆరడుగుల మనిషయినా కాని క్రింద చూసుకోక్కర్లేదూ...?"

"అయినా ఆవాలడబ్బా వలా వట్టింట్లో పెట్టమని ఎవడు చెప్పాడూ, ఆమాటకొస్తే అదేవిటి...ఇంగువపెట్టె...ఆపక్కన కందిపప్పుడబ్బా...ఇవతల మిరపకాయపెట్టె—ఏదో కిరాణాకొట్టులా ఇవన్నీ పరుచుకు కూచున్నావేం..."

"ఈ బాబిగాడేదో చేశ కావాలంటే... మొన్న మీరిచ్చిన అర్ధరూపాయి బిళ్ల ఎక్కడో పెట్టాను...అది తీద్దామనీ" అని సాగదీసింది అమ్మ.

'హుం...డబ్బులుతీసుకెళ్ళి ఇంకెక్కడా స్థలం లేనట్లు ఆవాల్లో, ధనియాల్లో, మెంతుల్లో పెట్టుకుంది. హుం...ఇంట్లో ఇది ఇల్లుకాదురా ఇల్లుకాదు..."

"కూరగాయలు లేకపోతే మానే—కొత్త ఇక్కడనుండి కదలండి బాబూ, నేను అన్నీ సర్దుకోవాలి—"

"ఇంతకూ నా చొక్కా..."

"కమల నడగమన్నానుగా" అంది అమ్మ.

"ఏమిటమ్మా నన్ను పిలిచారట?... అంటూ అప్పుడే స్నానం ముగించి పెద్దక్క కమలగారు ప్రవేశించింది.

"మీ నాన్నగారి గళ్ళ చొక్కా ఏమయిందీ..."

"గళ్ళ చొక్కావా? ఇందాక చాకలాడికి వేశానుగా..."

ఏవిటి???" అన్నారు నాన్న ఆయన్నశ్రుతిలో...

"చాకలాడికి నాన్నా!...బయట హాల్లో పెద్దపెట్టెలోని బట్టలన్నీ మాసినవేగా—వాటితో బాటు నీ గళ్ళ చొక్కా వుంటే దాన్నీ పడేశాను..."

"నా గళ్ళచొక్కా ఇంతలో—మాసిన బట్టల పెట్టెలో కెలా వచ్చిందా—" అని

---

## కాటుక

కాటుకపొడిలో సగభాగమంత పచ్చకర్పూరం కలపాలన్నమాట, తర్వాత ఆ పొడివంతా వెన్నతో తడి తడిగా కలపాలి మొత్తం పొడంతా బాగా కలిసిపోయి వెన్నలా మెత్తగా నునుపుగా జిగురుగా తయారయ్యేదాకా కలపాలి. వెన్న దొరక్కపోతే ఆముదంలోనైనా కలుపుకోవచ్చు, అయితే వెన్నతో కలిపిన కాటుకే శ్రేష్టం. అన్నట్టూ ఈ తంతంగమంతా రాగిపళ్ళెంలోనే జరగాలి.

ఈ కాటుకను దాచిఉంచడానికి దంతపు బరిణె కానీ, ప్లాస్టిక్ బరిణె కానీ, బరిణలా వుండేనవ్వ కానీవాడవచ్చు ఇవేవీ అందుబాటులో లేకుంటే ఏదైనా చిన్నడబ్బీ వుపయోగించుకోవచ్చు. కానీ చెక్క బరిణె మాత్రం వాడకండి ప్లాస్టిక్ బరిణెలు ఎక్కడైనా చవకగా అణా అర్ధణా మధ్యదొరుకుతున్నాయి. కొబట్టి వాటిని వాడటమే మంచిది. కంట్లో పెట్టుకునేది కొబట్టి దీంట్లో దుమ్ము పడకుండా జాగ్రత్తగా ఉంచుకోవాలి.



# తమ తమ నెలవులు..

జనాంతికంగా సమస్యను విసిరారు నాన్న.

"లోపల కోటు స్టాండు మీద పెట్టలేదు గనుక—" అని వివరించింది అమ్మ—

"ఇది ఇల్లు కాదు[ర]గ ఇల్—" లనబోయిన నాన్నగారు ఆగిపోయారు. ఈసారి తప్పు తమదే గనుక—"

* * *

నా బాటనీ రికార్డు ఏమయింది?

అన్నయ్య సైకిలు పంపు డ్రాయింగు రూములో కెందుకురావాలి...

పెద్దక్కయ్య సబ్బుతో బాటుంచిన ఉంగరం దొరికిందా?

అమ్మ ఆవాలు డబ్బాలో దాచుకున్న అర్ధరూపాయి కోసు ఏ పులుసులోకో వెళ్ళిపోయిందా?

నాన్నగారి మనీపర్సు వెనక్కు వచ్చిందా?

—ఈ ప్రశ్నలకు సమాధానం కావాలంటే —వెండి తెరపై చూడక్కర్లేదు. మన మన అలవాట్లనే మనం ఒక్కసారి చూసుకోవాలి. మామూలుగా మన ఇళ్ళల్లో ఇలాటి రభస జరగని రోజు అరుదు. పుస్తకాల్లో రూపాయి నోట్లు, పరుపుల క్రింద పుస్తకాలు, కోటు జేబులో సైకిలు తాళాలు, బల్ల మీద చెప్పులు, గోడ మీద ... లాంటి అవస్తులు మన అలవాటే.

ప్రతివస్తువుకు ఒకచోటు అని నిర్ణీతంగా లేకపోవడం వల్లా — అథవా అలావున్నా, తీసిన చోట వుంచకపోవడంవల్లా నలుగురున్న ఇళ్ళల్లో ఎంతో అవస్థగా వుంటుంది. అందులోనూ కొత్తస్థలం తక్కువ వున్న వారయితే బాధ వర్ణనాతీతం. కాబట్టి పిల్లలుండి పెద్దవారిదాకా దువ్వెన ఇక్కడ వుండాలి. చెప్పులు ఆమూల, కంచాలు ఆ షెల్ఫులో, బట్టలు దండెం మీద, పుస్తకాలు అలమారులో—అని నిర్ణయించుకోవాలి.

ఎంత చిన్న ఇల్లు అయినా (ఇంటిలో వాటా అయినా) ఇదేమంత కష్టం కాదు. అలా నిర్ణయించుకున్న తర్వాత ఆయా వస్తువులను తీసుకుని వాడుకున్న తర్వాత, ఏమాత్రం బద్ధకించక ఆవస్తువుని దానిచోటుకు చేర్చడం అందరికీ లాభదాయకం.

కొంత అలవాటయేదాక ఇది కష్టమనిపించినా ఇందుమూలంగా—కావలసిన వస్తువు కావలసిన సమయానికి దొరక్కపోవడం, బోలెడు కాలం వృథా అవడం, అనవసరంగా మాటలు పెరగడం లాటి చిన్న చిన్న ఇబ్బందులన్నీ తొలగిపోతాయి. ఇల్లు చూడడానికి శుభ్రంగా వుంటుంది. ఇంట్లోని వారు సదా ఏదో అన్వేషణలో వుండటం మానేసి, కళకళలాడుతూ ఎవరిపనులు వారు చూచుకుంటూ వుంటారు.

"ఒక మనిషి 60 ఏళ్లు జీవిస్తే అందులో 20 ఏళ్ళు నిద్రపోతాడు; 14 ఏళ్ళు పని చేస్తారు; 5 ఏళ్ళు ప్రయాణం చేస్తాడు; 4 ఏళ్ళు చదువుతాడు; 5 ఏళ్ళు తింటుంటాడు; 3 ఏళ్ళు జబ్బుతో పడకమీద వుంటాడు; మిగతా 9 ఏళ్ళు బస్సుస్టాప్‌లల్లో నిల్చోవడం, బాతాఖాని వేయడం లాటి పనులకు సరిపోతాయి—" అని పాశ్చాత్య డాక్టరాయన లెక్క కట్టాడు.

వస్తువులిలా తారుమారుగా వుంచుకుని, వాటిని వెతకడానికి జీవితంలో ఎంతకాలం వ్యయమవుతుందో?

కనీసం ఒక్క సంవత్సరం — అని నా అంచనా!!





## గోధుమరవ్వ పొంగలి

కావలసిన సామానులు: పెసరపప్పు 1/4 పడి, నెయ్యి 10 పలాలు, గోధుమరవ్వ ½ పడి, పసుపుపొడి 1/16 పలం, జీలకర్ర 1/4 పలం, మిరియాలు ½ పలం, ఉప్పు ½ పలం, తురిమిన కొబ్బరి 8 పలాలు (ఒకపడి అంటే మానిక; లేక శేరు.)

చేయువిధము: పెసరపప్పు ఓ ఇరవై నిమిషాలు నానబెట్టాలి. తరువాత ఒక గుడ్డలో వడియగట్టి అరగంట ఎండబెట్టాలి. పిమ్మట తిరగలిలో వేసి, సన్నని రవ్వగా విసురుకోవాలి. బాణలిలో నెయ్యి వేసి, కాగనిచ్చి, అందులో గోధుమరవ్వపోసి ఎఱ్ఱగా వేయించాలి. తరువాత ఎండబెట్టిన పెసరరవ్వతోపాటు గోధుమరవ్వకూడా వేసి కలిపి, అనపడినీటిలో ఉప్పువేసి ఈ రవ్వలు కూడా పోసి వుడకబెట్టాలి. అన్నంగా అయినతర్వాత పసుపుపొడి, జీలకర్ర, మిరియాలపొడి వేసి కలపాలి. పాత్రను క్రిందికి దించినతర్వాత తురిమినకొబ్బరి వెయ్యాలి. ఇష్టమున్నవారు కొబ్బరి వేయుటకు బదులు ఐదుపలాలు జీడిపప్పు నేతిలో వేయించి కలుపుకోవచ్చును.

చిత్తూరు టి. భూమాదేవి.

# పావురాల పెంపకం

పావురాలలో పందెపు పావురాలు తప్ప మిగతావాటిని పెంచటం సులభంగా వుంటుంది. జంట పావురాలను తీసుకవచ్చి ఒక్కొక్కదానికి రెండు ప్రక్కలా రెక్కలు దారాలతో కట్టివేయాలి. వాటిని ఒకగూడు (లేక 'అర')లాంటి దానిలో వుంచాలి. గూడు కొంచెం విశాలంగా వుంటే బావుంటుంది. రెండేటి నీరోజూ ప్రొద్దునా సాయంత్రమూ, గూడునుంచి బయటకు విడవాలి. రెక్కలు కట్టివుంచినందున ఎగిరిపోలేవు. అన్నిరకాల గింజలను తింటాయి. పావురాలు అన్నిటికన్న "కుసుమలు" ధాన్యంఅంటే చాలా ఇష్టంగా తింటాయి. నీళ్ళు, దగ్గరలోనే డబ్బాలాంటి దానితో వుంచాలి. వాటిని రోజూ బయటకు తీసుకొనివచ్చి ఇంటి ప్రాంతాలన్నీ బాగా గుర్తుపట్టేలా తిరగనివ్వాలి. తర్వాత కొన్ని దినాలకు బాగా అలవాటుపడతాయి. అప్పుడు రెక్కలకు కట్టిన దారాలు విప్పివేయాలి. ఇంటిప్రాంతాలు గూడు, బాగా జ్ఞాపకం వుంటాయి గాబట్టి ఎక్కడ తిరిగినా వచ్చి, గూడు చేరుకుంటాయి.

పావురాలు మూడునెల్లకు రెండు గుడ్లు పెడతాయి. వాటికవే గూడులో గడ్డి మొదలైనవాటితో మెత్తలా తయారుచేసుకొని వాటిమీద పొదగటం మొదలుపెట్టాయి. పంతులు ప్రకారము రెండు పావురాలు (మొగ పావురము, ఆడపావురము) పొదుగుతాయి. ఇరవై రోజులలోపలే పిల్లలవుతాయి. వాటికి ప్రత్యేకంగా తిండిపెట్ట వలసరములేదు. పావురాలే తమ పిల్లలకి ముక్కుతో గింజలను తినిపిస్తాయి.

పూర్వకాలాలలో పావురాల ద్వారా రాజులు మొదలైనవారు, వుత్తరాలు పంపుకొనేవారు. యుద్ధ సమయాల్లో ఇవి చాలా సహాయకారులుగా వుండేవి.

యం. రాగమణి (ఉరవకొండ)

* * *

బందరునుండి ఒకసోదరి పావురాలు పెంచే విధానం తెలియజేయమన్నారు. సెమలి తరువాత చెప్పుకోవాలంటే పావురానిదే స్థానం. పావురాలు చాలా మచ్చికగలపక్షులు. వీటిని చూస్తుంటే పెంచుతున్నవారికి యెంత ఆనందం కల్గుతుందో చెప్పలేం. ఇందులో చాలా రకాలుంటాయి. 1 మోజా (కాలికి నిండుగా పాదాల్ని కప్పినట్లు వెంట్రుకలుంటాయి) (2) తలపై జుట్టున్నవి వుంటాయి (3) ఈరెండూకలవి అంటే జుట్టూ మోజావున్నవి వుంటాయి. అడవి పావురాలలో రెండు రకాలుంటాయి (1) నలుపువి (2) పచ్చవి. వీటిని వేటాడి తింటారుకూడ.

నేను చాలా పావురాల్ని పెంచాను అన్నిరకాల్లో. వాటిని పెంచకూడదని యెందరో చెప్పినా వినలేదు. అవి బియ్యము, ధాన్యము రాగులు, గంటెలు తింటాయి. వాటికి జబ్బులురాకుండా వుండటానికి రెండునెలలకొకసారి ఒక చెమ్చా నువ్వులనూనె ఒక్కొక్కదానికి పట్టాలి. ఇలా చేస్తే తెగులు (జబ్బు)రాదు. వీటి గూళ్ళను యెప్పటి కప్పుడు శుభ్రపరుస్తుండాలి. ఒకసారి అకస్మాత్తుగా మా పావురాయిలు రోజుకి కొన్ని చొ॥ చనిపోయి గూటిలో కనపడేవి. కారణమేంటా అని ఆలోచించి ఓనాటిరాత్రి కాచుకూర్చుంటే త్రాచుపాము వచ్చి వాటిగుడ్లను మింగి వాటిని పొడిచి హాయిగా పోతోంది. దాన్ని చంపేశామనుకోండి. ఇటువంటి ప్రమాదాలు రాకుండా వాటిగూళ్లకు సాయంకాలం తలుపులు వెయ్యాలి. పావురాలు 108 వరకు పెరిగితే ఆయింటికి నష్టమంటే నేను నమ్మకుండా పెంచాను. కాని అవి పెరిగేకొలది యింట్లో కష్టాలుకూడ పెరిగాయి. ఆ అనుమానంతో నా పిట్టల్ని పిడిచిపెట్టేశాను. అప్పటినుండి ఖులాసాగా యున్నాం. దానిపై నాకు చాలానమ్మకం. మాది కొండ ప్రాంతం కాబట్టి మాపిట్టల్ని చిరుతపులులు ఇతర జంతువులూ కూడా తినేసేవి.

వి. ఈశ్వరి (అలుదు శ్రీకాకుళంజిల్లా)

## గృహరామాయణం

భౌతిక, రసజగత్తుల మధ్య ఊగే ఊయెల నిజానికి గృహాసీమలో హాసడోల. సంసారంలో హాసమాలికలు దీపకళికలై ఇంటికి వెలుగునిస్తాయి.

ఒక మరదలు, చాలాచదువుకున్నదాన్నని తెలివికలదాన్నని గర్వం. తనకన్నా చాలా తెలివితక్కువవాడుగా తాను భావించే బావగారికి అన్నం వడ్డిస్తూ 'ఏం బావా, కూర యేమైనా వాసయోగ్యంగా ఉన్నదా ?' అని అడిగింది వేళాకోళంగా. ఇంటికి పెట్టాల్సిన విశేషణం కూరకు తగిలించిన మరదలు జాణతనానికి ఆయన ఉలిక్కిపడి, తత్క్షణం ఆమెకు తగ్గట్లు "చాలా శ్రావ్యంగా ఉంది' అన్నాడు.

క్షణం ఆలోచించింది మరదలు. సేవ్యంగా ఉంది అనడానికి తెలీక శ్రావ్యంగాఉందిఅన్నట్లా, శ్రావడీ యిచ్చి గ్రాంధికంగా అన్నట్లా, లేక వెటకారంగా తన పరిభాషలోనే సంగీతానికి పెట్టే విశేషణం కూరకు తగిలించినట్లా-తన ప్రశ్న చాలా శ్రావ్యంగా ఉందని వెక్కిరించినట్లా ? అట్లా-ఇట్లా విచారించి, వితర్కించి, తికమకపడి, ఏమీ తేలక అన్నం అడిగితే కూర, చారు అడిగితే మజ్జిగ కుమ్మరించి నాలిక చటుక్కున కొరుక్కుంది మరదలు పిల్ల.

చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవా అని సణుక్కుంటూ ఆ'చొచ్చా'తిని చేయి కడుక్కున్నాట్ట ఆ బావగారు.

# ★ ఉత్తరాలు ★

( 2-వ పేజీ తరువాయి)

విశదీకరించి వారి ప్రోత్సాహానికి తోడ్పడిన, శ్రీ ఆమంచర్ల గోపాలరావుగారికి నా ధన్యవాదాలు.

జి. వెంకటేశ్వరరావు, గుడివాడ.

*　　*　　*

"దొంగలు" వ్యాసకర్త గోపాలరావుగారు యింతటితో ఆగక యింకా యిటువంటి పనికివచ్చే వ్యాసాలు వ్రాస్తారని ఆశిస్తున్నా, ఇప్పటికి "మధ్యభారత్"లో అటువంటి దొంగలు ఉన్నారని వింటున్నాం. ఇందులో అసహజం ఏమీ లేదు.

ఎస్. నర్సింహాచార్యులు, నర్సాపురం.

*　　*　　*

శ్రీ గోపాలరావుగారు దొంగల్ని వెనకేసుకొస్తున్నట్లు తోచింది. అంతేకాక ఆ "కళ" అంటే ఆయనకు అంతో యింతో "అభిమానం"కూడా వున్నట్లు తోస్తోంది. అసలు ఆ వ్యాసం ఏ వుద్దేశంతో వ్రాసిందీ, ఏ విధంగా పాఠకులకు ఉపకరిస్తుందని వ్రాసిందీ శ్రీ గోపాలరావుగారు తెలియజేస్తే ఆనందిస్తాను.

విశాఖపట్టణం :　　యగళ్ళ రామకృష్ణ.

*　　*　　*

"దొంగలు" విషయ మేమంత ఉదాత్తమైనది కాకపోయినను చిత్రీకరణం సాఫీగానే సాగింది. కాని పైవ్యాసాలు చదివిన మీదట, కొన్ని అంశములు ప్రస్తుత కాల కాలపు పరిస్థితులనుబట్టి చదువ నేర్చిన దొంగల కుపకరింపగలవేమో యని సంశయించుట కవకాశము లేకపోలేదు. వీనితోపాటు రచయిత దొంగలబారినుండి తప్పించుకొనే మార్గాల్ని కొన్ని ఉదహరిస్తే కొంత ఉపయోగకరముగా ఉండేది.

*　　*　　*

"ఆశ"—విజయనగరం.

22-7-59 వ తేదీ సంచికలో యిద్రి భక్తవత్సలరావుగారు తమ వుత్తరములో వెలిబుచ్చిన అభిప్రాయాలు చదివాను. నేర పరిశోధనతోను, నేరస్తులతోను పరిచయము లేనివారు సహజముగా వెలిబుచ్చే అభిప్రాయాలే యివి: నా స్వానుభవములో చూసిన విషయమేమంటే నేరస్థ జాతులను నేరములో పట్టుకొన్నప్పుడు, తప్పించుకొనుటకై ఏ సాహసానికైనా వెనుదీయరు. ఒక కేసులో అరెష్టుఅయిన ఒక నేరస్థ జాతికిచెందిన వ్యక్తి తన ఏడాది మనుమని, కాళ్ళుపట్టుకొని నేలకు వేసికొట్టిన వుదంతము నా స్వానుభవములో చూచిన సంగతి.

పూర్వకాలము జరిగే విషయములటుంచి. ప్రస్తుతం జనసమ్మర్ధముగల నగరములో, బజారులలో తిరుగు బీదబాలురను చేరదీసి జేబు దొంగతనములు చేయుటలో శిక్షణ యివ్వడమనేది అందరికి తెలిసిన విషయమే.

గోపాలరావుగారి వ్యాసాలలో వాస్తవం వున్నదనుటలో సందేహములేదు. నేరస్తులు తమ వృత్తిలో ఎప్పటికప్పుడు టెక్నిక్ అభివృద్ధి పరచుకుంటూనే ఉంటారు. నేర పరిశోధక శాఖవారు తమ పరిశోధక టెక్నిక్‌ను వృద్ధిపరచుకుంటూ పోటీలో ముందుకు పోయేందుకూ సతమత మవుతూనే వున్నారు.

మిక్కిలినేని గోపాలరావు—
హైదరాబాద్.

## నదిచేసిన బదిలీ

ఈ మధ్య చీనాబ్‌నది వరదవల్ల గతి మారిందని, తన్మూలంగా ఏడు భారతీయ గ్రామాలు గతి పాకిస్థాన్‌కు బదిలీఅయి నల్లిపోయిందని వార్త. వాటిగురించి మన శాంతి ప్రియప్రభుత్వం ఎటి చీకూచింతా లేకుండా వాటిని మనసారా అశాంతి ప్రియ దేశానికే చెందేటట్లు వదిలేస్తే బాగుంటుందని నా అభిప్రాయం. ఎందుకంటే, వాళ్లకు మనకూ మధ్య నదివగైరా పరిహద్దులు లేని చోట్ల (పూహా మాత్రపు పరిహద్దుల వద్ద) మనపై కాల్పులు సాగిస్తోంటే, తిన్నగా వళ్లి గట్టిగా బుద్ధిచెప్పకుండా తీవ్ర అసమ్మతి పత్రాలే యిస్తోంది మనదేశం. మధ్యన పెద్ద నదివుండి, ఆ వడ్డునవున్న యీ 7 గ్రామాలపై (ఇండియాకు చెందేపక్షంలో) ఏ అర్ధరాత్రో, అపరాత్రో కాల్పులు సాగిస్తే, వాళ్లకి దిక్కు దేవుడు కూడా వుండడు. (ఉండేటట్లయితే ఆనది అట్లా దారి పిరాయించేది కాదు!)

మద్దిపట్ల నాగేశ్వరరావు, నరసాపురం.

*　　*　　*

ద్వివేదుల కమలగారి 'అనుమానాలు ఏమంత బాగులేవు. అసలు వారా వ్యాసం ఏ ఉద్దేశ్యం దృష్టిలో పెట్టుకుని వ్రాశారో అర్థం కాలేదు.

గొ. జగన్నాథం (ఎలమంచిలి)

భర్త పూరికెడ్తూ భార్యను తలగువ్వకో వద్దు, మంచి చీర కట్టుకోవద్దు అని చెప్పే వాళ్ళుంటారని నేను నమ్మను. ఏదో విధంగా వ్యాసం పూర్తి చేయటానికి ఆమె అలా వ్రాశారని అనిపించింది చదువుతూ వుంటే.

వేలూరి దుర్గ (హిరాకుడ్ కాలనీ, ఒరిస్సా)

*　　*　　*

కమలగారు వ్రాసిన వ్యాసం చదువుతుంటే నాకు నవ్వొగలా.

పుష్పావతిగారు వ్రాసిన 'కోటి వగలు' వ్యాసం బాగుంది. కాశీ వెళ్ళి కాశీ విశ్వేశ్వరుణ్ణి దర్శించాలి, రామేశ్వరంవెళ్లి రాముణ్ణి చూడాలి, కార్తిక మాసంలో గోవును దానంచేయాలి, అని అంటుంటారు. గుమ్మంలో కొచ్చిన భిక్షగాడికి మాత్రం గుప్పెడు బియ్యం వేయరు.

ఆచంట కృష్ణవేణి (పేరవరం)

అనుమానాలు చదువుతుంటే ఎంతో బావుంది. రచయిత్రి ఎంతో వేగంగా ఎవరో తరుముకువస్తున్నట్లు చెప్తూవుంటే చదివే వాళ్ళకు బావుంటుంది. ఆరచయిత్రికి నా అభినందనలు అందజేస్తున్నాను.

వెనిగళ్ళ ఝాన్సీ (కైకలూరు)

*　　*　　*

రచయిత్రి ఒక చక్కటి వ్యాసమువ్రాద్దామని ప్రారంభించి, ఏవో కొన్ని ఉదాహరణలిచ్చి అనుమానాస్పదంగా ముగించారు. దొంగకి దొరికి పోతానేమో అని 'భయం' వుంటుంది గాని అనుమానం వుండదు. రచయిత్రి 'అనుమానం' 'భయం' లను పర్యాయ పదాలుగా వాడినారు.

జి. వి. వి. యస్. రామచంద్రరావు
(హైదరాబాదు)

*　　*　　*

వి. సత్యవతి గారు వ్రాసిన 'అనుమానాలు' అనే వ్యాసం చాలా బాగుంది. నాకు బాగా నచ్చింది.

కె. ముంతాజ్ బేగం (కాకినాడ)

*　　*　　*

ఈమధ్య వనితాలోకంలో వంటలు ప్రచురించటము తగ్గించారు. వ్యాసాలతోబాటు వంటలుకూడా ప్రచురించిన యెడల అప్పుడే గృహస్థాశ్రమం స్వీకరించిన నాబోటి గృహిణులకు ఉపయోగకరంగా ఉంటుంది. 'మీ అభిప్రాయం ఏమిటి?' అని యిచ్చిన సంఘటనకు 'శాస్తి' అని పేరు పెట్టాలని నా అభిప్రాయం. కొందరు పెద్ద వాళ్ళు రైలు ఎక్కిన దగ్గరనుంచి దిగేవరకూ ప్రశ్నలవర్షం కురిపిస్తారు. పెళ్ళైందీ అంటే ఏం ఉద్యోగం, నెల కెంతిస్తారు? పైన ఎంత దొరుకుతుంది (లంచం) అని ప్రశ్నిస్తారు. ఈప్రశ్నలతో రైలు ప్రయాణమంటేనే భయం వేస్తోంది.

పి. స్వరాజ్యలక్ష్మి (విశాఖపట్టణం)

# ఆరుద్ర గళ్ల నుడిగట్టు 12.



## ఆ ధా రా లు

### అ డ్డ ము

1. కొంత రాష్ట్రంగాని అంత రచించమనే ఆటంకము.
3. పాపాకాలి పునరుజ్జీవనంవల్ల పాలేరాఅన్న ప్రశ్న జనిస్తుంది.
5. పహారావాళ్ళం అనే సముద్రం.
7. తుచ్ఛుడు!
8. రివాల్వర్ మధ్య సెగరకొట్టి ఆహ్వానించు!
9. ప్రతిపాదనలో మొదలేటి వ్యతిరేకం!
11. ఆరామం చెడ కుంకుటలోపాలంలో కట్టేది.
13. సిల్కు మోటారు శకటం మరమ్మతు సాధనం.
14. గోదావరి ఈదడానికి పనికిరాని సాధనం.
15. బిచ్చమెత్తిన బియ్యము పిడికెడు కాబోలు.

### ని లు వు

1. శిరచరణము, పీడ్కోలు.
2. కబళం రాలుటవలన ముగ్ధ!
3. పాపకలతనుండి పురాతనమైన కర్రలు పుట్టవచ్చు!
4. స్వేచ్ఛాపాలనలో తల్లకిందైనపాదుషా!
5. తోక తెగిన పిపాసి తిరగబడితే పాపం చేసినవాడు!
6. ముగ్ధ రంగానికి సంబంధించిన తీగ కాబోలు!
9. స్వగతము కాని ఆంధ్రకేసరి.
10. తిరుగుబాటులోని ద్రావిడశ్రీకారం!
11. నియమం కుదరనప్పుడు మధ్యలో మొండికెత్తడం.
12 చెక్కుట అదేశిల్పము!

## 11-వ నుడిగట్టుకుజవాబులు




వనితాలోకం అనే ప్రత్యేక శీర్షిక వనితలకు ప్రత్యేకించటము, అంతగా బాగు లేదు. ఆ ప్రత్యేక శీర్షికను తీసివేయడమో లేక నలుగురికీ ఉపయోగపడేవో వ్రాయాలనే ఒక నిబంధన యేర్పరచటమో చేస్తే కొంత వరకు బావుంటుందని నా అభిప్రాయము.

లోకనాథస్వామి, ఎం. సింపూరా ఖర్గపూర్

* * *

ఆర్. వి. సుబ్బమ్మ (విజయవాడ)

ఆరుద్రగారి గళ్ళనుడికట్టు మాకు వారం వారం మంచి కాలక్షేపాన్ని కలిగిస్తోంది. అనుమానాలు వంటి వ్యాసములు తరచు వనితాలోకంలో ప్రచురించెదరని తలచెదను.

పెద్దిభొట్ల శకుంతలాదేవి (పెనుమత్స)

* * *

"అనుమానాలు" వరుసగా అనుమానాల పరిడ వ్రాసినట్లుగా వుంది. ఏదైన వ్యాసం వ్రాస్తే అందరికి ఉపయోగపడేదిగా వుండాలి కాని ఇలా చెత్తగావుంటే చదువరులకు విసుగు కలిగిస్తుంది. ఈ అనుమానాలైనా సహజంగా లేవు.

జి. భాను (నిడుబ్రోలు)



## గులాబి

అది వర్షాకాలం. నేను గులాబి కొమ్మలు కోసి పాతుతున్నాను. ఆ దృశ్యం మా చెల్లెలు ఆరేళ్ళ రమణి చూసింది. నేను నా పని పూర్తిచేసుకొని, ఇంట్లోకి వెళ్ళి ఆ పనీ ఈ పని చేసి, మళ్లీ పెరట్లోకి వెళ్ళాను. వెంటనే ఆశ్చర్యపోయాను. మా రమణి ఎవరేంపని చెప్పినా వినేది కాదు. అలాంటిది అవాళ చెట్లకి నీళ్ళు పోస్తోంది. దాని దగ్గరికి వెళ్లి "ఏమిటే ఇవాళా పని చేస్తున్నావు?" అని అడిగాను. అప్పుడది "అది కాదే అక్కా! మ లేమో గులాబి ఆకులు పాతిపెడితే చాలా చెట్లు వచ్చి చాలా పూలు పూస్తాయి, అని పాతిపెట్టాను. అందుకని వాటికి నీళ్ళు పోస్తున్నా" అంది. నాకు నవ్వు వచ్చింది. దానితో నేను, "చెట్లకొమ్మలు పాతాలి కాని, ఆకులు పాతితే చెట్లు రావు" అన్నాను. మా రమణి "మ లే, కొమ్మ పాతితే ఒక్క చెట్టే వస్తుంది. చాలా ఆకులు పాతితే చాలా చెట్లువచ్చి చాలా పూలు పూస్తే నేను పెట్టుకుంటాను," అంది.

ఆర్. నాగమణి-హైదరాబాదు.



# పుస్తక సమీక్ష

ఏడుగోజుల మజిలీ: రచన: పోతుకూచి సాంబశివరావు. ప్రచురణ: వాణీగ్రంథమాల, సికిందరాబాదు. 184 పేజీలు. వెల: 3-0-0.

"వాస్తవానికి సాన్నిహిత్యం-వ్యక్తిత్వానికి పరిపూర్ణత్వం - క్రియగా రూపొందలేని భావానికి ఔన్నత్యం - బ్రతుకుమాంద్యాన్ని కరిగించి నరాలలో స్రవించి ఉత్తేజిత పరిచే నవచైతన్యం - మనిషితో మనిషే మూగజంతువు మాపే మనిషికిమించిన నైతిక దృక్పథం - మానవత్వానికి విశిష్టతనేకూర్చే ప్రేమతత్వం - శ్రుతుడి ప్రభావంతో గురుడి స్థానంవరకూ కదిలిన అనుభూతుల మననం- సిద్ధదివాల సోపానాలు అధిరోహించిన మమతల హృదయం - శిలలై శిథిలమై బాట విర్పడింది యీ మజిలీకి"—అని సాంబశివరావుగారు ఈ పుస్తకం మొదట్లో వారి 'మాట'గా రాసుకున్నారు.

శ్రీనివాసు అనేయువకుడు వారంగోజుల పాటు ఒకొనొకవూరికి పోవడం-అక్కడ లివ అన్న ఆఫీసరుగారి రెండో భార్యపై మక్కువపడటం-ఆమెకూడా ఇతన్ని ప్రేమించటం-చివరికి-"పరపురుషుని ప్రేమించినంతగా ఆత్మీయులను ప్రేమించివున్నట్లయితే జీవితంలో ఈ పాటికి ఎంతో సంతృప్తి, ఆనందం కలిగేవి" అని ఆమె సమాధానపరచుకోవటంతో "ఏడురోజుల మజిలీ" పూర్తవుతుంది. "అసలు జీవితంలో నిజమైన ఆనందం కలగాలంటే మానసిక దృక్పథం ప్రధానం కాని, జీవితంలో జరిగే సంఘటనలు కాదు. ఇంద్రియతృప్తి ఆనందానికి ఒక మార్గమే గాని, అదే పరిపూర్ణమైన ఆనందానికి హేతువుఅని చెప్పలేము. దేహం ఎంతకాలం యౌవనంలో వుంటుంది? ఎంతకాలం ప్రపంచంలో ప్రాణంతో వుంటుంది?"-లాంటి ఘోషలను సాంబశివగారు మళ్ళీ లోకానికి గుర్తుచేశారు.

ఒక నవలలోని కథ మంచిదయినంత మాత్రాన ప్రయోజనంలేదు. కథ నడిపించే తీరు ముఖ్యంగా "మంచి"గా వుండాలి. ఈ నవలలోని సన్నివేశాలు దాదాపు ఒకేరీతిగా వుంటూవచ్చినందువల్లా, చెప్పదలసిన భావాన్ని డొంకతిరుగుడుగా ఆంగ్లంలో ఆలోచించి 'తెలుగు'లో రాసినవాక్యాల్లో చెప్పటంవల్లా-చదివేవాళ్లకు నిరుత్సాహాన్ని కలిగిస్తాయి. ఐతే అంతలోనే పుస్తకాన్ని పూర్తిచేదామనే ఉత్సాహమూ కలుగుతుంది! "సింబాలిక్ టచెస్", సన్నివేశాల వర్ణనలూకూడా ఈ పుస్తకంలో మనకు లభిస్తాయి

—సుకుమార్.



## షట్కథాప్రణాళిక

అనామిక కథలసంపుటి. రచన: ఇంగువ శ్రీనివాస. వెల ఒక రూపాయి. ప్రాప్తిస్థానం: సుమన్ ప్రచురణలు, కోర్టువీధి, ఒంగోలు.

మదిరా, మదవతీ పాశ్చాత్య కవితా సామగ్రి. అలాగే పార్కులూ, పడకటిళ్లూ కస్సు కౌటుకకళ్లూ, కట్టుకున్నదాని కన్నీళ్లూ, పచ్చుక్లబ్బులో మేనువాల్సూ, సిగిరెట్ల పీల్పూ; కాఫీ అందింపు, కౌగిలి బంధింపూ దాదాపు నేటి మన కథా రచనా సామగ్రి.

### చప్పున చెప్పుకోండి

[జవాబులు]

1. వాషింగ్టన్ 2. ఇక్కట్టు 3. జహాంగీరు 4. వార 5. టీ 6. పాతాళలోకం, తాళవృక్షం, భైరవి, రవి.

### ప్రాసక్రీడలు—జవాబులు

వేలు; విలువ; జోల; పిడత; రాజు; వెలుగు; చెలగు.

శోకం వాడు శ్లోకమైతే అప్రయత్నంగా వాల్మీకి కవి అయినాడు. కాని నేడు కథ పేరిట నాలుగు పేజీలు నిండితే రచయిత కథకుడై పోతున్నాడు. అయిపోతున్నదానికి అనుకుని లాభంలేదు. అనుకోకుండా వుంటటం మానవసహజమూ కాదు. కృత్యాద్యవస్థలు లేకుండా రచనలు సాగిపోతున్న ఈ కాలంలో కథ సాహితీ సరస్వతికి 'ఉత్తమాంగం' అయింది. నేటి ప్రథమ - కాకపోయినా ప్రధాన సాహిత్యాంగం కథ.

అనామిక అనే పేరుగల ఈ చిన్ని పుస్తకం ఆరుకథల సంపుటి. 100 పేజీలు. పాకెట్ సైజులో ముచ్చటగా వేశుంది. ఆరుకథలూ రసపిపాసకు షడ్రసాలు అందిస్తాయి. ముఖ్యంగా పరాజిత, మిస్ మేరీలత, గులాబీ ముళ్ళు బాగున్నాయి. పరాజిత దాదాపు ఒక జీవితం. కథ కాదనిపిస్తుంది.

పోతే అనామిక అనే పేరు ఈ పుస్తకం- అంటే చేతులో ఇమిడిపోయే పుస్తకానికెలాతగునో తెలీదు. రచయిత వివరించలేదు. చిటికెనవేలు ప్రక్కవేలు అనామిక. పేరూ ఊరూ చెరిగిపోయిన అభాగిని కూడా అనామిక కావచ్చును. అయితే ఇందలి ఆరుకథల్లోను కనిపించే స్త్రీపాత్రలకు కొన్నిటికి ఇది వర్తిస్తుందేమో. 'జయాపజయాలు' అనే కథలో 'జయ' అనామిక—అలాగే పరాజితలో కథానాయకి—

ఏదియేమైనా సమకాలీన సాహితీమహతీ స్వరరీతి వినాలంటే యాదృచ్ఛికంగా కథాతంత్రిని మీటి చూడాలి. అందుకయినా కనీసం ఇటువంటి కథానికలు ఓపిగ్గా చదవటం అవసరం.

నురుగులు కక్కుతూ పరుగులు పెట్టకుండా, ప్రగతి పేరున ప్రయాస పడకుండా సవ్యత్వం అభిలషిస్తూనే, ఈ కథాసంపుటి 'అమ్మమ్మ'కు అంకితం ఇవ్వడంద్వారా రచయిత ప్రాచీనతపై తమ భక్తిగౌరవాలు వెల్లడించుకున్నారు.

—వేటూరి.




Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd. by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.

# తిరిగి ఐశ్వర్యముగా పూర్తి స్వస్థత చేకూరుతుంది !



పిల్ ఫర్ - ఫ్రాంక్.
మూలితోను,
ఎట్టి లేబిల్ తోను
ఇప్పుడు సరఫరా
చేయబడుచున్నది.

వాటర్ బరీస్ కాంపౌండ్ టానిక్కును ప్రపంచములో ఆరోగ్యమును వాంఛించు పిన్నలు పెద్దలు అందరూకూడా ఆరోగ్యము నిచ్చుటలో సాటిలేనిదని పేరొందుటచే విడువక వాడుచున్నారు.

వాటర్ బరీస్ కాంపౌండ్‌లో ముఖ్యమైన పోషక పదారములు కలసియుండుటచే సౌఖ్యప్రదమగు జీవితమును ప్రసాదించి మీ కుటుంబమునకు అవసరమైన అదనపు శక్తిని చేకూరును.

వాటర్ బరీస్ కాంపౌండ్ ఎడతెగని దగ్గు, పడిశము, శ్వాసకోశపు రుగ్మతలను నివారించును. వ్యాధినుండి త్వరితముగా కోలుకొనుటకు డాక్టర్లు దీనిని సిఫారసు చేయుచున్నారు.



ఇప్పుడు వాడుకలో
లేని ఎట్టరాపర్

## ఆరోగ్యమునకు హితమైన

# వాటర్‌బరీస్ కాంపౌండ్